# రష్యన్ కథలు

అనువాదం
నార్ల వెంకటేశ్వరరావు

నవయుగ ప్రచురణాలయం
పెదనగల్లు (పోస్టు)
కృష్ణాజిల్లా

॥

సఖుడు, సహృదయుడు

స్వాతంత్ర్యోపాసి

త్యాగశీలి

శ్రీ రామానంద చౌదరికి

# కథాసూచిక

# ప్రకాశకుల విజ్ఞప్తి

"నవయుగ కావ్యాలు" అనే శీర్షికతో మన సంఘానికి నవ్యమార్గాల్నీ, నవీనరుచుల్నీ చూపించగల ఉత్తమగ్రంథాలను ప్రకటించడం మాఆశయం. కేవలం సారస్వతానికి సంబంధించినవాటినే కాకుండా, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, చారిత్రక గ్రంథాల్నీ, ఇంకా ఇతరమైనవాటినీ మేము ప్రకటిస్తూ వున్నాము.

మా ప్రచురణాల వెల ఏ సందర్భంలోనూ అర్ధ రూపాయికి మించదు; బేడకు తగ్గదు. అర్ధ, పావలా, బేడ—ఈ ధరలకు రకరకాల పుస్తకాలను ప్రకటించాలనీ, ప్రచారానికి తేవాలనీ మాసంకల్పం.

మా ఆశయాలను హర్షించి, మా తొలిప్రచురణంగా తాము తెనిగించిన రష్యన్ కథలను ప్రక

టించడానికి అవకాశం కల్పించిన శ్రీ నార్ల వారికి మా వందనాలు.

ఈ పుస్తకం ముఖచిత్రాన్నిగురించి ఒక్కమాట : ఇది మేక్సిం గార్కీ చిత్రం. అడగగానే దీన్ని ఇంత ఉత్తమరీతిని గీసిఇచ్చిన మిత్రులు శ్రీ కొత్తపల్లి సుబ్రహ్మణ్యంగారికి మా కృతజ్ఞతా పూర్వక వందనాలు.

ఈ రష్యన్ కథాసంపుటిని ఆంధ్ర దేశం సముచితరీతిని ఆదరిస్తే, బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, స్పెయిన్ మొదలైన అనేక దేశాల కథలను వరసగా ప్రకటించాలనే మా ఆశ.

పాఠకలోకంతో ఇదే మాకు ప్రథమపరిచయం. ఈ పరిచయం క్రమానుగతంగా వృద్ధిపొంది, ఉభయులకూ లాభకారికాగలదనే విశ్వసిస్తున్నాము. తిరిగి త్వరలోనే మా ద్వితీయప్రచురణంతో మీ దర్శనం చేస్తాము—అంతవరకూ సెలవు!

# రష్యన్ కథలు

విశ్వసాహిత్యంలో రష్యన్ వాఙ్మయానికి అత్యు త్తమస్థానం వుంది. దీన్నిబట్టి రష్యన్ వాఙ్మయం చాలా ప్రాచీనమైనదనే అభిప్రాయం కలగడంకద్దు. కాని, వాస్తవానికి దాని పుట్టుక, అభివృద్ధి—అన్నీ పంధొమ్మిదోశతాబ్దిలోనే జరిగాయి. అంటే అంతకు పూర్వం రష్యాకు అసలు వాఙ్మయం బొత్తిగా లేదని కాదు. ఏదో కొంతవుండేది. అయితే అది గణ నీయమైంది కాదు.

రష్యన్ వాఙ్మయానికి ప్రథమోదాహరణాలుతొమ్మి ది, పది, పదకొండు శతాబ్దాలలో కనబడతాయి. ఆ రోజులలో వీరగాథలు, భక్తుల జీవితాలు మొదలైన రసవత్తరకావ్యాలు కొన్ని ప్రచారంలోకి వచ్చాయి. అయితే ఇలా మొగ్గతొడగ నారంభించిన

రష్యన్ వాఙ్మయానికి టార్టారుల జైత్రయాత్ర మంచు తుపానులా వినాశనకారకమైంది.

పదమూడో శతాబ్దంలో టార్టారులు రష్యాను జయించారు. దీనితో రష్యన్ దేశానికి, రష్యన్ వాఙ్మయానికీ కూడా "అంధయుగం" ప్రారంభమైంది. ఈ యుగంలో రష్యాకు తక్కిన పాశ్చాత్యప్రపంచంతో పూర్తిగా సంబంధం తెగిపోయింది; రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా, సారస్వతరూపంగా — ఒక్క మాటలో — అన్ని విధాలా అభివృద్ధి కుంటువడిపోయింది.

మూడువందల సంవత్సరాలపాటు దీక్షగానూ, తీవ్రంగానూ కృషిచేసి, చివరకు పదహారోశతాబ్దంలో రష్యా టార్టారులదాస్యాన్ని వదల్చుకుంది. ఈ దాస్యవిముక్తితో మరల దేశంలో నవచైతన్యం కనబడసాగింది.

వర్తకవాణిజ్యాల అభివృద్ధివల్ల మొట్టమొదటి రోమనోవ్ చక్రవర్తుల పరిపాలన కాలంలో రష్యాకు తిరిగి పాశ్చాత్యప్రపంచంతో సంబంధం ఏర్పడింది. పీటర్ ది గ్రేట్ తన రాజధానీ నగరాన్ని పీటర్స్‌బర్గ్‌కు మార్చడంవల్ల ఈ సంబంధం

మరింత హెచ్చింది. సర్వతోముఖంగా అభివృద్ధి చెందివున్న పాశ్చాత్యప్రపంచంతో ఏర్పడ్డ ఈ సన్నిహితసంబంధం రష్యన్ వాఙ్మయానికి నవీన ప్రాణప్రతిష్ట చేసింది.

ఫ్రెంచి, జర్మన్ సారస్వతాల మాధుర్యాన్ని చవిచూచి, తన్మూలంగా ఉత్సాహాన్ని పొంది, రష్యన్ కవులు మాతృభాషలో కావ్యసృష్టి చేయసాగారు. ఈ కాలంనాటి రష్యన్ కవులలో లోమానోస్సవ్, డెర్జావిన్, ఫాన్ విజిన్ అనే వారు ప్రసిద్ధులు. వీరు ఉత్తమమైన కావ్యాలనే రచించారు. కాని, వీటిలో అనుకరణం హెచ్చు. పైగా, ఇవి క్లిష్టమైనభాషలో వున్నాయి. అందుచేత ఆధునిక యుగానికి ఇవి ప్రీతికరంగా వుండవు; వుండలేవు.

పదిహేడు, పద్దెనిమిది శతాబ్దాలనాటి రష్యన్ వాఙ్మయం......పైన చెప్పినట్టు...... చాలా వరకు విదేశరచనలకు అనుకరణం. క్రమంగా రష్యన్ ప్రజలకు ఈ అనుకరణ పద్ధతిమీద వెగటుపుట్టింది. ఇలా వెగటుపుట్టడానికి నెపోలియానిక్ యుద్ధాలుకూడా చాలావరకు కారణమైనాయి. ఈ యుద్ధాలసందర్భంలో రష్యన్

సైనికులు తక్కిన పాశ్చాత్య ప్రపంచాన్ని పరిశీలనగా చూడ్డమూ, తమ దేశానికీ, ఇతర దేశాలకూ వున్న భేదాల్ని గమనించడమూ జరిగింది. పరదేశ యుద్ధ రంగాలనుంచి స్వదేశానికి తిరిగివెడుతూ వీరు కొత్త భావాలనూ, కొత్త ఆదర్శాలనూ, కొత్త రుచుల్నీ, కొత్త కోర్కెల్నీ తీసుకువెళ్లారు. వీటి ప్రభావంవల్ల గడచినశతాబ్దంలో రష్యన్ జీవితంలో అనేక సంస్కరణాలు జరిగాయి. ఈ సంస్కరణాలు సుల భంగా జరగలేదు. ఎంతో ప్రాతికూల్యాన్నీ, ఎన్నో ప్రతిబంధకాల్నీ ఎదుర్కొనవలసివచ్చింది. అందు చేత అభివృద్ధి ఒక్కసారిగాగాక, క్రమక్రమంగా జరిగింది.

ఇంతలో మిగిలిన యూరపియన్ రాజ్యాల్లో పూర్వ పద్ధతులమీద...కృత్రిమ నాగరక పద్ధతులమీద... ఒకవిధమైన విప్లవం బయలుదేరింది. ఈ విప్లవోద్య మాన్ని "రొమాన్టిక్ రివైవల్" అని అంటారు. దీని ప్రభావం రష్యావరకూ ప్రసరించింది. ఈ "రొమాన్టిక్ రివైవల్" ఉద్యమనాయకులలో ప్రధానులైన సర్ వాల్టర్‌స్కాట్, లార్డ్ బైరన్ కవులు రచించిన కావ్యాలనుంచి ఉత్సాహాన్ని పొంది

రష్యన్ రచయితలు సాహిత్యసీమలో నూతన మార్గాల్ని అన్వేషించసాగారు. ఇలా అన్వే షించసాగిన రచయిత లందరిలోనూ పుష్కిన్ గొప్ప వాడు.

ఈ కవి శేఖరుడు ''రొమాన్టిక్ రివైవల్'' ఉద్యమం నుంచి ఉత్సాహాన్నీ, ఆవేశాన్నీ పొందినప్పటికీ, తన రచనలలో రష్యన్ జాతీయతను ప్రతిఫలింప జేసాడు.

పుష్కిన్ తర్వాత అయనతో సరిసమానుడుగా ఎన్న దగిన రచయిత—గోగల్. ఆంధ్రవాఙ్మయానికి నన్నయ, తిక్కనలు చేసినసేవను, వీరుభయులు రష్యన్ వాఙ్మయానికి చేశారు.

ఈ విధంగా క్రిందటి శతాబ్ద ప్రారంభంలోనే పుష్కిన్, గోగల్ కవి శేఖరులతో ప్రారంభమైన రష్యన్ వాఙ్మయం అతిశీఘ్రకాలంలో సర్వప్రపంచ మన్ననలకు పాత్రమైంది. ఇంతత్వరలో రష్యన్ వాఙ్మయం ఇంతటి ఉచ్ఛస్థానానికి రావడానికి ప్రధా నంగా నాలుగైదు కారణాలున్నాయి.

వీటిలో మొట్టమొదటి కారణం — రష్యన్ భాష. రష్యన్ భాషలోవున్న పదజాలం, దానికున్న

భావప్రకటనశక్తి, దానిలోని నిర్దుష్టత, మార్దవం, లాలిత్యం—ఒక్క పోలిష్ భాషను మినహాయిస్తే—మరి దేనికీ లేదు. ఇంగ్లీషుముందు మన తెలుగు భాష ఎంత నీరసంగా కనబడుతుందో, రష్యన్ ముందు ఇంగ్లీషుకూడా అంతేనట! రష్యన్ భాష లోని ఈ పటిమయే రష్యన్ వాఙ్మయ సత్వరాభి వృద్ధికి ప్రధమ—ప్రధాన—కారణం!

పోతే, ఇందుకు రెండో కారణం — రష్యదేశపు అఖండవైశాల్యం. రష్యా అటుసగం యూరప్‌లోనూ, ఇటుసగం ఆసియాలోనూ వున్నది. దాని సరి హద్దులలో సతతం మంచుకురిసే ప్రదేశాలూ వున్నాయి; భరింపశక్యంకాని ఎండకాసే ప్రదే శాలూ వున్నాయి. వివిధమతాలను అనుసరించే వారు, వివిధజాతులకు చెందినవారు, వివిధభాషల్ని మాటాడేవారు అక్కడున్నారు. అంచేత రష్యాను ఒకదేశం అనడంకంటె, ఒకఖండం—ఒక ప్రపంచం అనడమే ఎక్కువ సమంజసంగావుంటుంది. రష్యా దేశం ఇంత సువిశాలంగానూ, దాదాపుగా మరో ప్రపంచంగానూ వుండడంవల్ల రష్యన్ స్వభావానికిఒక విధమైన గభీరత వచ్చింది. ఈ గభీరత రష్యన్ వాఙ్మ

యంలోకూడా ప్రతిబించించి, దాన్ని అచిరకాలంలో మహోన్నతస్థానానికి కొనివచ్చింది.

విదేశ భాషల్ని నేర్చుకోవడంలో రష్యావారికి పెట్టింది పేరు. ఉగ్గుపాలతో స్వభాషను నేర్చినట్టే, విదేశ భాషల్నికూడా వారు నేర్చుకోగలరు. విద్యావంతు డైన ప్రతిరష్యన్‌కూ కనీసం రెండు విదేశభాషలు—ముఖ్యంగా, జర్మన్, ఫ్రెంచిభాషలు—వచ్చివుంటాయి. రష్యాలో ఒకప్పుడు రెండున్నర ఏళ్ల పసిబిడ్డ ఆరు భాషలలో నట్టుపడకుండ మాటాడ్డం తా నెరుగుదునని ఒక అమెరికన్ సాహిత్య విమర్శకుడు వ్రాశాడు. ఇంత సులభంగా — సహజంగా—విదేశభాషల్ని నేరవగలగడంవల్ల రష్యనులకు విదేశ వాఙ్మయాన్ని మాతృకలలోనే చదవడానికీ, దాన్ని హృద్గతము చేసుకోడానికీ అవకాశంకలుగుతున్నది. విదేశ వాఙ్మయ సత్యస్వరూపం హృద్గతంచేసుకున్నాడు ఎవరి దృక్పథమైనా విశ్వవిశాలం కాకమానదు. ఈ విశ్వవిశాలదృక్పథమే రష్యన్‌వాఙ్మయ మహా దాభివృద్ధికి మూడో కారణం.

ఇక, ఇందుకు చివరికారణం ఇది: తక్కిన పాశ్చా త్యదేశాలు వాఙ్మయపథాలలో బహుదూరం వెళ్లిన

తర్వాతగాని రష్యా నిదుర మేల్కొలేదు. ఇలా ఆలస్యంగా కళ్లుతెరవడం ఒకవిధంగా దోషమే అయినప్పటికీ, ఇంకోవిధంగా లాభదాయకమైంది. సాహిత్యసృష్టికి ఆలస్యంగా పూనుకోవడంవల్ల తక్కిన దేశాలవారుచేసిన పొరపాట్లను తప్పుకోడానికీ, వారి అనుభవాన్ని వినియోగించుకోడానికీ రష్యాకు మంచి అవకాశం చిక్కింది. కష్టసుఖాల్ని వడపోసిన తర్వాత — జీవితం లోతుపాతుల్ని తెలుసుకున్న తర్వాత—ఏ నడివయస్సులోనో "ఇన్‌స్పిరేషన్" పుట్టి రచనకు పూనుకునేవాని కావ్యాలలోవుండే ప్రౌఢత్వంరష్యన్ వాఙ్మయంలోకూడాకనబడుతుంది. ఇన్నికారణాలు తోడ్పడ్డతర్వాత రష్యాకు ఉత్తమ వాఙ్మయం ఏర్పడ్డంలోగాని, అది అతిత్వరగలోనే ఏర్పడ్డంలోగాని, ఆశ్చర్యమేమున్నది?

పుష్కిన్, గోగల్ రచనలతో ప్రారంభమైన రష్యన్ వాఙ్మయానికి — దాని అదృష్టంకొద్దీ — ఒకేసారి టాల్‌స్టాయ్, డాస్టవస్కీ, టర్జినీవ్ లాంటి దిగ్గజాలు దొరికారు. వీరి వెనువెనకనే చెకవ్, ఆండ్రీవ్, గార్కీలుకూడా సంసిద్ధమయ్యారు. ఒక్క శతాబ్దంలోనే సర్వోత్తములైన ఇలాంటి రచయితల

— ఇంతమంది—మరి ఏ వాఙ్మయానికీ సేవ వెయ్యడం ఇంతకుపూర్వం జరగలేదు. ఇకముందు కూడా జరగదేమో!

## 2

రష్యన్ వాఙ్మయానికి చిన్నకథ ఒక ప్రధానాంగం. తక్కిన పాశ్చాత్యదేశాలలో—కథలను ప్రకటించే పత్రికల అవసరాల్నిబట్టి — కథాస్వరూపంలోనూ, దాని స్వభావంలోనూకూడా చాలా మార్పులు జరిగాయి. ఈ మార్పులలో కొన్ని చాలా అసహ్యకరమైనవి; కేవలం కళకుత్తుకను నులిపిపారవేసేవి. రష్యన్ వాఙ్మయ సద్భాగ్యంకొద్దీ దానికిమాత్రం ఈ దుస్థితి తప్పింది. రష్యన్ కథలు పత్రికల అవసరాల్నిబట్టి వికారాలకు లోనుగాకుండా, దేశకాల పాత్రానుసారంగా సక్రమాభివృద్ధిని చెందాయి. రష్యన్ కథావాఙ్మయాన్ని మూడు విభాగాలు చెయ్యవచ్చును. రోమాన్, పొవెస్ట్, రాజ్‌స్కాజ్,—ఇవే ఆ మూడు విభాగాలూనూ? రోమాన్ అంటే, మూడు నాలుగు సంపుటాలలోవుండే పెద్దనవల. పొవెస్ట్ అంటే, యాభై మొదలు రెండువందల పేజీలవరకుండే నవల. రాజ్‌స్కాజ్ అంటే, యాభై

అరవై పేజీలలో ఇమిడివుండే చిన్న కథ. ఈ మూడింటికీ ప్రధానభేదం వాటి పరిమాణంలోనే.
రష్యన్ స్వభావానికి చిన్నకథల రచన బాగా తగిపోయింది. రష్యన్ జాతికి గొప్ప ప్రజ్ఞవుంది; చక్కటి ప్రతిభవుంది. అయితే, పట్టుదల మాత్రం మృగ్యం. అంచేత పట్టుదలతో కూడిన నవలారచనలో కంటె, కథారచనలోనే ఆ జాతి ప్రజ్ఞావిశేషాలు అధికంగా రాణిస్తవి.
తమ స్వభావానికి అనుగుణ్యంగావుండబట్టే కాబోలు పుష్కిన్ మొదలు, ప్రిష్విన్‌వరకూ ప్రతి రష్యన్ రచయితకూడా కనీసం ఒకటి, రెండు కథలనైనా వ్రాశాడు. ఇంతేకాదు. గతించిన నలభై, యాభై సంవత్సరాలలో ప్రముఖులనదగిన రష్యన్ రచయితలందరు కథారచనకే అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చారు! పెక్కుమంది సాహితీపరుల అభిప్రాయంలో ప్రపంచ కథావాఙ్మయానికి సంబంధించినంతవరకు అగ్రతాంబూలం రష్యాకే ఇవ్వాలి.
రష్యన్ కథల్నిగురించి ఇంత చెప్పినతర్వాత, ఇక రష్యన్ కథకుల్ని గురించికూడా కొంత చెప్పాలి. అందుకు ''రష్యన్ కథకులు'' అనే ప్రత్యేక శీర్షికతో ఒక ప్రకరణం కలిపాము.

# రష్యన్ కథకులు

పంథొమ్మిదో శతాబ్దం మధ్యభాగం రష్యన్ వాఙ్మయానికి స్వర్ణ యుగం. టర్జినీవ్, డొస్టొవస్కీ, టాల్‌స్టాయ్—ఈ ముగ్గురు కథక చక్రవర్తులుకూడా తమ రచనలలో అధికభాగాన్ని ప్రకటించింది ఈ సమయంలోనే!

## ఐవాన్ టర్జినీవ్:

ఐవాన్ టర్జినీవ్ (1818—88) భూస్వాముల కుటుంబంలో పుట్టాడు. తండ్రి తాగుబోతు; తల్లి గయ్యాళి. అంచేత టర్జినీవ్ బాల్యం చాలా ఘోరంగా గడిచింది. శ్రీమంతుల కుటుంబాలలో ఆనాడు అమలులోవున్న పద్ధతులప్రకారం టర్జినీవ్‌కు జర్మన్, ఫ్రెంచిభాషలలో అక్షరాభ్యాసం చేశారు. మొదట రష్యాలోనూ, తర్వాత జర్మనీలోనూ చదివి, ఆయన చదువు పూర్తి చేసుకున్నాడు. మాతృభాషఅయిన రష్యన్ భాషను టర్జినీవ్—తల్లిదండ్రులకు తెలిస్తే, ఎక్కడ ఆగ్రహపడతారోనని—రహస్యంగా తమ. గుర్రపువాళ్లదగ్గరనుంచి నేర్చుకున్నాడు. గోగల్ మరణానంతరం ఆయన్నిగురించి ప్రకటించిన వ్యాసానికిగాను టర్జినీవ్‌పైన "మీ గ్రామాన్ని కదలిపో వీలులేదు" అని జారిస్టు

ప్రభుత్వం ఆంక్ష వేసింది. తర్వాత 1853 లో కాబోలు, ఇది రద్దయిపోయింది. తనపైన ఆంక్ష తొలగగానే టర్జనీవ్ పీటర్సుబర్గ్ లో నివాసం ఏర్పరుచుకున్నాడు. ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు ఫ్రాన్సు వెళ్లి, జీవితాంతంవరకు అక్కడనే వుండిపోయాడు. ప్రపంచదృష్టిని ఆకర్షించిన రష్యన్ రచయితలలో టర్జనీవే మొట్టమొదటివాడు. వివిధదృశ్యాల్ని, వ్యక్తుల్ని వర్ణించడంలో ఆయన ప్రజ్ఞ అపారం. ఆయన కథలలో "యాక్షన్" బొత్తిగా వుండదు. అయితే, ఈ లోపాన్ని మృదుమధురమైన ఆయన భాష కప్పిపుచ్చుతుంది. నాలుగుపంక్తులలో ఒక జగత్తును సృష్టించగలశక్తి అసాధారణశక్తి ఆయన లేఖిని కుంది. టర్జనీవ్ రచనలన్నింటిలోనూ "ఫాదర్స్ అండ్ చిల్డ్రెన్" (తండ్రులు—తనయులు) అనేది ఉత్తమోత్తమమైనదని చెబుతారు.

ఫెడర్ డోస్టవస్కీ:

డోస్టవస్కీ (1821—87) జననం మాస్కోలో. ఆయనతండ్రి డాక్టరు. 1838 లో ఆయన పీటర్సుబర్గులోని మిలిటరీ ఇంజనీయర్సు కాలేజీలో చేరాడు. తర్వాత మూడేళ్లకు—1841 లో—కమిషన్ సంపాయించుకున్నాడు. కాని, ఉద్యోగంఅంటే విరక్తి పుట్టి, 1844 లో దానికి రాజీనామా పెట్టాడు. రాజీనామా పెట్టిన సంవత్సరానికి—1845 లో—ఆయన తన మొట్టమొదటి నవలను ప్రకటించాడు. ఈ నవల ప్రాశస్త్యాన్ని సాహితీపరులు వెంటనే గుర్తించారు; దానితో డోస్టవస్కీకి మంచి కీర్తి వచ్చింది. అయితే ఆయన అటుతర్వాత ప్రకటించిన రెండు మూడు నవలలు అతి పేలవంగా తయారైనాయి. అంచేత మొదటి నవలతో వచ్చిన కీర్తి అటుపిమ్మట కొంచెం తగ్గింది. ఏదో సోషలిస్టుసంఘంలో చేరినందుకు డోస్టవస్కీని 1848 లో అరెస్టుచేశారు. విచారణలో

మరణశిక్షపడింది; వధ్యస్థలానికి తీసుకువెళ్లారు; చేతుల్ని విరగ దీసి స్థంభానికి కట్టారు; కళ్లకు నల్లటిగంతను కట్టారు; ఫైరింగ్ స్క్వాడ్ వారు తుపాకుల్ని గురిపెట్టారు; ఇంకొక్క క్షణం— గుండుపేలుతుంది — చచ్చి వేలాడుతాడు — ఇంతలో పోలీసు వాళ్లు నురుగులు కక్కుతూవున్న గుర్రాలమీద స్వారిచేసుకుంటూ వచ్చి, జారుచక్రవర్తి దయదలచి మరణశిక్షను రద్దుచేశాడని తెలి యజేశారు. ఆరోజులలో రాజకీయఖైదీలవిషయంలో జారిస్టు ప్రభుత్వం ఈ కపటనాటకాన్ని అంతా జరిపేది. అంచేత మరణ శిక్ష తప్పినప్పటికీ, అతి భయంకరమైన ఈ వధ్యస్థలానుభవాన్ని పొందినవారిలో కొందరు పిచ్చివారైపోయేవారు; మరికొందరికి ఇతర జబ్బులు ప్రవేశించేవి; వేరొకకొందరికి ఏకగ్రతరాకపోయినా, బ్రతికినంతకాలము పిచ్చికలలబాధ తప్పేదికాదు. మరణశిక్షను రద్దుచేసినతర్వాత డోస్టవస్కీని సైబీరియా పంపించారు. అక్కడ నాలుగుసంవత్సరాలపాటు ఖైదులోవున్నతర్వాత, ఆయనను సైన్యంలో "ప్రైవేట్ సోల్జర్"గా చేర్చుకున్నారు. అయితే, ఈ దాస్యంనుంచి ఆయనకు త్వరలోనే విముక్తిదొరికింది. అటుపైన తొమ్మిదిసంవత్సరాలపాటు సైబీరియాలోనే ప్రవాసిగా వుండ వలసివచ్చింది. చివరకు చాలాకష్టంమీద 1859 లో డోస్టవస్కీ శిక్షను రద్దుచేయించుకుని, పీటర్స్‌బర్గ్ చేరుకున్నాడు. 1862 లో ఆయన తన సైబీరియా అనుభవాల్ని ప్రకటించాడు; ఆ తర్వాత వరసగా ఆయన గొప్ప నవల లన్నీ వెలువడ్డాయి. సైబీరియాలో వుండగా ఒక స్కూల్‌మాష్టర్ భార్యమీదకాబోలు డోస్టవస్కీకి ప్రేమకుదిరింది. ఆవిడను పొందాలని చాలా బాధపడి, చివరకు స్కూల్‌మాష్టర్ చనిపోయినతర్వాత ఆయన ఆ అమ్మాయిని పెళ్లిచేసు కున్నాడు. కాని, వారి దాంపత్యంలో బొత్తిగా సుఖంలేక పోయింది.

ఈ మొదటిభార్య చనిపోతే, డొస్టవస్కీ తిరిగి తన స్టినో గ్రాఫర్ నే పెళ్లిచేసుకున్నాడు. ఈవిడ డొస్టవస్కీని చాలా సుఖ పెట్టింది. సైబీరియాలోవుండగా ఆయనకు మూర్ఛరోగం వచ్చింది. దీన్నికుదుర్చుకోడానికి ఫ్రాన్సువెళ్లి, అక్కడ జూదం వ్యసనం కలిగించుకున్నాడు. ఈ రెండింటివల్ల ఆయన ఎన్నోకష్టాలను పడవలసివచ్చింది. తిండికిగతిలేక గడియారాన్నీ, పుస్తకాలనూ కూడా అమ్ముకోవడమూ, అమ్ముకోగావచ్చిన డబ్బును జూదంలో తగలవెయ్యడమూ చాలాసార్లు జరిగింది. మానవ విభిన్న చిత్తవృత్తుల్ని పరిశీలించడంలో డొస్టవస్కీ అపారప్రజ్ఞావంతుడు. కరుణారసం ఆయన ప్రత్యేకసొత్తు. ఆయనరచన లన్నింటిలోనూ "క్రయిం అండ్ పనిష్ మెంట్" (నేరం—శిక్ష) అనేది ఉత్తమకావ్యమనిఅంటారు.

## లియో టాల్ స్టాయ్:

లియో టాల్ స్టాయ్ (1828—1910) జమీందారీ కుటుంబానికి చెందినవాడు. పసితనంలోనే ఆయన తల్లిపోయింది; తొమ్మిది సంవత్సరాల వయస్సువచ్చేసరికి తండ్రికూడా పోయాడు. తల్లిదండ్రు లను కోల్పోయిన టాల్ స్టాయ్‌ను మేనత్త పెంచింది. "డిప్లొమాటిక్ సర్వీస్" లో చేరాలని ఆయన మొదట అనుకున్నాడు. ఇందుకు ప్రాచ్యభాషల్నికూడా నేర్చుకున్నాడు.

1844 లో కజాన్ విశ్వవిద్యాలయంలోచేరాలని ఆయన ప్రయ త్నించాడు. కాని, ప్రవేశపరీక్షలో తప్పిపోయాడు. ఆ మరుసటి సంవత్సరం ఇంకోసారి ప్రయత్నించి, ఈసారి పరీక్షలో ఉత్తీర్ణు డయ్యాడు. తర్వాత మూడేళ్లపాటు కాబోలు చదివి, 1847 లో పట్టభద్రు డయ్యాడు. విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం పూర్తి అయినతర్వాత, ఒకటి రెండు సంవత్సరాలు తమ పల్లెలో నివాస మున్నాడు. ఈ పల్లె జీవితంతో త్వరలోనే విసిగి, ఆయన తిరిగి

పీటర్స్‌బర్గు విశ్వవిద్యాలయంలో చేరి న్యాయవాదపట్టాన్ని పొందాడు. 1851 లో కాసస్ రాష్ట్రానికి వెళ్లి, అక్కడ తన అన్న గారితోపాటు మిలటరీలో పనిచేశాడు. ఆతర్వాత క్రిమియన్ యుద్ధాలలోకూడా పాల్గొన్నాడు.

"చైల్డ్‌హుడ్" (శైశవం) అనేది ఆయన ప్రథమ రచన. దానిని తన పేరుతోగాక, యల్. యన్. టి. అనే తన నామాక్షరాలతో ప్రకటించాడు.

ఈ గ్రంథప్రకటన జరగగానే సాహితీపరు లందరూ రష్యన్ సారస్వతాకాశపథాన నుహోజ్జ్వలమైన తార నూతనంగా పొడసూపిందని గ్రహించగలిగారు.

టాల్‌స్టాయ్‌జీవితం చాలా విచిత్రమైనది. విభిన్నమైన అనుభవాలతో పదను వారినది. ఆయన మొదటభోగి; తర్వాత విరాగి. సైనికుడుగా పనిచేస్తున్నరోజుల్లో తప్పతాగేవాడు; జూదం ఆడేవాడు; వ్యభిచరించేవాడు. తర్వాత భోగలాలసతను వదిలిపెట్టి, గ్రంథరచయితగా ప్రసిద్ధికెక్కాడు. గ్రంథరచనలో వచ్చిన కీర్తివల్ల ఆత్మసంతృప్తి చేకూరకపోవడంవల్ల, సాంఘికసేవపైకి దృష్టిని మరల్చాడు. ఈసందర్భంలో ఆయన ఉపాధ్యాయుడుగానూ, న్యాయమూర్తిగానూ, కర్షకుడుగానూ పనిచేశాడు. ఆ తర్వాత క్రమక్రమంగా ఆధ్యాత్మికచింతలో పడిపోయి, చివరకు సర్వసంగపరిత్యాగంచేశాడు. స్వగృహంలో బొత్తిగా మనశ్శాంతి లేకపోవడంవల్ల, ఆయన ఒకనాడు భార్యాబిడ్డల్ని వదిలిపెట్టి, మహాప్రస్థానం చేశాడు. ఈ మహాప్రస్థానంలోనే, వ్యాధిగ్రస్థుడై, ఒక కుగ్రామంలోని రైల్వేస్టేషన్‌లో పరమపదించాడు. ప్రారంభంలో టాల్‌స్టాయ్ నవలను మాత్రమే వ్రాశాడు. ఆతర్వాత తన మతసిద్ధాంతాలను ప్రచారం చెయ్యడానికి చిన్నకథను సాధనంచేసుకున్నాడు. ఈయన ప్రతికథనూ అనుసరించి ఏదోవొక నీతిబోధ

వుంటుంది. అయితే, అంతమాత్రాన కథ సౌష్టవం చెడదు. కళకు భంగంరాదు. టాల్‌స్టాయ్, టర్గినీవ్, డోస్టవస్కీలలో ఎవరు గొప్పవారో చెప్ప శక్యంకాదు; ఒకరినిమించి, మరొకరు గొప్ప వారు—మనం చెప్పగలిగింది ఇంతే!

## సెవలోడ్ గార్షిన్

సెవలోడ్ గార్షిన్ (1855-1888) జీవితం చాలా విషాదకరమైంది. ముప్పైమూడుయేళ్ల నడివయస్సులో ఆయన పిచ్చియెత్తి చని పోయాడు. ఆయన వ్రాసినవి అయిదారు చిన్నకథలు మాత్రమే! అయినప్పటికీ, ఆ కథలలోని కళావైదగ్ధ్యంవల్ల ఆయనకు రష్యన్ సారస్వతంలో ఉన్నతస్థానం లభించింది! రష్యాకూ, టర్కీకీ జరిగిన యుద్ధాలలో గార్షిన్ పాల్గొన్నాడు. ఈ యుద్ధంలోని అను భవాన్నే ఆయన "నాలుగురోజులు" అనే కథలో వర్ణించాడు. తన ఉన్మాదస్థితిని కూడా "రెడ్ ఫ్లవర్" (ఎర్రపువ్వు) అనే కథలో ఆయన చాలా గొప్పగా చిత్రించాడు.

## ఆన్‌టాన్ షెకవ్

రష్యన్ కథారచయితలలో సర్వోత్తముడు, షెకవ్. (1860—1904) ఈయన తన జీవితంలో అధికభాగాన్ని కథారచనకే వినియోగించి, రష్యన్ కథావాఙ్మయానికి ప్రపంచప్రాధాన్యం సమకూర్చాడు. షెకవ్ తండ్రి, బానిస. అయితే స్వయంకృషివల్ల ఆయన స్వాతంత్ర్యాన్ని సంపాయించుకుని, బిడ్డలకు చక్కగా చదువుచెప్పించాడు. షెకవ్ మాస్కోనగరంలోని మెడికల్ కాలేజీలో చదివి, 1884 లో డాక్టర్ పట్టాని పొందాడు. 1879 లో ఆయన మొకటికథ ఒక మాసపత్రికలో ప్రకటితమైంది. కొంతకాలం వైద్యవృత్తిలో వున్నతర్వాత దాన్ని వదిలివేసి,

షెకవ్ సారస్వతసేవకే తన జీవితశేషాన్ని వినియోగించాడు. షెకవ్ కథలన్నీ మధ్యమతరగతి జీవితాన్ని చిత్రిస్తూవుంటాయి. వాటిలో మానవస్వభావవర్ణనలు అతిరమ్యంగానూ, మహాప్రజ్ఞావంతంగానూ వుంటాయి. వాటిలో కరుణతో కూడిన సున్నితమైన హాస్యంకూడా తొలుకాడుతూ వుంటుంది. ఫ్రెంచి కథకుడు మపాసాం కంటేకూడా షెకవ్ ఎన్నోవిధాల గొప్పవాడు.

## అలెగ్జాండర్ కుప్రిన్

అలెగ్జాండర్ కుప్రిన్ జననం 1870 లో. 1917 నాటి బోల్షివిక్ విప్లవానికిపూర్వమే రష్యన్ వాఙ్మయప్రపంచంలో చిరకీర్తిని గడించుకున్నవారిలో ఇంకను సజీవుడైయున్నవాడు ఆయన వొక్కడే! బోల్షివిక్ విప్లవసందర్భంలో తప్పనిసరిగా జరిగిన దౌర్జన్యానికీ, రక్తపాతానికీ కినిసి, ఆయన రష్యానువదిలి ప్రవాసానికి వెళ్లిపోయాడు. చివరికి మొన్న స్వదేశాన్ని చూడాలనే కాంక్షకలిగి, కుప్రిక్ రష్యాకు తిరిగివెళ్లాడు. అప్పుడు సోవియట్ ప్రభుత్వం ఆయనకు బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చింది.

కుప్రిన్ మిలిటరీస్కూల్‌లో చదువుకుని, ఆఫీసర్ ఉద్యోగాన్ని సంపాయించుకున్నాడు. నాలుగుసంవత్సరాలతర్వాత దానికి రాజీనామా పెట్టి, సాహిత్యసేవకు జీవితాన్ని అంకితం చేశాడు. రష్యన్ జీవిత విభిన్నసమస్యల్ని గురించి ఆయన అనేక కథల్నీ, నవలలనూ వ్రాశాడు. అన్నింటిలోనూ వ్యభిచారాన్ని గురించి "యామా ది పిట్" అనే పేరుతో ఆయనవ్రాసిన నవల ఎక్కువ కీర్తిగాంచింది.

## మేక్సిం గార్కీ:

మేక్సిం గార్కీ (1868—1936), అసలు పేరు—అలెక్సీ మాక్సి మోవిచ్ పెష్కోవ్. గార్కీ తండ్రి వడ్రంగి. గార్కీ అయిదో యేట తండ్రి చనిపోయాడు. ఆతర్వాత గార్కీ తల్లి ఇంకో పెళ్లి చేసుకుంది. తల్లి ఇంకొకరని కట్టుకున్న తర్వాత గార్కీ తాతగారింట్లో పెరిగాడు. గార్కీ తాత అద్దకం పనివాడు. అతని స్థితి చెడిపోవడంవల్ల, గార్కీ తొమ్మిదో యేటనుంచీ తనపొట్టను తాను పోసుకోవలసి వచ్చింది. తొమ్మిదో యేట మొదలు పదిహేనో యేటవరకు గార్కీ అనేక వృత్తుల్ని చేశాడు; అనేక ప్రదేశాల్ని చూచాడు. ఈ కాలం నాటి తన జీవితాన్ని వర్ణిస్తూ, గార్కీ ఇలా వ్రాశాడు: 1878 లో నేను ఒకమోదీ వాడిదగ్గర పనిచేశాను; 1878 లో ఒక వడ్రంగి దగ్గర వున్నాను; 1880 లో ఒక ఓడలో అంట్లుతోమే పనికి కుదిరాను; 1883 లో రొట్టెలగు కాణంలో వున్నాను; 1884 లో పోర్టర్ పని సంపాయించాను; 1885 లో స్వయంగా రొట్టెల దుకాణం పెట్టాను; 1886లో టూరింగ్ నాటకసమాజంలో చేరాను; 1887 లో యాపుల్ పళ్లు అమ్మికుబ్రతికాను; 1888 లో ఆత్మహత్య చేసుకుందామని ప్రయత్నించాను; 1888 లో ఒక లాయర్ ఆఫీస్‌లో కాపీయిస్టుగా కుదిరాను; 1891 లో రష్యా అంతా కాలి నడకను తిరిగాను; 1892 లో రైల్వే వర్కుషాపులో కూలీగా పనిచేశాను; ఆసంవత్సరంలోనే నా మొట్టమొదటి కథను ప్రకటించాను." 1892 లో టిఫ్లిస్‌లోని రైల్వే వర్కుషాప్‌లో పనిచేస్తూ, స్థానిక వార్తాపత్రికలో "మేక్సింగార్కీ" అనే మారు

పేరుతో ఆయన తన మొదటికథను ప్రకటించాడు. దాన్ని అందరూ మెచ్చుకోవడంతో ఆయన జీవితంలో నవీనాధ్యాయం ప్రారంభమైంది. పొట్టపోసుకోడానికి ప్రయత్నిస్తూ, అష్టకష్టాలతో గడిపిన ఆ పదిహేను సంవత్సరాలలో గార్కీ అనేకమంది ఖైదీలను, తాగుబోతుల్ని, వ్యభిచారుల్ని, పతితజనుల్ని చూడ్డం తటస్థించింది. వారందరిని ఆయన తన రచనలలో అద్భుత కళాకౌశల్యంతో చిత్రించాడు. గార్కీకి మొదటినుంచీ రష్యన్ విప్లవోద్యమంతో సంబంధం వుండేది. బోల్షివిక్ విప్లవ దౌర్జన్యాన్ని హర్షించక పోయినా, ఆయన బోల్షివిక్ ప్రభుత్వాన్ని సమర్థించాడు.

లియోనీ ఆండ్రీవ్ :

---

లియోనీ ఆండ్రీవ్ (1861-1918) ఓక్రల్‌లో ఒక విద్యాధిక కుటుంబంలో జన్మించాడు. ఆయన మాస్కో విశ్వవిద్యాలయంలో చదువుకుని, ప్లీడరు పట్టాను పొందాడు. విద్యార్థిగా వుండగానే ఆయన కథల్ని వ్రాయ నారంభించాడు. కొద్దికాలం ప్లీడర్ వృత్తిలో వుండి తర్వాత దాన్ని వదిలివేశాడు. ఒక్కొక్కసారి వెర్రెత్తినవాడిలా అయి, ఆయన తాగుతూవుండేవాడు; వ్యభిచరించేవాడు. కాని, ఆతర్వాత విపరీతంగా పశ్చాత్తాపపడుతూ వుండేవాడు. ఆయన రచనలు ఎడ్గర్ యాలెన్ పో, మాథర్‌లింక్ రచనలలా "సింబాలిక్"గానూ, "మిస్టీరియస్"గానూ వుంటాయి.

ఫెడర్ సోలోగబ్ :

ఫెడర్ సోలోగబ్ (1863—1928) నిజమైనపేరు—ఫెడర్ కుజ్మిచ్ టెటిర్నికోవ్. ఆయన జననం 1863 లో. తండ్రి చెప్పులు

పుట్టినవాడు; తల్లి దాసీమనిషి. తల్లియజమాని చేసినసహాయంతో చదువుకుని సోలోగబ్ బడిపంతు లయ్యాడు. చాలా కాలం కష్ట పడి పనిచేసినతర్వాత, ఆయనకు స్కూల్సు ఇన్‌స్పెక్టర్ పని అయింది. రచయితగా పేరు సంపాయించుకున్న తర్వాత, ఆయన ఉద్యో గాన్ని చాలించుకున్నాడు. 1905 నాటి విప్లవంలో ఆయన కొంత వరకు పాల్గొన్నాడు గాని, ఆతర్వాత రాజకీయాలనుంచి విర మించుకున్నాడు. ఆయన రచనలలో "సింబాలిజం" హెచ్చు.

మిగిలిన ఇద్దరు:

ఈ కథాసంపుటిలో స్థానమున్న వెలెరీ బ్రూసోవ్, పేన్‌టలైమన్ రోమనోవ్‌ల జీవితాలనుగురించి వివరాలు తెలియలేదు. అంచేత వారినిగురించి వ్రాయడం పడలేదు.

## వెలెరీ బ్రూసోవ్

## (1873—1924)

# స్ఫటికవిగ్రహం

దొంగతనానికి ఇంట్లో జొరబడ్డాడని కేసుపెట్టి, అతడికి ఒకసంవత్సరం శిక్ష వేశారు. కోర్టులో ఆ ముసలివాడి ధోరణీ, నేరం జరిగిన పరిస్థితులూ వింతగా తోచినందున, ఖైదీని చూడానికి అనుమతిని సంపాయించాను. మొట్టమొదట్లో అయితే నీతో నాకేమీ పని లేదన్నాడుగాని, చాలా అనునయించిన తర్వాత, తన జీవితకథను చెప్పడానికి అంగీకరించాడు.

"మీ ఊహ సత్యమే. నేను బ్రతికి చెడినవాణ్ణి. బాగా చదువుకున్నాను. ఇంజనీయరింగ్ నా వృత్తి. కుర్రతనంలో చేతిలో కాస్తో కూస్తో పైసా ఆడుతూవుండేది. అదిపెట్టి సరదాగా బ్రతుకుతూవుండేవాణ్ణి. ప్రతిసాయంత్రం తప్పకుండా విందుకుగాని, డాన్సుకుగాని పోతూవుండేవాణ్ణి. రాత్రిఅయ్యేసరికి తప్పతాగి ఈ లోకంలోవుండేవాణ్ణికాదు. ఆరోజులు నాకు మహాజ్ఞాపకం. అప్పటి అతిసామాన్యవిషయాలుసయితం పూర్తిగా గుర్తున్నాయి. అయినా, నా స్మృతిపథంలో కొంత వెలితివుంది. దాన్నిపూడ్చుకోడానికి నా క్షుద్రజీవితశేషాన్ని వినియోగిస్తాను. సైనాలో

సంబంధంవున్న ప్రతివిషయాన్నీ జ్ఞాపకంతెచ్చుకోవాలనే నా యత్నం.

"ఆవిడ పేరు సైనా. సందేహంలేదండీ,—సైనాయే ఆవిడ పేరు! సైనాభర్తకు రైల్వేలో ఏదో చిన్న ఉద్యోగం. వాళ్ళు పేదవాళ్ళు. అయితేనేమి? తనబుద్ధిసూక్ష్మతకొద్దీ దారిద్ర్య ముద్రాంకితాలైన స్వీయజీవితపరిసరాలను సైనా సుమధురంచేసు కునేది. ఇంటి పను లన్నింటినీ స్వయంగా చక్కబెట్టుకునేది. అయినా, సైనాచేతులు పల్లవకోమలంగావుండేవి అతిసామాన్య మైన వసనాలనేధరించేది, సైనా. అయినా, అవి స్వాప్నికజగత్తు ను స్ఫురింపజేసేవి. మీరు నమ్మండి, నమ్మకపోండి;—ఈసాధా రణ ప్రపంచంకూడా ఆమె సన్నిధానంలో కేవలం స్వర్గతుల్యం అయ్యేది. నేనుసయితం ఆవిడపరిచయం ఏర్పడ్డతర్వాత క్రొత్తవాణ్ణి అయిపోయాను. ఆపుణ్యమూర్తి సందర్శనభాగ్యంవల్ల నాలోని మాలిన్యం తొలిగిపోయింది.

"ఈ దౌర్భాగ్యుణ్ణి ప్రేమించినపాపం ఆవిడచుట్టుకో కుండా వుండాలిగా! దుర్భరమైన పరిసరాలలో, మొరటు మాన వులమధ్య బ్రతుకుతూవున్న సైనా, అందచందాలూ యువ్వనమూ వున్ననన్ను......ఎన్నో ప్రేమగీతాలు కంఠస్థంగా వచ్చిన నన్ను......ప్రేమించకుండా వుండలేకపోయింది. ఎప్పుడు, ఎక్కడ, ఏవిధంగా నాకు ఆవిడతో ప్రథమపరిచయంకలిగిందో చెప్పమంటే సరిగాచెప్పలేను. విస్మృతితమస్సును చీల్చుకుని, ఒక దానితో నొకదానికి సంబంధంలేని ఆవిడ జ్యోతిర్మయచిత్రాలు మాత్రం నాకు కనబడుతూవుంటాయి. ఇదుగో, చూడండి: మేము ఉభయులం నాటకశాలలో వున్నాము. ఆవిడ ఎంతో సంతోషంగా, ఆనందంగావుంది. తన్మయత్వంతో నాటకాన్ని చూస్తూవుంది. నాపై దరహాసమధువును చిలుకుతూవుంది...... ఆదరహాసం నాకు బాగాజ్ఞాపకం. ఆతర్వాత ఇద్దరమూ కలిసి ఎక్కడికోగాని, వెళ్లాము. ఆవిడ నాముఖంలోముఖంపెట్టి, నాకు తెలుసు, నా ఈసుఖస్వప్నం త్వరలోనే తెగిపోతుంది. అయినా జీవించాననే సంతృప్తిమిగులుతుందిగా! అంతేచాలు!' అని

అంది. ఈమాటలు నాకు బాగాగుర్తు. కాని, ఆపిమ్మట ఏమిజరిగిందనిగాని, సైనాతో కలిసివుండగానే ఇదంతా జరిగిందాఅని గాని మీరు అడిగితేమాత్రం ఖండితంగా ఏమీచెప్పలేను.

"సందేహంలేదండీ, నేనే సైనాను పరిత్యజించాను. ఇది నా దృష్టికి అతిసహజంగా కనబడింది. అప్పటి నా స్నేహితులందరూ సరిగ్గా ఇలాగే ప్రవర్తించేవారు. ఎవతో ఒకవివాహితతో నాలుగురోజులపాటు కులాసాగా గడపడం; ఆతర్వాత ఆవిణ్ణి తోసిపారవెయ్యడం! అందరిలా నేనుకూడా నడుచుకున్నాను. తప్పుచేస్తున్నానుగదా అని అప్పటిలో నాకు తోచనైనా లేదు. డబ్బుదొంగిలించడం, అప్పులు ఎగవెయ్యడం, సి. ఐ. డి. గా పనిచెయ్యడం తప్పుగాని, ప్రేమించినవనితను పరిత్యజించడం మామూలే! నాజీవితం, నాభవిష్యత్తు వదులుకుని, ప్రేమాగీమా అంటూ ఎవర్తెనో ఒకర్తెను కనిపెట్టుకునివుంటానా? తెగతెంపులు చేసుకుపోవడం నిజంగా బాగ అనిపించింది. అయినా, గుండె రాయిచేసుకున్నాను.

"సైనా భర్తను దక్షిణాదికి ఎక్కడికో బదిలీ అయ్యిందనీ, అక్కడికి వెళ్ళిన కొద్దిరోజులకే ఆవిడ చనిపోయిందనీ విన్నాను. అయితే, సైనాతో గడిపిన ఆ రోజులు తలపుకువస్తే నే నతి బాధాకరంగా వుండేది. అందుచేత, ఆవిణ్ణి గురించిన వార్తలు వినిపించకుండా తప్పించుకు తిరిగేవాణ్ణి. ఆవిణ్ణి గురించి ఆలోచించకుండావుండాలనికూడా ప్రయత్నించేవాణ్ణి. ఆవిడ జ్ఞాపకాలేవీ దగ్గర వుంచుకోలేదు. ఆవిడ రాసిన ఉత్తరాలను తిరిగి ఆవిడకే ఇచ్చేశాను. మమ్మల్ని పరస్పరం ఎరిగున్న మిత్రులు ఎవ్వరూ లేరు. ఈ అన్నికారణాలవల్లా సైనా చిత్రం క్రమక్రమంగా నా హృదయఫలకంనుంచి చెరిగిపోయింది. ఈ చోద్యం విన్నారా? క్రమక్రమంగా సైనాను నేను మరిచిపోయాను; పూర్తిగా మరిచిపోయాను! ఆవిడ ముఖాన్నీ, ఆవిడ పేరునూ, ఆవిడ ప్రేమనూ. అన్నింటినీ మరిచిపోయాను. ఆవిడ నా హృదయకవాటాలను తెరుచుకొని, అసలు ఎన్నడూ లోనికి తొంగైనా చూడనట్టే అయిపోయింది ......... ఇంత సం

పూర్ణంగా విస్మరించగల తనశక్తిని చూసుకుని పురుషుడు నిజంగా సిగ్గుపడాలిసుమండీ!

"సంవత్సరాలు దొర్లుకుపోయాయి. నా వృత్తిలో ఎలా ప్రవేశించానో, ఎలా నెగ్గుకువచ్చానో, ఆ వివరాలు మీకు అనవసరం. నైనాలేకపోయిన తర్వాత లౌకికవ్యవహారాల్ని గురించీ, ధనార్జన్ని గురించీ మాత్రమే నాకలలన్నీ! ఒక సమయంలో నేను ఆశించిన విజయాన్ని దాదాపుగా పొందానుకూడా! వేలకువేలు ఖర్చుపెట్ట గలిగాను. విదేశపర్యటనంసయితం చెయ్యగలిగాను. వివాహం చేసుకున్నాను. సంతానంకూడా కలిగింది. ఆ తర్వాతినే చేపట్టిన ప్రతిపనీ మసికాసాగింది. వేసిన ప్లానులన్నీ తప్పిపోయాయి. భార్య చనిపోయింది. ఒంటిరిగాణ్ణి పిల్లల్ని సాకలేక, వాళ్లను బంధువులపైకి తోలివేశాను. వాళ్లు బ్రతికి బట్టకట్టిందీ, లేందీఅయినా నాకు తెలియదు. నా అంతటిపాపాత్ముడు మరివుండబోడుకదండీ! ...... తర్వాత నే నేమి చేసిందీ వేరేచెప్పాలీ? తప్పతాగేవాణ్ణి ...... ఏజెన్సీ అంటూ ప్రారంభించాను. కాని, దానివల్ల ఏమీ లాభించలేదు. అప్పటికి మిగిలివున్న కొంచెం ధనాన్నీ, శక్తినీ అది మింగివేశింది. వచ్చిన నష్టాన్ని పూడ్చుకోవాలనీ, తిరిగి పూర్వస్థితికిరావాలనీ జూదానికి దిగాను. దానిలో అబ్బింది ఏమీలేదు సరిగదా, జైల్లో పడవలసినయోగం కొద్దిలో తప్పిపోయింది. ఉన్న స్నేహితులు మోసంచేశారు. అక్కడినుంచి అధఃపతనం ప్రారంభం!

"నెమ్మదినెమ్మదిగా, ఇప్పుడు మీరు వచ్చి చూచారే, ఈ స్థితికి దిగజారాను; ఉన్నత సంఘంలోనుంచి ఈ అగాధంలోకి తలకిందులుగా పడిపోయాను. కుల్లు గుడ్డలతోవుండే నేను, ఎప్పుడూ తప్పతాగివుండే నేను ...... ఏ మొహం పెట్టుకుని నలుగురిలో తిరగ్గలను? ఇటీవల కొన్ని సంవత్సరాలపాటు, తాగుడు లేని రోజుల్లో, అప్పుడప్పుడు ఫాక్టరీలలో కూలి చేస్తూ వచ్చాను. ఇలా కూలి చేస్తూవుండగా, పురుగు తొలిస్తే చాలు, తిరిగి నేనూ నా తాగుడూ తయ్యార్! ఈ స్థితిలోవుండికూడా నా పరిచయుల్ని చూస్తే నాకు అసహ్యమే! హఠాత్తుగా ఎప్పుడో అదృష్ట

చక్రం తిరుగుతుందనీ, తిరిగి సంపన్నుడనౌతాననీ కలలుగంటూ వుండేవాణ్ణి. ఆకాశంనుంచి ఏదైనా వారసత్వం వూడిపడుతుందనీ, ఇలాంటిదే మరేదైనా విచిత్రసంఘటన జరుగుతుందనీ ఊహాలు పోతూవుండేవాణ్ణి. నాలా కలలుగనడంలేదుగదా అనే, నాతోటి వారంటే నాకంతటి గొప్ప అసహ్యం వుండేది!

"సరే, ఒకనాడు ఆకలిదప్పులతో నకనకలాడుతూ ...... అలా ఎందుకు వెడుతున్నానోకూడా తెలియకుండా ...... ఒక పెరట్లోకి వెళ్ళాను. వెళ్ళేసరికి, 'ఇదుగో అబ్బీ! తాళాలుబాగు చేసేవాడివా?' అని వంటమనిషి అడిగాడు. 'ఔ'నన్నాను. ఆ ఇంటి వారి రైటింగ్ టేబుల్ తాళం చెడిపోయింది. దాన్ని బాగుజేసే వాడు కావలిసివచ్చాడు. ఆగది చిత్రపటాలతో, ఇతర అలంకారాలతో శోభాయమానంగావుంది. పని ప్రారంభించి, రిపెయిర్ పూర్తిచేశాను. ఇంటి ఇల్లాలు ఒక రూబుల్ ఇచ్చింది. డబ్బు చేతిలోవేయించుకున్నానో, లేదో, చిన్న తెల్లటిపీఠంమీద పెట్టి వున్న స్ఫటికవిగ్రహం నాకంటబడింది. ఎంచేతనోగాని వెంటనే తలతిరిగినట్టయ్యింది. రెప్పవాల్చకుండా అలానేచూచాను. చూచి, నాకళ్ళను నేనే నమ్మలేకపోయాను: నైనా!!!

"నైనాను పూర్తిగా మరిచిపోయానని ఇదివరకే మనవి చేశానుకదూ! అయితే, ఆవిణ్ణి మరిచిపోయిన సంగతిని మొట్టమొదటిసారిగా గ్రహించింది, ముఖ్యంగా అప్పుడే! ఆ క్షణంలోనే! ఒక్కసారిగా ఆవిడ అమృతమూర్తి నామనోనేత్రం యెదట ప్రత్యక్షమైంది. నిద్రాణాలై, నిర్జీవాలైవున్న తలపులు, స్వప్నాలు, భావనలు ఒక్కుమ్మడిగా తిరిగి లేచాయి; జీవించాయి! ...... ఆపాదమస్తకం కంపించిపోతూ ఆ స్ఫటిక విగ్రహానికి కళ్లరెంటినీ అప్పగించి, 'అమ్మా! అది ఎవరి ప్రతిమో అడగవచ్చునా?' అని వినయపూర్వకంగా ప్రశ్నించాను. 'అదేనా? అది అమూల్యమైంది. అయిదువందల సంవత్సరాల క్రితం, పదిహేనో శతాబ్దిలో దాన్ని చెక్కారు'.

చెక్కినవాడిపేరుకూడా ఆవిడ చెప్పింది. కాని, సరిగ్గా వినబడ లేదు. ఆవిడ భర్త దాన్ని ఇటలీనుంచి తెచ్చాడట. దాన్ని గురించి ఇటాలియన్, రష్యన్ ప్రభుత్వాలమధ్య చాలా ఉత్తరప్రత్యుత్తరాలుకూడా నడిచాయట. అయితే, ఈ విగ్రహం నీ మెప్పుపొందినట్టుందే! ఖర్మం! నీ అభిరుచులు ఆధునికాలలా వున్నాయే! చెవులు స్థానంతప్పి వున్నాయి; ముక్కు వంకర టింకరగావుంది. ఈ వికారాల్ని గమనించలేమా?' అంటూ ఆవిడ చరచర వెళ్ళిపోయింది.

“ఉక్కిరిబిక్కిరి అవుతున్నవాడిలా బయటికి వచ్చిపడ్డాను. ఇది వట్టిపోలిక కాదు,—కేవలం అచ్చు! అంతేకాదు,—జీవి తాన్ని స్ఫటికశిలలో పునఃసృష్టి చెయ్యడం! వుండవలసిన స్థానంలోకాకుండా కొంచెం తప్పివున్న ఆ చిన్ని చెవుల్నీ, స్వల్పంగా మెల్లవున్న అవే కళ్ళనూ, ఆ వంకరటింకర ముక్కునూ వాలుగావుండే ఆ పెద్దనుదుర్నీ, ఇవి అన్నీ చేరడంవల్ల ఏర్పడే ఆ అందమైన, ఆ మనోహరమైన వదనబింబాన్ని : నేను ఎరి గున్న ఆ స్త్రీవదనబింబాన్ని పదిహేనో శతాబ్దంనాటి శిల్పి ఏ విధంగా సృష్టించగలిగాడో మీరు రవ్వంత చెప్పగలరూ? అచ్చంగా ఒక్కమాదిరిగానే వుండే స్త్రీలు, ఒకరు పదిహేనో శతాబ్దంలోనూ, ఒకరు మన జీవితకాలంలోనూ వుండడం ఎలా సాధ్యం? ఏమీ సందేహంలేదు! శిల్పిచెక్కిన ఆ స్త్రీ సైనాయే! ఇద్దరూ సరిగ్గా ఒక్కటే! ఈ పోలికలు బాహ్యాకృతిలోనే కాదు,—ప్రవృత్తిలోనూ, అంతరంగంలోనూకూడా!

“ఆరోజు నాజీవితాన్ని మార్చివేశింది. నాపూర్వజీవితంలోని నైచ్యాన్నీ, నాపతనంయొక్క పరిమితినీ గ్రహించాను. పరమే శ్వరుడు సైనాఅనే దేవతను పంపిస్తే, ఆవిణ్ణి గుర్తించలేకపోతి నిగదా! అని తెలుసుకున్నాను. గతించినదానికి వగచిలాభంలేదు. అంచేత, అమూల్యమైన పుష్పదాయం పగిలిపోతే, ఆముక్కల్ని చేర్చుకునేవాడిలా సైనా స్మృతిఖండాలను పోగుచేసుకోవడం ప్రారంభించాను. అబ్బా! ఆ స్మృతిఖండాలు ఎంతస్వల్పం! ఎన్నివిధాలప్రయత్నించినా, సంపూర్ణాకృతి కుదర్నేలేదు. అన్నీ

ముక్కలు, పంక్తులు! కాని, వాటితోనే నా భావనావీథిలో
కొత్తకొత్త ఆకృతుల్ని కల్పించుకోగలిగినప్పుడు ఎంతపొంగి
పోతూవుండేవాణ్ణి! వీటినిగురించి ఆలోచిస్తూ, వీటినిజ్ఞాపకం
తెచ్చుకుంటూ గంటలకొద్దీ అలాగడిపివేసేవాణ్ణి! నన్నుచూచి
ప్రజలునవ్వేవారు. కాని, నా ఆనందం వారికేమితెలుసు? నేను
ముసలివాడినైపోయాను. తిరిగి జీవితాన్ని ప్రారంభించలేను.
కాని, కనీసం నాఅంతరాత్మ మాలిన్యాన్నిఅయినా కడిగివేసు
కోలేకపోతానా?

"ఎలాగైనా సరే, ఇంకొక్కసారి ఆ శిలావిగ్రహాన్ని
చూడాలని కోర్కె కలిగింది. ఆ ఇంటి చుట్టూ ఎన్నో ప్రదక్షి
ణాలు చేశాను. కిటికీలకు దూరంగా పెట్టారు, ఆ విగ్రహాన్ని.
అంచేత, అది ఎన్నడూ నాకంట బడలేదు. ఎన్నో రాత్రులు ఆ
ఇంటి ముందే గడిపివేశాను. అక్కడ ఎవరెవరు నివసిస్తున్నారో
ఏయే గది యెలావుంటుందో అంతా నాకు తెలుసు. ఇంటి
నౌకర్లలో ఒకడితో స్నేహంకూడాచేశాను. వేసవిలో ఇంటి
ఇల్లాలు, బంధుమిత్రులను చూచి రావడానికికాబోలు వెళ్లింది.
అప్పుడికి నా ప్రగాఢవాంఛను ప్రతిఘటించలేకపోయాను.
ఇంకొక్కసారి నానావిగ్రహాన్ని చూడగలిగితే, సర్వం జ్ఞాపకం
తెచ్చుకోగలననిపించింది. అలా జ్ఞాపకం తెచ్చుకోగలిగితే ఇక
నా జీవితం తరించినట్లేగా! అంచేత, నన్ను ఏ పనికైతే శిక్షిం
చారో, దాన్ని చెయ్యడానికి నిశ్చయించుకున్నాను. నా ప్రయ
త్నంలో నెగ్గలేకపోయానన్న సంగతి మీకూ తెలుసు! హాల్లో
పట్టుకున్నారు. తాళాలు బాగుజేసేవాడిననే నెపంతో
మొదట ఇంట్లోకి వచ్చాననీ, తర్వాత ఇంటి చుట్టూ పదేపదే
తిరిగాననీ, చివరకు ఎవ్వరూలేకుండాచూచి తాళం పగల
గొట్టి... ...ఏమైతేనేమి లెండి,—కథకంచికి వెళ్ళింది!"

"అలాఅంటేకాదు! మేము నీతరఫున అప్పీలుచేస్తాము.
నిన్నుతప్పకుండా వదలివేస్తారు." అని నే నన్నాను.

"వృథా శ్రమఎందుకు, బాబూ!" అని ముసలివాడు

అభ్యంతరంచెప్పాడు. "నాకు జైలుప్రాప్తిఅయిందిగదా అని ఏడ్చేవాడు ఎవ్వడూలేడు. పైగా, నాకు జామీను ఎవ్వరుంటారు? ఇంతేకాకుండా నైనాస్మరణచెయ్యడానికి బయట వుంటేఎంతో, జైల్లోవున్నా అంతే!"

ఇందుకు ఏమిజవాబుచెప్పాలో నాకు తోచలేదు. ఇంతలో ముసలివాడు విలక్షణమైన తన శుష్క నేత్రాలతో నన్ను తదేకంగా చూస్తూ, ఇలాఅన్నాడు:

"ఒక్క సందేహమే నన్ను బాధిస్తున్నది. నైనాఅంటూ అసలు ఒకవ్యక్తి లేదేమో! తాగుడువల్ల కలిగిన మతిభ్రమణ కారణంగా, ఆ శిలావిగ్రహాన్నిచూచిన క్షణంలో ఈ ప్రణయ గాథ అంతా నాపుర్రెలోనే పుట్టిందేమో!!"

# ఆన్‌టోన్ చెకవ్
# (1860—1904)

# ఏ యెండకా గొడుగు

**కొ**త్తకోటుతొడుక్కొని, చంకలో యేదో మూట యిరికించి, మార్కెట్‌వీధిగుండా పోలీసు సార్జెంటు చమ్లోవ్ వెడుతున్నాడు. జప్తుచేసిపుచ్చుకున్న గూజ్‌బెర్రీస్ పళ్లతో అంచుల వరకూ తమాయించివున్న జల్లెడబుట్ట పుచ్చుకుని పోలీస్ కానిస్టేబుల్ ఒకడు అతడివెనకే నడుస్తున్నాడు. అంతటా నిశ్శబ్దం రాజ్యం చేస్తున్నది. మార్కెట్‌లో ఒక్క పురుగైనా లేదు. ఆకలితో పెద్దగా తెరుచుకున్న నోళ్లలా షాపుల తలుపులూ, కిటికీలూ ప్రపంచాన్ని తేరి పారజూస్తున్నాయి. చివరకు బిచ్చగాళ్ల అలికిడైనా లేదు.

హఠాత్తుగా ఎవరో అరిచిన సవ్వడి చమ్లోవ్ చెవినిబడింది. "నీ కడుపుడక! కరుస్తావటే! అబ్బాయిల్లారా! పట్టుకోండి, పట్టుకోండి! ఈరోజుల్లో కుక్కలు కరవటానికి వీల్లేదు. పట్టుకోండి! అబ్బబ్బా". కుక్క మూలగడం వినిపించింది. సార్జంటు గోల వినిపిస్తున్న వైపుకు తిరిగి చూశాడు. మూడుకాళ్ల మీద కుంటుతూ, పించ్యుగిన్ కలప అడితీలోనుంచి ఒక కుక్క పరిగెత్తుకువచ్చింది. గంజిపెట్టిన క్యాలికో షర్టుతోనూ, గుండీలు

వూడిన వెస్టుకట్‌తోనూవున్న వొకడు, దాన్ని తరుముకు వస్తున్నాడు. వాడు కుక్క వెనకాతలే వున్నాడు. ముందుకు లంఘించబోయి, తూలి, బొక్క బోర్లగాపడి, కుక్క వెనక కాళ్లను రెంటినీ గట్టిగా పట్టుకున్నాడు. కుక్క మొరుగుడూ, "పట్టుకోండి, పట్టుకోండి!" అనే కేకలూ తిరిగి వినబడ్డాయి. షాపుల కిటికీలదగ్గర నిద్రముఖాలు కనబడ్డాయి. నేల ఈనిందా అన్నట్లు, క్షణంలో అడితీదగ్గర పెద్ద గుంపు చేరింది.

"దొమ్మీ జరగడంలేదు గదా!" అంటూ పోలీస్ కానిస్టేబుల్ వాస్తుపోయాడు.

ఎడమకు తిరిగి, సార్జెంటు గుంపువైపుకు నడిచాడు. అడితీగేటు దగ్గరగా, గుండీలువూడిన వెస్టుకట్‌తో వున్న ఆవ్యక్తి, తన కుడిచేతిని పైకెత్తి, రక్తం కారుతూవున్న వేలిని జనానికి చూపుతున్నాడు. ఆతడి తాగుబోతు మొహంమీద "దొంగవెధవా! చెవులెక్క వేసి, ఈనష్టానికి నీదగ్గర తగిన పరిహారం వసూలు చేస్తాలే!" అనేభావం కనబడుతూవుంది. ఇక, ఆవేలు కేవలం విజయచిహ్నంగావుంది. సార్జెంటు వెళ్లి చూడగా, ఆవ్యక్తి కంసాలి ఖురికిన్ అయ్యాడు. గుంపుమధ్యగా, ముందు కాళ్లను రెంటినీ యెడంగాచాచి, గజగజ వణికిపోతూ, ఈ అల్లరికి అంతకూ కారణమైన అది,—ఆజాగిలం, కూర్చునివుంది. దానిరంగు తెలుపు. వీపుమీద పూడామచ్చ. ముట్టె కొసతేలివుంది. నీరుకమ్మిన దానికళ్లలో భయం తొలుకాడుతూవుంది.

గుంపును తోసుకువెడుతూ, "ఏమిటోయ్ గొడవ? ఎందుకిలా చేరారు? నీ వేలకేమిటి? అరుస్తూవున్న దెవరు?" అని సార్జెంటు అడిగాడు.

"నాదారిని నేను పోతున్నాను, సార్!" అని గొంతు సవరించుకుంటూ ఖురికిన్ తన కథప్రారంభించాడు. "పోతూవుంటే, ఈ పాడుకుక్క నా వేలు కరిచేసింది. తమరు చిత్తగించాలి, సార్! రెక్కలకష్టంమీద ఒతికేవాణ్ణి. అర్జంటు పనులుకూడా

అమ్ముకున్నాను. ఎలా లేదన్నా, వారంరోజులదాకా ఇక ఈ వే
లితో పనిచెయ్యడం పొసగదు. ఈయిబ్బందికి యెవరు పూచీపడ
తారండీ? కుక్కలు కరిస్తే, పడివుండాలని ఎక్కడా రాసిపెట్టి
లేదుగా! లోకంలో వున్న కుక్కలన్నీ కరవడం ప్రారంభిస్తే,
నాలాటివాళ్లు ఒక్కరోజైనా బతగ్గలమా!"

"ఊహూఁ!" అని కనుబొమల్ని ఆడిస్తూ సార్జెంటు
తీండ్రించాడు. "ఎవడిదీ కుక్క? ఈవ్యవహారం అంతు కనుక్కుం
టాను. అసలు, ఆజ్ఞా లేకుండా కుక్కల్ని వీధులవెంట వదిలి
వెయ్యడమే! రూల్సు పాటించనివాళ్లకు పాఠం చెప్పాల్సిందే!
ఆదొంగవెధవను పట్టుకుని గూబ లెక్క వేస్తే, కుక్కల్ని
వీధులవెంట వదిలిపెట్టడమంటే ఏమిటో తెలిసివస్తుంది. నాతడా
ఖా కాస్త చూపిస్తాను. యెల్డిరిన్!", అంటూ పోలీసు కాని
స్టేబుల్ వైపుకు తిరిగి: "ఈకుక్క యెవరిదో కనుక్కుని, వాడి
మీద రిపోర్టు రాయి. దీన్ని చంపి పారవెయ్యాలిసిందే! పైగా, ఇది
పిచ్చికుక్కై వుండాలి. ఎవరిదీ కుక్క?"

"జనరల్ జైగలోవ్ గారి కుక్కలా వుందండీ" అని
గుంపులోనుంచి ఎవడో అన్నాడు.

"ఆహాఁ! జనరల్ జైగలోవ్ గారిదా!". గుటకలు మింగుతూ,
"యెల్డిరిన్! కాస్త నా కోటు లాగివెయ్యి! తెగ వుక్కపోస్తున్నది;
వర్షం కురుస్తుందో యేమో!...చాల్లేవోయ్! కల్లిబొల్లి ఏడ్పులు
కట్టిపెట్టు! అసలు ఈకుక్క నిన్నెలా కరవగలిగింది! అది జానె
డైనా లేదు. నీవేమో యెద్దంతమనిషివి! మేకో గీకో గుచ్చు
కుంటే, దారేపోయే కుక్కపేరుచెప్పి, డబ్బుగుంజాలని చూస్తు
న్నావ్! దొంగ వెధవలు, మీసంగతి నాకు తెలియనూ!"

"కాలుస్తున్న సిగరెట్టు కుక్క ముఖంమీద పెట్టి దాన్ని రెచ్చ
గొడితే, అది వాణ్ణి కరిచింది, సార్!"

"ఈ మెల్లకంటివెధవ అబద్ధాలాడుతున్నాడు, సార్! జరి
గిందేమిటో, వాడు చూడనైనా లేదు. ఇలా అబద్ధాలాడితే,

డికి వారికేదేమిటో! ఎవడిమాట నిజమో, ఎవడిమాట అబద్ధమో, ప్రభువులు, మీకుమాత్రం తెలియదూ! అయినా, న్యాయం కోర్టువారు విచారించరూ? కోర్టు యెదుట వారెంతో, నేనూ అంతే! పటాలంలో మాతమ్ముడొకడున్నాడు. మీరు—"

"నోరుముయ్యి!"

"ఎబ్బే! అది జనరల్ గారి కుక్కకాదు!" అని పోలీసు కానిస్టేబుల్ అందించాడు. "జనరల్ గారికి ఇటువంటి కుక్కలు లేనేలేవు. వారికుక్క లన్నీ మరో జాతివి"

"నిజమే?"

"నిజమేనండీ!"

"ఔనుగా! జనరల్ గారి కుక్క లన్నీ గొప్పజాతివి. ఇక ఇకో, వట్టిగజ్జికుక్క! బొచ్చూ లేదు; పిక్కా లేదు. వట్టి కంతిరీజాతి కుక్క. దీన్ని పెంచేవాణ్ణే చెప్పుకోవాలి! మాస్కోలోగాని, పీటర్సుబర్గులోగాని ఇటువంటి కుక్క బజారులో కనబడితే, ఏం చేస్తారో తెలుసా? లా, గీ, చూడరు. తపేమని—దాంతో సరి! ఖిర్కిన్! పాపం! నీవు చాలాబాధపడ్డావు. ఈవ్యవహారం అంతు కనుక్కుంటానులే! ఈ వెధవలకు బుద్ధిచెప్పాలి. ఇంకా వూరుకోవడమే!"

"ఏమోనండీ, తీరాచూస్తే ఇది జనరల్ గారిదిలానే వుండండీ!" అని పోలీసు కానిస్టేబుల్ మళ్లీ తటపటాయించాడు. "మెడపట్టీమీద ఆసామి పేరేమీ లేదుగాని, మొన్న ఒకనాడు జనరల్ గారి దొడ్లో ఇటువంటి కుక్కనే చూచిన జ్ఞాపకం"

"నేనెరుగుదున్నాను; ఇది జనరల్ గారి కుక్కే, సార్!" అని గుంపులోనుంచి ఎవడో అరిచాడు.

"యెల్డిరిన్, కోటు కాస్త తొడగవోయ్! ఇక్కడ తెగ చలివేస్తున్నది; వణికి పోతున్నాను...జనరల్ గారింటికి కుక్కను తీసుకువెళ్లి, దారిలో కనబడితే, నేను పట్టుకు పంపించానని

చెప్పి, భద్రంగా అప్పగించిరా! వీధుల్లోకి రానుండా, కాస్త కాపాడమనికూడా చెప్పు! ఇది ఖరీజాతి కుక్కై వుండాలి. ప్రతి వెధవా సిగరెట్టు పెట్టి దీని ముట్టిపొడకొడితే, ఇది యేంకావాలి? దీని ప్రాణమెంత!...సరే లేవోయ్! ఇక, చెయ్యి దించు. ఆ వెధవ వేలు యెందుకలా యెత్తిపెట్టడం! తప్పుచేశావ్; అనుభవించు!"

"అడుగో! జనరల్ గారి వంటమనిషి వస్తున్నాడు; వాణ్ణి అడిగితే నిజం తేలుతుంది ఇదుగో, ప్రోఖర్! ఇలారా! ఈ కుక్క మీదేమో కాస్త చూడు!"

"ఇదా? మాదికాదే!"

"పిచ్చిగాని, అసలు అడగడం దేనికి? వెధవ బజారుకుక్క ఇది! నేను బజారుకుక్క అంటే, అది బజారుకుక్క కావలసిందే! చూడ్డం దేనికి, దీన్ని చంపించక!"

"మాదికాదు గాని," అంటూ ప్రోఖర్ మళ్లీ అందుకున్నాడు "మా జనరల్ గారి తమ్ముడిది. మొన్ననే ఆయన వచ్చాడు. జాగిలాలంటే, మా జనరల్ గారికి చాలా అసహ్యం. కాని, ఆయన తమ్ముడికి అవంటే ప్రాణం!"

"అయితే, జనరల్ గారి తమ్ముడు, వ్లాడిమిర్ ఐవానోవిచ్ వచ్చాడేమిటి?" అని మొహం యింతచేసుకుంటూ సాగ్గంటు అడిగాడు. "ఆయన వచ్చినమాట నేవినలేదే! అన్నగారిని చూచి వెళ్లడానికి వచ్చాడేమిటి?"

"అవునండీ."

"అలాగేఁ! పాపం, అన్నగారినిచూచి, చాలా రోజులైంది కామోసు! సరే, ఇక ఆయన కుక్కన్నమాట! అయితే, సంతోషం. నువ్వు తీసుకుపో దీన్ని!..ఎంత చక్కనికుక్క, ఏమి దీని చలాకీ! ఒక్కగంతేసి, ఈ వెధవ వేలిని కసిక్కిని కరిచేసింది! అహాఁ! హాఁ! హాఁ! నీకు భయమేందమ్మా! నేనున్నానుగా! వీడు దొంగ వెధవ!

ప్రోఖర్ కుక్కను పిలుచుకుని, అడితీ దగ్గరినుంచి వెళ్లిపోయాడు. ఖురికిన్‌ను చూచి, జనం నవ్వారు. "నిన్నెప్పుడో బొక్కలో తోస్తాలే!" అని సార్జెంటు వాణ్ణి బెదిరించి, కోటును దగ్గరగా లాక్కుంటూ, మార్కెట్ గుండా తనదారిని తానుపోయాడు.

# కులట

## ఆన్‌టోన్ చెకవ్

ఆవిడ ఇంకా యౌవనంలోనూ, అందంగానూ వున్న రోజుల్లో జరిగింది యీకథ. అప్పుడు దొరికినాడు ఆవిడ ప్రియుడు...నికోలై పెట్రోవిచ్ కోల్పకోవ్...ఆవిడ 'సమ్మర్ కాటేజీ' వాకిటిలో కూర్చునివున్నాడు. ఎండ దుర్భరంగావుంది. సెక సెకలాడి పోతూవుంది. కోల్పకోవ్ అప్పుడే భోజనం చేశాడు; చౌకపాటు పోర్టుబుడ్డి ఒకటి ఖాళీచేశాడు. అతడు చాలా చికాకుగా వున్నాడు; అతడి ఆరోగ్యంకూడా యేమో అస్థిరంగావుంది. మొత్తంమీద వాళ్లిద్దరికీ నిస్త్రాణగానేవుంది; కాస్త చల్లబడితే షికారు బయలుదేరిపోవాలని అనుకుంటున్నారు.

హఠాత్తుగా, తలవనితలంపుగా, వీధితలుపుగంట మ్రోగింది. షర్టుతోనూ, స్లిప్పర్సుతోనూవున్న కోల్పకోవ్ తన కుర్చీలోనుంచి చటాలునలేచి పాషావంక ప్రశ్నార్థకంగా చూచాడు.

"పోస్టుబంట్రోతేమో! కాకపోతే, నా స్నేహితురాలెవతో!" అని ఆవిడ అంది.

కోల్పకోవ్ పోస్టు బంట్రోతు రావటంగాని, పాషా స్నేహితురాళ్ళు రావటంగాని సిగ్గుపడడు. కాని, యెందుకైనా మంచిదని

తన కోటూ-గీటూ ఒక చేత్తోనూ, బూట్లు ఇంకో చేత్తోనూ పట్టుకుని, పక్కగదిలోకి తప్పుకున్నాడు. తలుపుతియ్యడానికి పాషా

అతి లక్షణయుక్తంగా దుస్తుల్ని ధరించి, మహా అందంగా వున్న యువతిని... అపరిచితురాలిని...చూచి, పాషా తెల్లబోయింది.

ఆగంతక వదనం కళావిహీనంగా వుంది. అప్పుడే పెద్ద మేడమెట్లను ఎగబాకివచ్చినట్టుగా ఆయాసపడుతూవుంది.

"ఇలావచ్చారెందుకమ్మా ?" అని పాషా అడిగింది.

ఆవిడ వెంటనే జవాబివ్వలేదు. వో అడుగు ముందుకువచ్చి, చావిడిని కలయజూచి, కుర్చీలో చతికిలబడింది. ఆతర్వాత ఏమైనా మాట్లాడాలనే ప్రయత్నంలో పాలిపోయివున్న తన పెదవుల్ని కదిల్చింది.

చివరకి అతికష్టంమీద "మా ఆయన మీయింట్లోవున్నాడా?" అనే ప్రశ్నను వెగిల్చింది. ఏడవడంవల్ల కాబోలు ఆవిడ కళ్లు రెండూ ఎర్రబడిపోయాయి.

"యెవరాయన ?" అంది పాషా గొణుగుపడ్డ గొంతుతో.

"మా ఆయన-నికోలై పెట్రొవిచ్ క్రోల్పకోవ్ !"

ఒక క్షణం నిశ్శబ్దం. పొర్లుకువస్తున్న దుఃఖాన్ని ఆపుకోడానికా అన్నట్టు,వచ్చిన ఆయువతి చేతిరుమాలుతో పదేపదే నోరు నొక్కుతుంది. పాషా ప్రతిమలా అలా నిలబడిపోయి, విస్తుపోతూ ఆవిణ్ణి చూడసాగింది.

"ఆయన ఇక్కడ లేడంటావుగనూ !" అని కొంచెం గట్టిగా, విలక్షణంగా చిరునవ్వుతూ, ఆవిడ అడిగింది.

"ఎవర్నిగురించి మీా రడుగుతున్నారో నాకు తెలియడం లేదమ్మా !!"

పాషావంక ద్వేషంతోనూ, అసహ్యంతోనూ చూ:

ముండా ! తెలియదేం ?" అని ఆవిడ మండిపడింది.

ఆమె దృష్టిలో తాను ఇంత నీచంగానూ, ఇంత అసహ్యం గానూ కనబడుతున్నానుకాబోలనుకుని పాపా చిన్నబోయింది.

"ఏడీ, ఎక్కడున్నాడు మాఆయన? అయినా, అత డిక్కడ వున్నా, లేకపోయినా ఒక్కటేలే! అతడి దొంగతనాలు బయటపడ్డాయి. పోలీసువాళ్లు వారంటుపుచ్చుకుని తిరుగుతున్నారు. అరెస్టు ఎలాగూతప్పదు. నీమూలంగా ఏంగతివచ్చిందో చూచావా ?"

కట్టలు తెంచుకున్న ఉద్రేకాన్ని పట్టలేక, కుర్చీలోనుంచి లేచి, ఆవిడ చావడిలో ఇటూ అటూ పచారుచేయసాగింది.

"ఇవ్వాళ యెలాగూ ఆచోకీ కనుక్కుంటారు; అరెస్టు చేస్తారు." ఆవిడ నిట్టూర్చింది. ఆ నిట్టూర్పుతీవ్రతను చూస్తే చాలు, ఆవిడ యెంతవిచారంలో వున్నదీ, యెంత అవమానాన్ని భరిస్తున్నదీ తెలిసిపోతున్నది. "అతన్ని ఈస్థితికి యెవరుతెచ్చారో, నాకు తెలుసు. నీవే! డబ్బుకోసం గడ్డితినే తొత్తుముండవు! నీతీ, జాతీలేని లంజవు!!". ఆవిడ అధరోష్ఠం కంపించిపోతుంది; అసహ్యాభావం కొద్దీ నాసికాపుటాలు సంకుచిత మౌతాయి. "నాకు దిక్కులేదు, వినవే,—ముండా! నాకు దిక్కులేదు. ఇప్పుడు నీదే పైచెయ్యికావచ్చు. కాని, నన్నూ నాబిడ్డల్నీ కాపాడ్డానికి ఆ సర్వేశ్వరుడు లేడూ! వాడు అన్నీ చూస్తాడు. అంటిన్నీ విచారిస్తాడు. నాకంటినుంటకారిన ప్రతి కన్నీటిబొట్టుకూ, నేను నిద్రాహారాలు లేకుండా గడిపిన ప్రతిక్షణానికీ నిన్ను రంపానపెట్టి కొయ్యడూ ? నామాటలు జ్ఞాపకంతెచ్చుకుని, నీవు వలవల యేడ్చేరోజు రాకపోతుందీ ?"

కాసేపు అంతా నిశ్శబ్దం. ఇదివరకులానే అశాంతంగా ఆవిడ చావడిలో పచార్లు చేస్తూవుంటుంది. పాపా పాషాణవిగ్రహంలా అలానే నిలబడిపోయి, వెర్రిగా అలానే చూస్తూ వుంటుంది. ఈ గొడవేమీ పాపాకు అర్థంకాదు. ఆవిడ ఏదో అఘాయిత్యం చేసిపోతుందనే పాపా భయపడింది.

చివరకు ఎలాగో కొంచెం తెప్పిరిల్లి "నాకేమీ తెలియదమ్మా" అని పాషా అంది. ఈ మాటలు అంటూనే, అంతలోనే తిరిగి ఆవురుమంది.

"అబద్ధాలు దేనికి?" అంటూ ఆ యువతీరత్నం కళ్లవెంట నిప్పులు రాల్చింది. "సమస్తం నాకు తెలుసు. గతమాసం అంతా అత డిక్కడ నీ కొంపలో లేడూ?"

"ఉన్నాడేమో! ఉంటే నేం? ఇక్కడికి రమ్మని నేనెవర్నీ నిర్భంధపెట్టను. రావాలనుకున్నవాడు వస్తాడు."

"చెప్పానుకదూ, అతడి దొంగతనాలు బయట పడ్డాయని. నీలాటివాళ్లకోసం ఇతరుల డబ్బు వాడివేశాడు. నీ కోసమే ఈ నేరంచేశాడు. నే చెప్పేమాట విను" అంటూ అవిడపాషాముందు ఆగిపోయింది. "నీకు నీతీ నియమంలేదు. ఇతరుల కొంపలు తియ్యడమే నీపని. కాని, దయాదాక్షిణ్యాలు నీలో ఇంకా పూర్తిగా చచ్చిపోలేదనుకుంటాను. అతడికి భార్యవుంది; బిడ్డలున్నారు; అతణ్ణి అరెస్టుచేసి, సైబీరియాకు పంపితే, నేనూ నాపిల్లలూ కూటికిమాడి చచ్చిపోతాము. ఇంతకంటె ఘోరం వుంటుందా? కాని, అతణ్ణీ, మమ్మల్నీ...అందర్నీ, దారిద్ర్యం నుంచీ అప్రతిష్ఠనుంచీ తప్పించడానికి ఒక దారివుంది. అతడు వాడివేశిన తొమ్మిదివందల రుబుల్సును ఇవ్వాళ ఎలాగైనాసరే తిరిగి ఇచ్చివెయ్యగలిగితే ఖైదుతప్పుతుంది. ఒక్క తొమ్మిది వందల రుబుల్సువుంటే చాలు!"

"తొమ్మిదివందలరుబుల్సే!"అని పాషాబిత్తరపోయింది."నా... నాకేమిటో అయోమయంగావుంది... నేనేమీతీసుకో——"

"తొమ్మిదివందల రుబుల్సు ఇవ్వమని నిన్నడగడంలేదు. నీదగ్గర అంతరొక్కంవుండదని నాకుమాత్రం తెలియదూ? పైగా, నీసొమ్ము ఇవ్వమని నేనడగడంలేదు. నే నడిగేదే వేరు! మగవాళ్లు నీకు ఖరీదైన నగా నాణెం చేయించి పెడుతూవుంటారు.మా ఆయనచేయించి పెట్టినవాటినిమాత్రం నాకు తిరిగి ఇస్తేచాలు!"

"మీ ఆయన నాకేమీ నగా నాణెం చేయించి పెట్టలేదమ్మా" అని అప్పటికి ఈ గొడవేమిటో కొంచెం అర్థంచేసుకున్న పాపా గోలపెట్టింది.

"అయితేమరి ఆరోగ్యం ఏదీ? నాదగ్గరవున్న పైసా అంతా వూడబెరుక్కున్నాడు. పైపెచ్చు పరాయివాళ్ల పైసా కూడా తగలేశాడు. అదంతా ఏగంగ కలిసింది? నామాట విను,- నిన్ను వేడుకుంటున్నాను: ఇక్కడికి వచ్చినప్పుడు నా మనస్సు మనస్సులా లేదు. తొందరపడి నిన్ను నానామాటలు అన్నాను. అన్నీ మరిచిపో; నన్ను క్షమించు. నేనంటే నీకడుపు కాలుతూవుండాలి. అయినా, దయాదాక్షిణ్యాలు అంటూ నీలో ఏకోశానైనా వుంటే, నాదుస్థితిని గ్రహిస్తావు. నీకు ఎంతో పుణ్యంవుంటుంది,—ఆ వస్తువులు నాకు పారేసెయ్యి".

"అలాగా!" అంది పాపా భుజాలుయెగరవేస్తూ. "వుంటే, ఇవ్వడానికి నాకు అభ్యంతరమా? ఏవొట్టుపెడితే ఆవొట్టు. నేను మీ ఆయనదగ్గరనుంచి ఏమీ తీసుకోలేదు. నన్ను చంపుతున్నట్టే!

"అయినా, వుండవంటి" అని పాపామళ్లీ అంతలో తడబడిపోయింది. "అఁ! కొన్నిరోజులక్రితం ఆయన నాకేవో రెండు వస్తువుల్ని తెచ్చాడు. కావాలంటే, వాటిని మీకు తిరిగి ఇస్తాను."

టాయిలెట్ టేబుల్ డ్రాయర్ తీసి, పాపా ఒక బ్రోచీ బందునూ, చౌకపాటు రాయి తాపడంచేసివున్న ఒక పలచటి ఉంగరాన్నీ తీసింది.

"ఇవిగో, తీసుకోవమ్మా" అని వాటిని ఆవిడ కిచ్చింది.

యువతి ముఖం కందగడ్డలా అయిపోయింది. ఆమె పెదవులు వణికిపోయాయి. ఆవిడకు ఎక్కడలేని అభిమానంవచ్చింది.

"ఏమిటి నీవుద్దేశం? నీదగ్గరికి నేనేమీ బిచ్చానికి రాలేదు. మా ఆయన్ని పిచ్చివాణ్ణిచేసి, నీవు వదుక్కున్న నా సొత్తును పట్టుకుపోవడానికి వచ్చాను. పోయిన గురువారంనాడు నిన్నూ, అతణ్ణీ పార్కులో చూశాను. అప్పుడు నీవు చాలా

ఖరీదైన బ్రోచీలూ, బాజీబందులూ పెట్టుకుని వున్నావు. అంచేత, నీ నంగనాచి వేషాలు నా దగ్గర సాగవు. ఇంకొక్క సారి నిన్నడుగుతున్నాను; అవి అన్నీ నాకిచ్చివేస్తావా, లేదా?"

"ఏమిటమ్మా నీమాటలు" అని పాషా ఇప్పటికి కొంచెం గుక్కతిప్పుకుని, ఎదురు తిరిగింది. "నికొలై పెట్రోవిచ్ దగ్గరినుంచి ఆబాజీబందూ, ఆ ఉంగరమూ తప్పితే, మరి నాకేమీ ముట్టలేదు. ఏదో కాస్త మిఠాయి చేత్తో పట్టుకువచ్చేవాడు,—అంతే!"

"మిఠాయా?" అని కడుపుమంటకొద్దీ ఆయువతి చిరునవ్వింది.

"ఇంట్లో పిల్లలకు తిండికి దిక్కులేదు; ఇక్కడకు మిఠాయి పొట్లాలు సిద్ధం! అయితే, నీవు వస్తువుల్ని ఇవ్వనన్నమాటే!"

దీనికి జవాబులేదు. ఆయువతి చేతిరుమాలును ముఖానికి అడ్డంపెట్టుకుని ఆవురుమంది.

"నిన్ను వేడుకుంటాను", అని పొంగుతున్న దుఃఖంతో ఆవిడ ప్రాధేయపడసాగింది. నా భర్త నాశనం కావడానికి నీవే కారణం. అతణ్ణి కాపాడమని ప్రార్థిస్తున్నాను. అతడు అంటే నీకు జాలిలేదు. కాని, పిల్లమాటో? పిల్లలు,— ఏమి పాపం చేశారని వాళ్లకు ఈ గతి పట్టాలి?

ఆ చిన్నపిల్లలు ఆకలితో వీధిన పడి, ఏడుస్తూవున్నట్టు పాషాకు ఒకటేక కనబడింది. దాన్ని చూస్తే పాషాకుకూడా ఏడుపు వచ్చింది.

"నేనేమి చేయగలను అమ్మా? నేను ఛండాలురాలినని, నికొలై పెట్రోవిచ్ ని సర్వనాశనం చేశానని అంటున్నారు. కాని, ఆ పని మీరన్న దేవుడు సాక్షిగా మీ ఆయనవల్ల నాకేమీ లాభించలేదు. మా వాడు అంతటికీ ఒక్కడే మొగాడే నాలుగురాళ్లున్న వాడు చేరదీశాడు."

"వస్తువుల్ని ఇమ్మని అడుగుతున్నాను. వస్తువులే నాకు కావాలి. కంట తడిపెడుతున్నాను; ప్రాధేయపడుతున్నాను! నీవు కోరితే, నీపాదాలు పట్టుకుంటాను."

భయంతో పాషా కెవ్వన కేక పెట్టింది. నాటకంలో జరిగే మాదిరిగా స్వచ్ఛమైన భాషలో పట్టిపట్టి మాటాడుతూవున్న

ఈఅస్త్ర బెదిరించినట్టుగానే, ఎక్కడ పాదాలమీద పడుతుందో అని హడిలిపోయింది. తన పరువు ప్రతిష్ఠలకు ఏమీ లోపంరాదనీ, పైగా తన పాతివ్రత్యం బయటపడుతుందనీ, ఈభోగంవల్ల తప్పకుండా మరింత పతితగా కనబడుతుందనీ తెలుసుకునే, ఆఘగోసాతో, ఆవిడ అంతపనీ చేస్తుందికూడా!

“సరే, వస్తువులన్నింటినీ ఇచ్చివేస్తాను,” అని కళ్లను తుడుచుకుంటూ, పాపా బీరువాదగ్గరకు వెళ్లింది. “అన్నింటినీ తీసుకు వెళ్లు. అయితే, ఇవి ఏవీ మీ ఆయన చేయించిపెట్టినవి కావు. ఇవి తక్కినవాళ్లు పెట్టిన సొమ్ములు. అయినా నీమాటే చెల్లనీ!

బీరువా పైఅర తీసి, దానిలోనుంచి వజ్రాలు పొదిగిన బ్రోచి, పగడాలహారం, చాలా వుంగరాలు, ఒక బాజీబందు, ఇవి అన్నీ తీసి ఆయువతికి ఇచ్చింది.

“కావాలంటే, ఇవి అన్నీ తీసుకువెళ్లు. కాని, వీటిలో ఒక్కటికూడా మీ ఆయన ఇవ్వలేదు. పట్టుకువెళ్లు. నీవే బాగుపడు” అని, ఆవిడ తన పాదాలు పట్టుకుంటున్నందుకు కోపంతో పాపా విసుక్కుంది. “నీవు అతడి ధర్మపత్నివైతే, ఇకమీదట అతడు నీచేయిజారిపోకుండా, నీదగ్గరే పదిలంగా వుంచుకో! సరేనా? అతణ్ణి బొట్టూకాటుకాపెట్టి నేను పిలవలేదు,—అతడే వచ్చాడు.”

కారుతూవున్న కన్నీటిగుండా ఆయువతి నగలవంక చూచింది. “ఇవి ఏమిసరిపోతవి? వీటిని తెగనమ్మితే, అయిదు వందల రుబుల్సుఅయినా వస్తాయో, రావో?” అని నిట్టూర్చింది.

కోపం కొద్దీ పాపా ఒక బంగారం గడియారాన్ని, ఒక సిగరెట్టుకేసునూ, ఒక జత కఫ్సుగుండీలనూ బీరువాలోనుంచి విసిరికొట్టి, ఇలా అంది:

“ఇక నాకేమీ మిగల్లేదు.” “కావాలంటే, సోదాకూడా చూచుకో!”

ఆయువతినిట్టూరుస్తూ, కంపిస్తూవున్న చేతుల్లో నగల్ని జేబుగుడ్డలో కట్టుకుని, ఒక్క మాటైన పలక్కుండా, చివరకు కన్ని

త్తయినా చూడకుండా, గదిగుమ్మం దాటింది.

పక్కగది తలుపు తెరుచుకుని, కోల్పకోవ్ ప్రత్యక్షమైనాడు. అతడు కళావిహీనంగా వున్నాడు. అతడి శిరస్సు కంపిస్తూవుంది. కన్నులు అశ్రుపూరితాలై వున్నాయి.

"నీవు నాకేమి నగలు కొనితెచ్చావు? చెప్పవేం?" అని పాషా నిగ్రదీసింది.

"నగలా? వాగబోకు. నగలసంగతి ఎవడికి కావాలి?" అన్నాడు కోల్పకోవ్ తలపంకిస్తూ. "నా ఖర్మంకాలితే, అది నీయెదుట హోకుపయేడ్చింది. పరువు కాస్తా—"

"ఏమేమి నగలు కొనితెచ్చావో, చెప్పవేం?" అని పాషా రెట్టించింది.

"ఆరిదేవుడా? ఆవిడ, అంతటి పరువు ప్రతిష్ఠలుగలది, అంతటి కులీన, ఈకులటపాదాలు పట్టుకుంటూనన్నది! నేనే ఆవిణ్ణి ఈగతికి తెచ్చాను. దీన్ని అంతా చూస్తూ వూరుకోగలిగానుకూడా!" అంటూ తల రెండుచేతుల్లోనూ పట్టుకుని, బాధకొద్దీ మూలిగాడు.

"అబ్బ! ఈ పరాభవాన్ని ఎన్నటికీ మరవలేను. ఎన్నడూ! నా యెదటనుంచిపో! పశువా!" అని పాషాదగ్గరినుంచి తొలగిపోతూ గర్జించాడు.

"పాదాలు పట్టుకుంటూనన్నది! ఎవరివి? దీనివి అబ్బ! ఏమిఘోరం! !"

పాషానీడైనా ఎక్కడ సోకుతుందో అన్నట్టు, దూరంగా తొలిగి, త్వరత్వరగా దుస్తుల్ని వేసుకుని, అతడు బయిటికి దారి తీశాడు.

పక్కమీదపడి, పాషా వెక్కివెక్కి రోదించసాగింది. నగల్ని ఇచ్చివేసిన విచారానికితోడు, ఈ పరాభవంకూడా జరిగింది. మూడుసంవత్సరాలనాడు ఒక వర్తకుడు ఇలాగే తనను అకారణంగా పట్టుకుకొట్టడం జ్ఞాపకంవచ్చి, ఆవిడ మరింత కుమిలి కుమిలి ఏడ్చింది.

# లియో టాల్‌స్టాయ్
# (1828–1910)

# ప వా సి

వ్లాడిమిర్ పట్టణంలో ఇవాన్ డిమిట్రిచ్ అక్స్యనోవ్ అనే వర్తకుడొకడు వుండేవాడు. అతడికి రెండు షాపులూ, వోసొంత యిల్లూవుండేది.

అక్స్యనోవ్, పడుచువాడు. అందగాడుకూడా. చక్కని వుంగరాలుతిరిగిన జుట్టు. మహాసరదాఅయిన ఘటం. సంగీతం అంటే చెవి కోసుకునేవాడు. కుర్రతనంలో తప్ప తాగుతూ వుండేవాడు. మరీ డోస్ యెక్కువపడితే, వీధినిపడి నానా అల్లరీ చేశేవాడుకూడా. కాని, పెళ్లయిన మర్నాటినుంచీ...ఎప్పుడో నూటికి కోటికి కమ్మకుర్రిపడ్డం తప్పితే...తాగుడు మానేశాడు.

ఒక వేసంగిలో అక్స్యనోవ్ నిఝునీసంతకు ప్రయాణమౌతూ వుండగా అతడిభార్య "ఈనాడు ప్రయాణం కావద్దండీ! మిమ్మల్ని గురించి రాత్రి చాలా పీడకల కన్నానండీ!" అని అభ్యంతరం చెప్పింది.

అక్స్యనోవ్ నవ్వుతూ "ఏం, సంతకు వెళ్లగానే తాగి తందనాలాడతానేమోనని నీభయమా?" అని వేళాకోళంచేశాడు.

"ఆఁ! మీ వేళాకోళాల కేమిగాని, రాత్రి చాలా చెడ్డ కల వచ్చిందండీ! సంతనుంచి తిరిగివచ్చి మీరు హేట్ తియ్యా

గానే, మీ జుట్టంతా ముగ్గుబుట్టలా నెరిసివున్నట్టుకనబడిందండీ!" అని ఆవిడ అంది.

ఈ మాటలువిని అక్సనోవ్ నవ్వాడు. "అలాగా! అయితే శుభశకునమే!" అని అన్నాడు. "సరిలే, పిచ్చిభయాలు పెట్టుకోవద్దు! సరుకు అంతా అమ్మి, నీకు సంతనుంచి చక్కని బహుమానాలు తెచ్చిపెడతాలే!"

ఇలా సర్ది చెప్పి, అతడు సంతకు ప్రయాణమై పోయాడు.

సగందూరంలో అతడికి తెలిసిన వర్తకు డొకడు తటస్థపడ్డాడు. ఆ రాత్రికి వాళ్లిద్దరూ ఒకే హోటల్‌లో బసచేశారు. ఇద్దరూకలిసే టీ తాగారు. ఆతర్వాత సరసనేవున్న గదుల్లోనే పడుకొని నిద్రపోయారు.

ప్రొద్దెక్కే వరకూ పడుకోనేఅలవాటు అక్సనోవ్‌కు లేదు. పైగా, పెందరాడే బయల్దేరితే యెండనుపడంగదా అనికూడా తోచింది. అంచేత పొద్దుపొడవకముందే లేచి, బగ్గీవాణ్ణిలేపి, గుర్రాల్ని కట్టమని చెప్పాడు.

ఆ తర్వాత హోటల్ వెనకే కాటేజీలో కాపురం వుంటూవున్న హోటల్ యజమాని దగ్గిరికి వెళ్లి, తన బిల్లు చెల్లించి, తిరిగి ప్రయాణాన్ని సాగించాడు.

షుమారు పాతిక మైళ్లు వెళ్లినతర్వాత గుర్రాలకు దానా పెట్టించడానికిగాను ఆగాడు. ముందు కొంతసేపు హోటల్ వాకిట్లో విశ్రమించాడు. ఆతర్వాత పార్చికోలోకి వెళ్లి, టీ ఆర్డర్ చేశాడు. టీ వచ్చేలోపుగా తన చితారు తీసి, పాటప్రారంభించాడు.

హఠాత్తుగా ఒక "త్రోయికా" (మూడు గుర్రాలబండి) వచ్చి హోటల్ ముందు ఆగింది. దాంలోనుంచి వో ఆఫీసరూ, ఇద్దరుసోల్జర్లూ దిగారు. ఆఫీసర్ అక్సనోవ్ దగ్గరికివచ్చి "మీరెవరు? ఎక్కడనుంచి వస్తున్నారు?" అంటూ ఏవేవో ప్రశ్నలడగ సాగాడు. అక్సనోవ్ అతడిప్రశ్నల కన్నింటికీ జవాబులు

చెప్పి, "కాస్త టీ పుచ్చుకోరూ?" అని మర్యాద చెయ్యబోయాడు. కాని, ఆ ఆఫీసర్ దాన్ని వినిపించుకోకుండానే, "రాత్రి మీరెక్కడ బస చేశారు? ఒంటరిగా దిగారా? లేక, ఎవరైనా వర్తకుడితో వున్నారా? అతణ్ణి ఈ వుదయం చూశారా? ఇంత చీకటిలో బయలుదేరి వచ్చారేం?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

తనను ఈ ప్రశ్నలన్నీ అడగడమెందుకా? అని అక్సెనోవ్ విస్తుపోయాడు. అయినా జరిగినదంతా చెప్పి, "నేనేదో దొంగనో, తోడుబోతునో అన్నట్టు గుచ్చిగుచ్చి ప్రశ్నలడుగుతున్నారెందుకు?" అని అడిగాడు.

వెంటవచ్చిన సోల్జర్లను ఇద్దర్ని దగ్గిరికి రమ్మని పిలుస్తూ, ఆఫీసర్ ఇలాఅన్నాడు: "నేను ఈజిల్లా పోలీసుఅధికారిని. మిమ్మల్ని ఈప్రశ్న లన్నీ అడగడ మెందుకంటే, రాత్రి మీతో కలిసి ఆహోటల్‌లో బసచేసిన వర్తకుణ్ణి యెవరో గొంతుకోసి చంపారు. మీ పెట్టెల్ని మేమోసారి సోదాచూడాలి"

అందరూచేరి, ఇంట్లోకి వెళ్ళారు. పోలీస్ ఆఫీసరూ, సోల్జర్లూ అక్సెనోవ్ పెట్టెల్నివిప్పి, సోదాచూడసాగారు. కాసేపటికి ఆఫీసరు చరాలున ఒకపెట్టెలో నుంచి కత్తినొకదాన్ని తీసి "ఇదెవరిది?" అని అడిగాడు.

తన పెట్టెలోనుంచి రక్తం డాగులున్న కత్తిని తియ్యడం చూచి, అక్సెనోవ్ తెల్లబోయాడు.

"ఈకత్తిమీద రక్తండాగు లున్నాయేం?".

అక్సెనోవ్ జవాబు చెప్పడానికి ప్రయత్నించాడు. కాని ఒక్కమాటైనా పెగల్లేదు. చివరికెలానో "నాకు... తెలియదు... నాది కాదు" అని నత్తినత్తికొట్టాడు.

అప్పుడు పోలీస్ ఆఫీసరు ఇలాఅన్నాడు:

"ఈ వుదయానికి రాత్రి నీతోపాటు బసచేసినవర్తకుడు కంఠంతెగి, చచ్చి, పక్కలో పడివున్నాడు. నీవుతప్ప మరెవ్వరూ

ఈ పనిచేసి వుండడానికి వీల్లేదు. హోటల్ తలుపులు లోపల నుంచి గడవేసివున్నాయి ; లోపల మరెవ్వరూ లేరు. నీ పెట్టెలో ఇదుగో ఈ రక్తపు డాగులకత్తివుంది. పైగా, నీమాటా నీనడవడీ గుట్టు బయటపెడుతున్నాయి! ఇంకా దాపరికం దేనికి? అతణ్ణి యెలా చంపావో, యెంతసొమ్ము దొంగిలించావో చెప్పివెయ్యి!"

తనకు ఏపాపం తెలియదనీ, కలిసి టీతాగిన తర్వాత ఆవర్తకుణ్ణి తిరిగి తానుచూడలేదనీ, తనస్వంతడబ్బు ఎనిమిదివేల రుబుల్సు తప్పితే, తనదగ్గర వేరేపైకం లేదనీ, ఆకత్తి తనదికాదనీ ఆక్సినోవ్ ప్రమాణపూర్తిగా చెప్పాడు. కాని, అతడిమాట తడబడింది. అతడిముఖం వెలవెలబోయింది. నిజంగా నేరంచేసినవాడిలా అతడు గజగజ వణికిపోయాడు.

ఆక్సినోవ్ కాళ్లూ చేతులుకట్టి, బండిలో వెయ్యవలసిందిగా పోలీసు ఆఫీసర్ సోల్జర్లకు ఉత్తరువు చేశాడు. వాళ్లు తనకాళ్లూ చేతులుకట్టి, బండిలో వేస్తూవుంటే, ఆక్సినోవ్ వలవల యేడ్చాడు. తన దేవుణ్ణి ప్రార్థించాడు. అతడి డబ్బును, అతడి పెట్టెల్నీ తీసుకుని, అతణ్ణి అక్కడికి సమీపంలోవున్న పట్టణానికి పంపించి ఖైదుచేశారు. అతనినడవడిని గురించి వ్లాడిమిర్‌లో దర్యాప్తు చేశారు. వర్తకులూ, ఇతరపురవాసులూ పూర్వంఒకప్పుడు, అతడు తాగి, అల్లరి చిల్లరగా తిరుగుతూ వుండేవాడుగాని, ఇప్పుడు మాత్రం చాలా పెద్దమనిషిఅని చెప్పారు. ఆతర్వాత విచారణ ప్రారంభమైంది. ర్యాజాన్‌వర్తకుణ్ణి హత్యచేసి, అతడి ఇరవైవేల రుబుల్సును దొంగిలించాడని అతడిమీద కేసు పెట్టారు.

పాపం! అతడిభార్యవిచారం ఇంతింతకాదు. ఆవిడకు ఏమి నమ్మాలో, ఏమి నమ్మగూడదో కూడా పాలుబోలేదు. ఆవిడ బిడ్డలందరూ పసికందులు. ఇంకా వొకబిడ్డ పాలైనా విడవలేదు. వాళ్లందరినీ వెంటబెట్టుకుని, తనభర్త జైల్లోవున్న పట్టణం వెళ్లింది. మొట్టమొదట్లో అయితే అతణ్ణి చూడ్డానికి వీల్లేదన్నారు. కాని, చాలా బతిమలాడినమీదట, అధికారులు అనుజ్ఞ

నిచ్చారు. దొంగలతోనూ, తాగుబోతులతోనూ కలిసి ...జైలు దుస్తుల్లో...సంకెళ్లతో వున్న భర్తను చూచేసరికి ఆవిడ స్పృహతప్పి పడిపోయింది. తిరిగి చాలాసేపటికి గాని ఆవిడకు తెలివిరాలేదు. దుఃఖోద్వేగం కొంతతగ్గగానే ఆవిడ బిడ్డల్ని దగ్గరకుతీసుకుని భర్తదగ్గర కూర్చుంది. ఇంటిదగ్గరి కబుర్లన్నీ చెప్పి “మనకర్మం ఇలావచ్చిందేమి?” అని అడిగింది, అతడు జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అంతావిని “ఇప్పుడిక మనం ఏమి చెయ్యాలి?” అని ఆవిడ అడిగింది.

“పాప పుణ్యాలెరుగని వాణ్ణి; సర్వనాశనం కానియ్యవద్దని జార్ చక్రవర్తికి అర్జీపెట్టుకోవాలి”

తాను అర్జీ పంపించాననీ, దాన్నితోసి వేశారనీ ఆవిడ చెప్పింది.

అక్స్యోనోవ్ మారుమాటాడకుండా తలవంచి వేసుకున్నాడు.

అప్పుడతని భార్య ఇలాఅంది “మీతల నెరిసి పోయినట్లు పీడకల వచ్చిందని ఆనాడు మీతో చెప్పలేదూ? ఇప్పుడు ప్రయాణం మంచిది కాదంటే, నా మాట విన్నారు కారుగా!” తన వేళ్లను అతడి జుట్టులోకి పోనిచ్చి, తల నిమురుతూ, “నాతో నిజంచెప్పండి: మీరు కాదూ ఆపని చేసింది?” అని అడిగింది.

“అయితే, నీవుకూడా నన్ను అనుమానిస్తున్నావన్న మాట!” అని, అక్స్యోనోవ్ రెండు చేతులతోనూ ముఖాన్ని కప్పుకొని అవురుమని యేడ్చాడు. అంతలో ఓ సోల్జర్ వచ్చి, ఇక ఆ భార్యాబిడ్డలూ కదిలి పోవాలని తొందపెట్టసాగాడు. అక్స్యోనోవ్ ఆ కుటుంబాన్ని కడసారిచూడ్డం అదే!

వాళ్లు వెళ్లిపోగానే, జరిగిన సంభాషణ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. చివరకు తనభార్యకూడా తనమీద అనుమానం వున్నదని తెలుసుకోగానే, అతడిలా అనుకున్నాడు: “సత్యాన్ని గ్రహించగలిగింది ఆ ఒక్క పరమేశ్వరుడే! మనం అతడినే నమ్ముకోవాలి. అతడే మనల్ని దయచూడాలి.”

అంతే! ఆనాటినుంచి అక్సనోవ్ అర్జీలు పెట్టుకోవడం మానివేశాడు. అధికారులు దయజూస్తారనే ఆశవదిలేశాడు. కేవలం పరమాత్ముణ్ణి ప్రార్థించసాగాడు.

ముందు కొరడాతో బాది, ఆ తర్వాత సైబీరియాగనుల లోకి ఖైదీగా పంపించమని శిక్ష వేశారు. ఆశిక్ష ప్రకారం ముందుగా అతణ్ణి కొరడాతో మోదారు. కొరడా దెబ్బలవల్ల పడ్డ గాయాలు మానగానే, తక్కిన ఖైదిలతో పాటు సైబీరియాకు పంపించివేశారు.

ఇరవైఆరు సంవత్సరాలపాటు అక్సనోవ్ సైబీరియాలో ఖైదీగా వున్నాడు. అతడి తల పూర్తిగా పండిపోయింది.

పొడుగ్గా, పలచగా పెరిగిన అతడి గడ్డంకూడా నెరిసిపోయింది. అతడి హుషార్ అంతా చచ్చిపోయింది. బాగా గూని వచ్చివేసింది. అడుగులు లెఖ్ఖపెడుతూ వున్నట్టు నడుస్తూ వుండేవాడు. సాధారణంగా ఎవ్వరితోనూ మాటాడేవాడు కాదు. ఎన్నడూ నవ్వేవాడు కాదు. కాని, తరచు ప్రార్థన చేసుకుంటూ వుండేవాడు.

జైల్లో అక్సనోవ్ బూట్లు కుట్టడం నేర్చుకున్నాడు. ఈ విద్యతో కాస్తడబ్బు కూడబెట్టి, "ఋషి సత్తముల జీవితచరిత్ర" అనే గ్రంథాన్ని కొనుక్కున్నాడు. జైల్లో వెలుతురుగా వున్నంతవరకూ అతడు ఈ గ్రంథాన్ని పారాయణ చేస్తూవుండేవాడు. ఆదివారాలనాడు ప్రిజన్‌చర్చికి వెళ్లి, అక్కడ బైబుల్ పారాయణ చేసేవాడు. కంఠం ఇంకా శ్రావ్యంగానే వుండడంవల్ల అతడు తక్కిన వారితో కలిసి ప్రార్థన గీతాలుకూడా చదువుతూ వుండేవాడు.

నెమ్మదిగలవాడని జైలుఅధికారులు అక్సనోవ్‌ను ఇష్టంగా చూచేవారు. ఇహ, తోటిఖైదీలకు అతడంటే, చాలా గౌరవం! వాళ్లు అతణ్ణి "తాత" అనీ, "స్వామీజీ" అనీ పిలుస్తూ వుండేవారు. జైలు అధికారుల్తో యేమైనా మొరపెట్టు

కోవలసివుంటే, వాళ్లు అక్సెనోవ్‌నే తమ పెద్దగా యెన్నుకునే వారు. తమలో తమకు పోట్లాటలువస్తే, మధ్యవర్తిత్వం చెయ్యమని అతడి దగ్గరికే వచ్చేవారు.

అక్సెనోవ్‌కు ఇంటి కబుర్లు తెలిసేవికావు. భార్యాబిడ్డలూ ఇంకా జీవించి వున్నదీ లేనిదీ అయినా, అతడికి తెలియదు.

ఇలావుండగా ఒకనాడు కొత్తఖైదీల ముఠావొకటి జైలుకువచ్చింది. ఆసాయంత్రమపూట పాతఖైదీలందరూ కొత్తవాళ్ల చుట్టూచేర, మీరు ఏయేవూళ్ళనుంచి వచ్చారనీ, ఎందుకుగాను మీరు శిక్షపడ్డారనీ వాళ్ళను అడిగారు. అక్సెనోవ్ కూడా కొత్తఖైదీలకు దగ్గరగా కూర్చుని, వంచినతలయెత్తకుండా, వాళ్ళసంభాషణ వింటున్నాడు.

కొత్తఖైదీలలో వొకడు సన్నగానూ, పొడుగ్గానూ ఉన్నాడు. అతడివయస్సు అరవైసంవత్సరాలై వుంటుంది. గడ్డంబాగా అంట కత్తిరించివుంది. అది అప్పుడే కొంచెంకొంచెంగా నెరుస్తూవుంది. అతగాడు తాను యెందుకు అరెస్టు అయ్యిందీ ఇతరులకు చెబుతున్నాడు.

“అబ్బే! నేనేమీ నేరం చెయ్యలేదు. ఉత్తిపుణ్యానికి శిక్షవేశారు. స్లెడ్జికి కట్టివున్న గుర్రాన్ని విప్పాను. అంతమాత్రానికే అరెస్టుచేసి, దొంగతన్నాని చేశానని చార్జిపెట్టారు. తొందరగా ఇంటికి వెడదామని గుర్రాన్ని విప్పాననీ, ఇల్లు చేరగానే దాన్ని తిరిగి వదలివేద్దామని అనుకున్నాననీ, పైగా ఆ స్లెడ్జి ఆసామి నాజతగాడనీ, నేనేమీ నేరంచేసివుండలేదనీ ఎంతమొత్తుకుంచెప్పినా, ససేమిరా నామాట విన్నారుకాదు. పోనీ, నేను గుర్రాన్ని యెలాదొంగిలించానో, యెక్కడదొంగిలించానో చెప్పగలిగారాఅంటే అదీలేదు. ఒకప్పుడు నేను నిజంగానే నేరంచేశాను. న్యాయానికి యెప్పుడోనే నిక్కడికి రావలసింది. కాని, ఆసారి నేను పట్టుపడలేదు.

ఇప్పుడు ఏమీ నేరంచెయ్యకపోయినా, ఇక్కడికి రావలసివచ్చింది. ఆఁ ! అన్నట్టు, నేనిక్కడికి మునుపోసారి వచ్చాను. అయితే, అప్పుడిక్కడ చాలా రోజులపాటు వుండలేదు."

"మీ దేవూరు?" అని యెవరో అడిగారు.

"వ్లాడిమిర్. మా తాతముత్తాలనాటినుంచి మావూరు అదే. నా పేరు మాకర్. నన్ను సిమెనిచ్ అనికూడా అంటారు".

ఆక్సెనోవ్ తలయెత్తి ఇలా అడిగాడు:

అయితే, సిమెనిచ్! వ్లాడిమిర్‌లో ఆక్సెనోవ్ అనే వర్తకకుటుంబంసమాచారం నీకేమైనా తెలుసా? ఆ కుటుంబం ఇంకా వుందా?"

"తెలియకేం? భేషక్ గా తెలుసు! వో! వాళ్ళపని మహాజోరుగా వుంది. అయితే, వాళ్ళనాన్న మనమాదిరిగానే యేదోతప్పుడు పనిచేసి సైబీరియాలో ఖైదీగా వుంటున్నాడట! దానికేంగాని తాతా! నీ విక్కడికెలావచ్చావ్ ?"

తన దురదృష్టాన్నిగురించి ముచ్చటించడం అంటే ఆక్సెనోవ్‌కి తలనొప్పి. అంచేత అతిముక్తసరిగా "చేసిన పాపఫలంగా ఇరవైఆరు సంవత్సరాలనుంచీ కారాగారవాసం అనుభవిస్తున్నాను" అన్నాడు.

"ఏమిటా పాపం ?" అని మాకర్ సిమెనిచ్ అడిగాడు.

ఇందుకు ఆక్సెనోవ్ "ఏదో పోనిద్దూ! భగవంతు డెంత రాసిపెట్టాడో, అంతా అనుభవిస్తున్నాను" అని అన్నాడు. ఇంతకుమించి అతడింకొక్క పిసరైనా బయటపెట్టేవాడు కాదు. కాని, తక్కిన పాత ఖైదీలుమాత్రం ఆక్సెనోవ్ కథనంతా ఆ కొత్తవాడికి చెప్పారు.

కథనంతా వినగానే మాకర్ సిమెనిచ్ ఆక్సెనోవ్ వంక చూచి, తనతొడ చరుచుకుని —

"ఆఁ! అలాగేం! భేష్! అయితే, తాతా! చాలా ముసిలాడివై పోయావ్!" అన్నాడు.

ఇంత ఆశ్చర్యపడుతున్నా వెందుకనీ, ఇంతకు పూర్వం ఆక్సనోవ్‌ను యెరుగున్నావాఅనీ తక్కినవాళ్ళు అడిగారు. కాని, మాకర్ సిమెనిచ్ ఇందుకు జవాబు చెప్పలేదు.

"ఇక్కడ మే మిద్దరం కలుసుకోడం గొప్పవిశేషమే!" అని మాత్రం అత డన్నాడు.

ఈ మాటల్ని వినేసరికి "ఆవర్తకుణ్ణి చంపిన దెవరో ఇతడికి తెలుసునాయేం?" అని ఆక్సనోవ్‌కు ఆలోచనపోయింది. అంచేత —

"సిమెనిచ్! బహుశా, నీవు ఈ విషయం వినేవుంటావు. మనం ఇంతకుముందు యెక్కడైనా కలుసుకున్నాం కూడానా?" అని అడిగాడు.

"లోకంఅంతా కోడై కూస్తే, వినకుండా వుంటానా? కాని, అబ్బో! ఏనాటిమాట! అప్పుడు విన్నదేమిటో ఇప్పటి దాకా గుర్తుండి యేడుస్తుందీ?"

"వర్తకుణ్ణిచంపిన వాడెవడని చెప్పుకున్నారు?" అని ఆక్సనోవ్ ప్రశ్నించాడు

"ఆఁ! యెవడేమిటి? కత్తి యెవడిపెట్టిలో కనబడిందో, వాడే!" అని మాకర్ సిమెనిచ్ నవ్వుతూ జవాబిచ్చాడు. "మరెవడో కత్తిని అక్కడ దాచాడన్నా... ఏదో సామెతచెప్పినట్టు ...దొరికేవరకూ వాడు దొంగకాడు. పెట్టి నీ తలకిందవుండగా దాంలో పరాయివాడు కత్తి నెలాపెట్టాడు? పరాయివాడే పెట్టివుంటే, నీకు నిద్ర మెళుకువవచ్చేదికాదూ?"

ఈమాటల్ని వినగానే వర్తకుణ్ణిచంపింది ఇతడేనని ఆక్సనోవ్ నిశ్చయపరుచుకున్నాడు. వెంటనే లేచి, అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రంతా అక్స్యోనోవ్‌కు కంటిమీద కునుకులేదు. అతడిమనస్సు చాలా వ్యాకుల పడింది. ఎన్నో దృశ్యాలు అతడికళ్లకు కట్టినట్లు అగుపించాయి. సంతకు ప్రయాణమై వెడుతూ తాను తన ఇల్లాలిదగ్గర సెలవుపుచ్చుకోవడం ఒకదృశ్యం. సాక్షాత్తు తన ఎదటికివచ్చి నిలబడినట్లుగా ఆవిడ రూపమంతా కనబడింది. ఆవిడ ముఖమూ, ఆవిడ కళ్లు అతడి మనోవీధిలో ఒక్కసారి మెరిసాయి. ఆవిడమాటలు, ఆవిడనవ్వూ అతడి చెవుల్లో కేవలం ప్రతిధ్వనిల్లినాయి.

ఆ తర్వాత అతడికి ...తాను ఖైదు పడ్డప్పుడు యెలావున్నాడో సరిగ్గా ఆ రూపంలోనే...తన చిన్నిబిడ్డలు అగుపించారు. కుడితినీ తోడుక్కుని తప్పటడుగులు వేస్తూవున్న బిడ్డ ఒకడు. తల్లిపాలు కుడుస్తూవున్న బిడ్డ ఇంకొకడూ !

ఆపమ్మట అప్పటిలో తాను ఎలావున్నదీకూడా జ్ఞాపకం వచ్చింది– ఏమి ఆయవ్వనం ! ఏం ఆ హుషారు ! అరెస్టు అవడానికిముందు తాను ఆ పోర్చికోలో కూచోవడం, చీకూ చింతా లేకుండా పాటపాడుకుంటూవుండడంకూడా అతడికి గుర్తువచ్చింది. తాను కొరడా దెబ్బలు పడ్డచోటు, తనను కొరడా దెబ్బలుకొట్టిన ఆసామీ, దీన్ని చూస్తూ చుట్టూనిలబడిన జనమూ, సంకెళ్లూ, ఖైదీలూ, ఇరవైఆరేళ్ల కారాగారవాసం, అకాలంగా వచ్చిన ముదిమీ— ఇవన్నీ అతడి మనోనేత్రం ఎదుట గిర్రున తిరిగిపోయాయి.

ఒక్కసారిగా ఇదంతా తలంపుకు వచ్చేసరికి అతడికి కడుపులోచెయ్యిపెట్టి కలిచివేసినట్లు అయ్యింది ! ఆక్షణంలో ప్రాణం తీసివేసుకోవాలనికూడా అనిపించింది.

"ఇదంతా ఆదొంగవెధవపని !" అని అక్స్యోనోవ్ తలపోశాడు. మాకర్ సిమెనిచ్ మీద అతడికి చెప్పరానంత ఆగ్రహం కలిగింది. తాను ఆప్రయత్నంలో నాశనమైపోయినాసరే, అతడి మీదపగసాధించాలని తహతహ పుట్టింది.

ఆరాత్రంతా అతడు తన ఇష్టదైవాన్ని ప్రార్థిస్తూనే వున్నాడు. అయినా, అతడికి ఈషణ్మాత్రమైనా శాంతి లభించ లేదు.

ఆ మర్నాడు అతడు మాకర్ సిమెనిచ్ దరిదాపులకు వెళ్లలేదు. చివరికి అతణ్ణి కన్నెత్తయినా చూడలేదు.

ఈ విధంగా ఒక పక్షం గడిచింది. అక్సెనోవ్‌కు రాత్రిళ్లు నిద్రపట్టేది కాదు. రకరకాల ఆలోచనలతో అతడికి వెర్రెత్తి నట్టు అయిపోయింది.

ఒకనాటిరాత్రి జైల్లో పచారుచేస్తూవుండగా ఖైదీలు పడు కుంటూవుండే అరుగులలో ఒకదాని కిందినుంచి మట్టి పైకిఉబుకు తూవున్నట్టు అతడికి కనబడింది.

ఏమిటి చెప్మా? అని ఆశ్చర్య పడుతూ, అతడక్కడ నిలబడిపోయాడు. ఇంతలో హఠాత్తుగా మాకెర్ సెమెనిచ్ అరుగుకిందినుంచి పైకి పాకివచ్చి బెదురుమొ హంతో అక్సెనోవ్ వంక చూచాడు.

అతణ్ణి చూడనట్టుగానే తన దారిని తాను పోవాలని అక్సెనోవ్ ప్రయత్నించాడు. కాని, మాకర్ అతడి చెయ్యిపట్టుకుని నిలవేసి, జైలుగోడకింద తాను కన్నంపెడుతున్నాననీ, కన్నంతవ్వగా వచ్చినమట్టిని ఏరోజు కారోజు తన హైబూట్సులోకి యెక్కించి, పనికంటూ బయ టికి వెళ్లినప్పుడు రోడ్డుమీద పారబోసివస్తున్నాననీ చెప్పాడు.

"గప్‌చిప్‌గా వూరుకున్నావంటే, నీవు కూడా నాతో పాటు వుడాయించవచ్చు. నామాటవినక నీవు యేమాత్రం వా గినా వాళ్లు నన్ను చావగొట్టేస్తారు. కాని, చచ్చేముందు నీ గొంతు పిసికేస్తాను సుమా!"

తన విరోధియెదుట ముఖాముఖి నిలబడేసరికి, పట్టరాని కోపంవచ్చి అక్సెనోవ్ నఖశిఖపర్యంతం కంపించాడు.

"పారిపోవాలని నాకేమీ కోర్కె లేదు. నీవు నన్ను ముందెప్పుడో చంపడ మేమిటి? ఆపని యేనాడో చేసివేశావ్! ఇహ నీవు చేస్తున్న పని బయటపెట్టడంమాట అంటావ్? భగవదాజ్ఞ ప్రకారం చెబితేచెబుతాను; లేకపోతే లేదు" అంటూ అతడు చెయ్యివిదిలించుకు వెళ్లిపోయాడు.

మర్నాడు పనికోసం ఖైదీలను బయటికి తీసుకువెళ్లినప్పుడు యెవడో వొకడు తనబూట్సులోనుంచి మట్టి గుమ్మరించాడని వార్డర్లు కనిపెట్టారు.

వెంటనే జైలును సోదాచూడగా కన్నం కనబడింది. సూపరింటెండెంటు ఖైదీ లందరి దగ్గరికి వచ్చి, కన్నం యెవరుపెట్టిందీ బయటపెట్టమని అడిగాడు. ఎవడిమట్టుకు వాడు తనకేమీ తెలియదన్నాడు. నిజంతెలిస్తే మాకర్ సిమెనిచ్‌ని చావగొట్టేస్తారని రహస్యం తెలిసినవాళ్లుకూడా కిమ్మన్నాస్తిగా వూరుకున్నారు. చివరకు సూపరింటెండెంటు అక్సెనోవ్ వైపుకు తిరిగి ఇలా అన్నాడు:

"నీవు నిజాయితీవున్న ముసలాడివి; దేవుడిముఖంచూచి, కన్నం యెవడుపెట్టాడో చెప్పు!"

తనకేమీ పట్టనట్టుగా మాకర్ సిమెనిచ్ సూపరింటెండెంట్ వంకే చూస్తూ నిలబడ్డాడు. అక్సెనోవ్ చేతులూ, పెదవులూ వణికిపోయాయి. చాలాసేపటివరకు అతడి నోటివెంట మాటేపెగలేదు.

"నా జీవితాన్ని ధ్వంసంచేసిన వీడ్ని నేను దాచడం దేనికి? నేనుపడ్డ బాధలన్నింటికీ వీడికి తగినశాస్తి జరగవలసిందే? కాని, తీరా చెప్పివేస్తే, వెధవను చావగొట్టేస్తారేమో! పైగా, వీడిపైన నేను అనవసరంగా అనుమాన పడుతున్నానేమో! ఇంతకూ, వీడ్ని చావగొడితే, నాకు వొరిగేదేముంది?" ఇలా అక్సెనోవ్ మనస్సు [illegible] పోయింది.

"ఏం, ముసలాడా? నాటూడకేం? నిజం చెప్పు! కన్నంపెట్టిన వాడెవడు?" అని సూపరింటెండెంటు మళ్లీ అడిగాడు.

మాకర్ సిమెనిచ్ వంక వోరగాచూచి, అక్సెనోవ్ "చెప్ప ను, స్వామీ! చెప్పవద్దని ఇది భగవదాజ్ఞ. తమ అధీనంలో వున్నాను. తమయిష్టం; నన్నేమిచేసినాసరే!" అన్నాడు.

సూపరింటెండెంటు యెంతతన్నులాడినా, అక్సెనోవ్ బయటపడనేలేదు. అంచేత, ఆవ్యవహారాన్ని అంతటితో వదిలి వెయ్యకతప్పిందికాదు.

ఆరాత్రి అక్సెనోవ్‌కు కొంచెం కునుకు పడుతూవుండగా ఎవరో నెమ్మదిగావచ్చి అతడిపక్కమీద కూర్చున్నారు. చీకటి గుంటా పొడుచుకుచూడగా, ఆవచ్చినవ్యక్తి మాకర్ అని తేలింది.

"ఎందుకిలా వచ్చావ్? మళ్లీ నా కేమితిప్పలు తెచ్చి పెడదామని?" అంటూ అక్సెనోవ్ అడిగాడు.

మాకర్ సిమెనిచ్ స్తబ్ధుగా వూరుకున్నాడు. అంచేత అక్సె నోవ్ లేచి కూర్చుని, "ఎందుకొచ్చావ్? పోతావా, పహరా జవాన్ను పిలవనా? అని బెదిరించాడు.

మాకర్ సిమెనిచ్, అక్సెనోవ్‌కు దగ్గరగా జరిగి "ఇవాన్ డిమిట్రిచ్! నాతప్పుకాయి!" అని నెమ్మదిగా అన్నాడు.

"ఏంతప్పు?"

"వర్తకుణ్ణి చంపి, కత్తిని నీ పెట్టెలో దాచింది నేనే! నిన్నుకూడా చంపాలని అనుకున్నాను. కాని, బయట ఏదో చప్పుడువినబడే సరికి, కత్తిని నీ పెట్టిలో దాచేసి, కిటికీగుండా పారిపోయాను."

ఏమి అనాలో తోచక, ఆక్సెనోవ్ మాటాడకుండా పూరు కున్నాడు. మాకర్ షిమెనిచ్ పక్కమీదినుంచి లేచి, నేలమీద మోకరిల్లి —

"ఇవాన్ డిమిట్రిచ్! నాతప్పుకాయి! నన్ను దయ చూడు! వర్తకుణ్ణి చంపింది నేనేనని చెప్పివేస్తాను. నిన్ను వదిలే స్తారు. నీవు ఇంటికి పోవచ్చును" అని అన్నాడు.

"నీకేం, ఇప్పుడేమైనా అంటావు!" అని ఆక్సెనోవ్ అందుకున్నాడు. "కాని, ఈ యిరవైఆరు సంవత్సరాలూ నీ కోసం నేనీ బాధలన్నీ పడ్డాను. ఇప్పుడు నేనెక్కడికి పోను? ...నా భార్య చచ్చిపోయింది. నా బిడ్డలు నన్ను మరిచిపోయారు. ఎక్కడికి వెళ్లడానికీ నాకు దిక్కులేదు..."

మోకరిల్లినచోటినుంచి లేవకుండా, తల నేలకువేసి కొట్టు కుని "ఇవాన్ డిమిట్రిచ్! నాతప్పుకాయి!" అంటూ మాకర్ సిమెనిచ్ మొరపెట్టుకున్నాడు. "వాళ్లు కొరడాపెట్టి బాదినప్పు డైనా ఇంతటిబాధ అనిపించలేదు...అయినా, నీవు నాపైదయ తలిచి, నన్ను దాచావు. ఏమైనా సరే, నా తప్పుకాయి!" ఇలా అంటూ అతడు వెక్కి వెక్కి యేడ్వసాగాడు.

అతడు యేడవడం చూచి, ఆక్సెనోవ్‌కూడా కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు.

"ఆ పరమాత్ముడే నిన్ను క్షమిస్తాడు ఏమో, ఎవరికితెలుసు? నీకంటె నేనే వెయ్యిరెట్లు పాపాత్ముడనేమో?" అని అత డన్నాడు.

ఈ మాట లన్నాడో లేదో, అతడి గుండెమీది నుంచి పెద్ద బరువుదిగించినట్లు అనిపించింది; ఇంటిమీది బెంగ కూడా ఒక్కసారిగా మాయమైపోయింది.

జైలు వదిలి, బయటికి పోదామనే ఆశేమాని, అతడు అవసానకాలంకోసం యెదురు చూడసాగాడు.

ఆక్సెనోవ్ వద్దని యెంతచెప్పినా వినక, మాకర్ సిమెనిచ్ తననేరం వొప్పుకున్నాడు.

అయితే విడుదలఉత్తరువు రాకముందే ఆక్సెనోవ్ స్వర్గస్థుడయ్యాడు.

# సెవొలోడ్ గార్షిన్

# (1855–1888)

# నాలుగురోజులు

రివ్వుమంటూ దూసుకుపోతూవున్న తుపాకిగుళ్ళగుండా మేమెలా పరుగెత్తామో, ఫెళ ఫెళమంటూ దెబ్బతిన్నచెట్ల కొమ్మలు యెలావిరుచుకు పడ్డాయో, హాథారన్ పొదలమధ్యగా మేమెలా యుద్ధంచేసుకుంటూపోయామో నాకు చాలా బాగా జ్ఞాపకం.

తుపాకిగుళ్ళ వర్షం ఎక్కువైంది అడవిఅంచున, అనేక చోట్ల ఎర్రటిది ఏదో కానవచ్చింది. ఫస్టుకంపెనీ సైడరోవ్ ("ఇతడు మా కంపెనీలోకి ఎలావచ్చాడుచెప్మా?" అనే ప్రశ్న నా మనోవీధిని మెరిసింది) హఠాత్తుగా చతికిలబడిపోయి, బెదిరిన పెద్దకళ్లతో నావంక చూచాడు. అతడి నోటినుంచి రక్తం కాల్వగట్టింది.

ఔను, అంతే! నాకిది చక్కగా జ్ఞాపకం. సరిగ్గా అడవి అంచున... గుబురుగావున్న పొదలమధ్య... "అతడు" ఎలా ఎదురుపడ్డాడో కూడా నాకు జ్ఞాపకమే! అతడు టర్కీవాడు. ఏనుగంతటిమనిషి. ఇక నేనో, పీనుగులాంటివాణ్ణి. అయినా, అతడి మీదికి లఘించాను. ఏదో పెద్దది (నాబుద్ధికది అలానే తోచింది) నన్ను దూసుకుపోయింది. నాచెవులు గింగురుమన్నాయి.

"నాపైకి తుపాకిపేల్చాడురా!" అని అనుకున్నాను. ఆ క్షణంలోనే అతడు కెవ్వుమని కేకపెట్టి, వెనక్కు వెనక్కు

వెళ్ళి, ఒకపోఖారగన్ పొదలోపడ్డాడు కావాలంటే పొదను తప్పు
కువెళ్ళడానికి అతడికి అవకాశం లేకపోలేదు. కాని, భయవిహ్వ
లంకొద్దీ మతికొస్తూ పోవడంవల్ల వెళ్ళివెళ్ళి సరిగ్గా పొదమ
ధ్యలో కూలబడ్డాను ఒక్కదెబ్బతో అతడి చేతిలోవున్న తుపా
కిని వూడకొట్టాను; ఇంకొక్కదాంతో నా బేయనెట్టును
ఇటువైపునుంచి అటువైపుకు పొడిచాను.

పెద్దఉరుపు, గొడ్డుమూలుగు,—నేను ముందుకు పరిగెత్తాను

మా సైనికులు "హుర్రా" అంటూ విజయధ్వానాలు
చేస్తున్నారు. కూలేవాళ్ళు కూలుతూవుంటే, మిగిలినవాళ్ళు తుపాకులు
కాలుస్తున్నారు. అడవిని దాటి, పొలాలల్లోకి వెళ్ళగానే,
నేనుకూడా చాలా బాళ్ళు వదిలినట్టు జ్ఞాపకం. ఒక్కసారిగా విజ
యధ్వానాలు ఇంకా యెక్కువైనాయి. మేమందరమూ ముందుకు
పడదోసుకుపోతూం. "మే" మంటే, మా సైనికులన్నమాట. నేను
మాత్రం వెనకే మిగిలిపోతూను. తక్కినవాళ్ళందరూ ముందుకు
పడదోసుకుపోతూవుంటే నేనొక్కణ్ణే వెనక మిగిలిపోవడం వింత
గానే కనబడింది. కాని, దీన్నిమించిన వింతయేమిటంటే,—
హఠాత్తుగా సర్వం శూన్యంకావడం! విజయధ్వానాలు విలు
ప్తమైనాయి; ఫైరింగ్ ఆగిపోయింది. అంతా గాఢ నిశ్శబ్దం.
కంటికిమాత్రం నీలంగా యేదో కనబడింది ఆకాశమే అయి
వుండాలి. ఆ మరుక్షణంలో అదీ అదృశ్యమైంది.

అంతటి వింతస్థితిలో నేనుండడం అంతకు ముందెప్పుడూ
సంభవించలేదనే చెప్పాలి. ఎటు పారజూచినా స్వల్పభూభాగం
వినా ఏమీ కనబడలేదు గనక, నేను బోర్లబోర్లగా పడిపోయి
వుండాలి. నాలుగైదు గడ్డిపోచలు, వాటిమీద పాకుతూవున్న
చీమలు, రాలిన యెండుటాకు ముక్కలు,—ఇదే నాప్రపంచ
మంతా! దీన్ని అయినా నేను చూడగలగడం ఒక్కకంటితోటే.
రెండోది, ఏదో గట్టిగా ఒత్తుకుంటూ వుండడంవల్ల, మూతపడి
పోయింది. ఒత్తుకుంటూవున్నది నాతలఆనివున్న చెట్టుకొమ్మే
ఐవుండాలి.

చాలా చికాకు అనిపించింది. ఎంచేత కదలలేకపోతు న్నానో నాకే తోచలేదు. ఇలాగే కొన్నిగంటలు గడిచిపో యాయి. కీచురాళ్లు, తేనెటీగలూ చేస్తున్నధ్వనులుతప్ప ఇతరమేమీ నాకు వినబడ్డంలేదు.

చివరకు అతికష్టంమీద పొట్టకింద మడతపడిపోయినచేతిని యెలాగో తప్పించుకుని మోకాళ్ళమీదకూచోవాలని ప్రయ త్నించేశాను.

శూలం పెట్టిగుచ్చినట్టు మోకాళ్ళ దగ్గర్నుంచీ, పైవరకూ ఒక్కపోటు పొడిచింది. దాంతో మళ్లీపడిపోయాను.

తిరిగి అంతా అంధకారం; అంతా అయోమయం.

మెలకువవచ్చింది. బల్గేరియన్ నిర్మల నీలాకాశతలాన ప్రకాశిస్తూవున్న ఈ నక్షత్రాలని యెలాచూస్తున్నాను చెప్మా? అని అనుకున్నాను. నేను డేరాలోలేనూ? గుడారంవదిలి బయ టికి యెందుకువచ్చాను? కదలడానికి ప్రయత్నించాను. కాళ్లలో విపరీతమైన పోటుపుట్టింది.

యుద్ధభూమిలో నేను గాయపడివుండాలి. పెద్దగాయమా అని కొంతఆశ్చర్యపోయాను. పోటుపుడతూవున్న భాగాలలో తడివి చూసుకున్నాను. చేతికి గడ్డకట్టిన నెత్తురు తగిలింది. స్పర్శవల్ల పోటు మరింత యెక్కువైంది. పంటినొప్పిలా యెడతెరపిలేని బాధ: ప్రాణాలు తోడేసిందంటే నమ్మండి.

చెవులుగింగురుమంటున్నాయి; తల భారంగావుంది. రెండు కాళ్ళకూ గాయాలు తగిలివుండాలని లీలగా తోచింది. నేను గాయపడ్డం యెలాసంభవించింది? నన్ను మావాళ్లు లేవదీసుకువెళ్ళ లేద? టర్కీవాళ్ళు మమ్మల్ని వోడించివుంటారా? మొదట్లో లీలామాత్రంగానూ, తర్వాత పరిస్ఫుటంగానూ మేమే టర్కీ వాళ్ళను జయించివుండాలనే పర్యవసానానికివచ్చాను. మేము వోడిపోయివుండడానికి అవకాశంలేదు. ఎంచేతనంటే, నేను పడిపోయింది... తక్కినవాళ్ళు ముందుకు పరిగెత్తుతూవుంటే, నేనొక్కడినీ వెనకమిగిలిపోవడంతప్ప, పడిపోవడం నాకుజ్ఞాపకం

లేదనుకోండి... అయినా, నేను పడిపోయింది మా కమేండర్ వేలెత్తిచూపిన కొండగుట్టమీద.

"అక్కడికి చేరాలిసుమా!" అంటూ మా కమేండర్ తన కంచు గొంతుతో హెచ్చరించాడు. మేమక్కడికి చేరుకున్నాం. అంచేత మేము పోడిపోయివుండడానికి అవకాశం లేదు.

అయితే, నన్నెవరూ లేవదీసుకువెళ్ళలే దెందుచేత? చెట్టూపుట్టా లేని ఇలాంటిచోట నన్నుగమనించకుండా వుండడానికి వీల్లేదే? నాతోపాటు యిక్కడ మరెవరైనా వున్నారా? అబ్బ! అదేమి తుపాకిగుళ్ళవర్షం!! ఎలాగైనా తల కొంచెం తిప్పిచూడగలిగితే బాగుండును. ఆఁ! తేలిగ్గానే తిరిగిందే! మోకాళ్ళపైకి లేచికూచోవాలని ప్రయత్నించడంలో వెల్లకిలగా పడిపోయినట్టున్నాను. ఓహో! నక్షత్రాల్ని చూడగలగడం ఇంచేతనా! లేచికూచోవాలని ప్రయత్నించాను. కాళ్ళు రెండూ గాయపడ్డప్పుడు ఇది సులభసాధ్యమా? చాలా ప్రయత్నంచేసి, ఇకలాభం లేదని నిరాశచేసుకుని, అయినా ఇది చివరిపర్యాయం అంటూ ఇంకొక్కసారి ఓపికపట్టి, బాధకొద్దీ గిర్రున నీళ్ళుతిరిగినకళ్ళతో లేచి కూచున్నాను.

పైన నిర్మలనీలాకాశపథం. ఒక పెద్దనక్షత్రమూ, చాలా చిన్ని నక్షత్రాలూ నల్లగా, పొడుగ్గావున్న యేదోవస్తువు చుట్టూ మిణుకుమిణుకుమంటున్నాయి. ఏమైవుంటుంది చెప్మా అని పరకాయించిచూస్తే, అది పొదలగుబురుగా కనిపించింది. నేనుపొదలమధ్య వున్నాననీ, అంచేతనే నన్ను మావాళ్ళు కనుక్కోలేకపోయారనీ చప్పున తోచింది. శరీరం రోమాంచితమైంది. మళ్లీ అంతలోనే ఇంకో సందేహంకూడా కలిగింది. నేను పడిపోయింది బయలు మీదగదా, మరి పొదలమధ్య కెలావచ్చాను? గాయపడ్డంతోటే నాఅంతట నేనే పాకివచ్చివుండాలి. ఇప్పుడు వీసమంతైనా కదలలేకుండా వున్న నేను, ఇంతదూరం పాకిరాగలగడం ఆశ్చర్యమే! బహుశా, అప్పుడు ఒక కాలికి మాత్రమే గాయంతగిలివుం

డాలి. తీరా ఇక్కడికిచేరినతర్వాత ఏదో చెదురుగుండు వచ్చి తగిలి, రెండో కాలినికూడా గాయపరిచివుండాలి.

ఆకాశాన అక్కడక్కడ రజతరాగఖండాలు అలుము కున్నాయి. పెద్దనక్షత్రం వన్నెతగ్గింది. చిన్నినక్షత్రాలు కొన్ని అసలే అదృశ్యమైనాయి. చంద్రుడు ఉదయించాడు. ఇంటిదగ్గ రైతే, ఇకెంత మనోహరంగా వుండేది !

ఎవరో మూలుగుతూవున్నట్టు వింతధ్వని వినబడింది. ఔను, అది మూలుగే ! నాలానే కాళ్ళురెండూ గాయపడి ఎవ రైనా పడివున్నాడా? అని విస్తుపోయాను. ధ్వని చేరువనుంచే వస్తున్నది. అయినా. దగ్గర్లో యెవ్వడూ లేడు.

అరి, దేవుడా ! మూలుగుతూవుంది నేనే ! సన్నని మూలుగు ! అతి జాలికరమైనమూలుగు !! బాధ నిజంగా ఇంత ఘోరంగానూ వున్నదా యేమి? అయివుండాలి. కాని, తల దిమ్మెక్కివుండడంవల్ల నాకుమాత్రం ఏమీ తెలియడంలేదు. కాసేపు పడుకుని నిద్రపోవడం మంచిదేమో ! నిద్ర... తిరిగి లేవడంవుంటుందా ? అయినా, ఈస్థితిలో లేచినా, లేవక పోయినా ఒక్కటేకదూ ?

తిరిగి పడుకోబోతూవుంటే, చంద్రకిరణపుంజాలు వచ్చి పడి, నేనుపడివున్న ప్రదేశమంతా వెలిగింది. కొన్నిఅడుగుల దూరంలో నల్లగా మొద్దుగావున్నదేదో పడివుంది. గాయపడిన వాడు మరెవడో అయివుండాలి, అతడి వంటిమీదవున్న వస్తువు లేవో చంద్రకాంతిలో మిలమిల మెరుస్తున్నాయి. కోటుగుండీలు కాబోలు ! అది ఒకవేళ శవమేమోననికూడా అనుమానించాను.

అలా అనుకుంటూనే పడుకున్నాను......

అసంభవం. మా సైనికులు వెళ్ళిపోయివుండరు. వాళ్ళు యిక్కడేవున్నారు. టర్కీవాళ్లను చావగొట్టి, వాళ్ళస్థానాన్ని ఆక్రమించుకున్నారు. అయితే మరి మాటలసవ్వడి వినబడదే? బలహీనంకొద్దీ ఒకవేళ నాకేమీ వినబడ్డంలేదేమో ! అంతే ! వాళ్ళు ఇక్కడేవున్నారు. "హెల్ప్, హెల్ప్ !"

అప్రయత్నంగా యేవో వెర్రికేకలు వేశాను. కాని, జవాబు లేదు. నిశీథంలో నాకేకలు వింతగా ప్రతిధ్వనించాయి. ఈప్రతిధ్వనులు తప్పితే, అంతా నిశ్శబ్దం. కీచురాళ్లుమాత్రం గొడవ చేస్తున్నాయి. చంద్రుడు ఖిన్న వదనంతో నావంకచూస్తున్నాడు

పక్కనున్న మనిషి బ్రతికేవున్నట్టయితే నాకేకలకు తప్పకుండా లేచేవాడు. అతడు చనిపోయేవుండాలి. అతడు నావాడా? లేక, టర్కీవాడా? యెవ్రగాని, నేనున్న స్థితికి యెవడైతే మాత్రం నాకేమిటి? నిద్రాదేవత వాచిన నాకనురెప్పల్ని మూసివేసింది.

నిద్ర మెలుకువవచ్చి చాలాసేపైనా కళ్ళు మూసుకుని, అలాగే పడుకున్నాను. కళ్ళుమూసివుంటేనే సూర్యకిరణాలు లోపలికి పొడుస్తున్నాయి. ఇక కళ్ళుతెరిస్తే, ఆ తీక్ష్ణాన్ని భరించగలనా? పైగా, వృధాగా ప్రాణాన్ని ఆయాసపెట్టడం దేనికి?

నిన్నను (నిన్ననేనా?) గాయపడ్డాను. అప్పుడే ఒకరోజు గడిచిపోయింది. మరి కొన్నిరోజులు గడుస్తాయి: ఆతర్వాత చచ్చిపోతాను. సరే, పీడవదిలిపోతుంది. కదలకుండావుంటాను: నొప్పైనా కొంచెంతగ్గుతుందేమో. మెదడు పని చెయ్యకుండా ఆపగలిగితే ఎంచక్కగావుంటుంది. కాని, పాతవిషయాలెన్నో జ్ఞాపకంవస్తున్నాయి; ఊహాలెన్నో పుడుతున్నాయి—విధివిరామం లేకుండా! ఇదైనా మరన్నిరోజులు లేం? మరణం ఆసన్నంగానే వుందిగా! యుద్ధంలో మాతరఫున జననష్టం చాలా స్వల్పమని వార్తాపత్రికలలో నాలుగుపంక్తులు ప్రకటిస్తారు: ఇంతమంది గాయపడ్డారని, ఐవనోవ్ అనే వాలంటీరు వొకడు మరణించాడని. అబ్బే! పిచ్చిగాని, నాపేరు వాళ్ళకు జ్ఞాపకంవుంటుందీ? వూరికే "ఒకడు మరణించాడు" అనిమాత్రమే అంటారు. ఆచిన్నికుక్కలాగే, అలా!...... ఆ దృశ్యంచప్పున కళ్ళకు కట్టినట్టయింది. ఇది చాలా కాలంక్రితం జరిగినవిషయం. (నా జీవితమంతా, ఇక్కడ పడిపోయినప్పుడు జరిగిన ప్రతివిషయమూ చాలా కాలం

క్రితం జరిగినట్టే తోచసాగింది.) నేనప్పుడు రోడ్డు వెంట నడిచి వెడుతూవుంటే, దారిలో ఒక పెద్దగుంపు యెదురైంది. ఆగుంపు మధ్య ఒళ్లంతా రక్తంతో నిండివున్న చిన్ని తెల్లటికుక్క ఒకటి పడివుంది. పాపం, అది అతి జాలికరంగా అరుస్తూవుంది. ట్రామ్ కార్ దానిమీదగా వెళ్లిందట. తర్వాత కాసేపటికి ఆకుక్క చచ్చిపోయింది, —మరిఒకటి, రెండురోజుల్లో నేను చచ్చిపోవలసి వున్నట్టుగానే జనాన్ని ఇటూ అటూ సర్దుతూవున్న పోలీసు కానిస్టేబుల్ మెడపట్టీ పట్టుకుని, కుక్కను లేవదీసుకు పోయాడు. గుంపు చెల్లాచెదరై పోయింది.

నన్ను కూడా యెవరైనా లేవదీసుకు పోతారా? అబ్బే, నేను ఇక్కడ్నే ఇలానే దిక్కూ మొక్కూ లేకుండా చచ్చి పోవలిసిందే! జీవితం యెంతమధురం!......ఆ కుక్క ట్రామ్ కింద పడిపోయిన రోజున నేనెంత సుఖంగా వున్నానో! కేవలం ఆనంద తన్మయత్వంలో ఆ రోజున నే నా రోడ్డువెంట నడిచి పోయాను. ఆ విషయాలు జ్ఞాపకం తెచ్చుకోవడం...అబ్బ!... ఇప్పుడెంత బాధాకరంగా వుంది! పూర్వపు ఆనందమే ఇప్పటి బాధగా పరిణమించింది!

కాళ్లనొప్పులు చాలదా అన్నట్టు, ఈ జ్ఞాపకాలు కూడా దేనికో? వీటివల్ల నిరాశ హెచ్చుతూవుంది. ఎంతపెద్దగాయమైనా నిరాశకంటె బాధాకరం కాదుగా!

శరీరం వేడెక్కుతూవుంది. ఎండ విపరీతంగావుంది. కళ్లు విప్పగా ఆ పొదలే. ఆ ఆకాశమే ప్రత్యక్షం!

పక్కన అతడు కూడావున్నాడు. ఔను, టర్కీవాడు— చచ్చిన టర్కీవాడు అబ్బ! ఎనుబోతులా యెంత పెద్దగా వున్నాడు ఇతణ్ణి నేనెక్కడో చూచినట్టుందే! అయ్యో! వాడే......నేను చంపినవాడే! నేను అతడి నెందుకు చంపాను? ఒళ్లంతా రక్తంతోనిండి, చచ్చి, అతడిక్కడ పడివున్నాడు. విధి అతడి నిక్కడికి ఎందుకు లాక్కువచ్చింది. ఇంతకూ అత డెవడు? బహుశా నాలానే అతడికి కూడా ముసలి తల్లివుంది

కాబోలు ! తమ గుడిసె వాకిట్లో కూర్చుని, తన ముద్దుకొడుకు కోసం, తన బ్రతుకు వెళ్ళదీయవలసిన దిక్కు కోసం ... పాపం ...ఎన్ని రోజులు దారులు కాస్తుందో !

ఇక, నేనో ? నేనుకూడా......నేనే అతడి స్థితిలో వుంటే ఎంత బాగుండేది ! అతడెంత సుఖంగా వున్నాడు ! అతడికి బాధాలేదు, నిరాశాలేదు, దాహమూలేదు ! బేయొనెట్టు సరాసరి గుండెగుండా గుచ్చుకుపోయింది.

అతడి యూనిఫాంలో పెద్దకంత కనబడుతూ వుంది. దానిచుట్టూ రక్తంమరక.

ఈ ఘోరం చేసింది నేనే !

ఈ ఘోరం చెయ్యాలని ముందుగా అనుకోలేదు. యుద్ధాచకంటూ బయలుదేరి వచ్చినప్పుడు నాకు యెవడిపైనా యేమీ ద్వేషంలేదు. అసలు వొకణ్ణిచంపవలసివస్తుందిగదా అనే ఆలోచనైనా అప్పట్లో తట్టలేదు. తుపాకి గుండుకు నా యెదురొమ్మును పట్టడమే నాపని అని భ్రమ పడ్డాను. కాని, తీరా జరిగిందేమిటి ?

“ఫూల్ ! ఫూల్ ......”

పాపం, ఆ అరబ్బి (అతడు వేసుకున్నది ఈజిప్షియన్ యూనిఫారం లెండి) నాకంటేకూడా పాపపుణ్యాలు యెరగని వాడు. అతడు రుష్యా, బల్గేరియా పేర్లు ఎన్నడూ వినైనా లేదేమో! పడవ యెక్కించారు; కాన్‌స్టాంటినోపుల్ పంపించారు. బయల్దేరమంటూ వుత్తరువు వచ్చింది; బయల్దేరాడు—అంతే ! కాదు కూడదంటే కొరడా పెట్టి బాదేవారు. లేకపోతే, ఏ పాషాయో తపీసుని కాల్చి పారేశేవాడు. కాన్‌స్టాంటినోపుల్ నుంచి, రుమేనియాలోకి కాళ్లీడ్చుకుంటూ నడిచాడు. మేము అతణ్ణి యెదిరించాము; అతడు తనను రక్షించుకోనాలని చూచాడు. కాని, తన సరి కొత్త ఇంగ్లీష్ మార్టినీ రైఫుల్‌ను చూచికూడా భయపడకుండా, మేము పైకి దూకుతూవుంటే అతడి ధైర్యం కాస్తా చెదిరిపోయింది. తీరా పలాయనం చిత్తగించా

లని చూస్తే, పిట్ట అంతేటి మనిషి ... అతడి ఒక్క పిడికిలి పోటుకు నంజూసంజు కావలిసిన మనిషి ... పైకి లంఘించి, గుండెగుండా బేయనెట్టుతో పొడిచాడు. ఇందులో...పాపం ...అతడి తెప్పేముందీ ?

నేను అతణ్ణి చంపానన్నమాటే గాని, నా తప్పుమాత్రం యేముందీ ?

అబ్బ ! ఏమి దాహం ? దాహం ! దాహంఅంటే ఏమిటో తెలిసినవాళ్లెందరున్నారు ? థర్మామీటర్ 105 డిగ్రీలు చూపుతూవుండగా రోజుకు నలభై మైళ్ల చొప్పున రుమేనియా గుండా ప్రయాణంచేసే రోజుల్లోనైనా ఇంతటిదాహం యెన్నడూ యెరగను ! అబ్బ ! ఎవరైనావస్తే, యెంతబాగుండును! అన్నట్టు, టర్కీవాడి వాటర్ బాటిల్ లో నీళ్లు వుండివుండాలి. కాని, అతడిదగ్గిరికి చేరడంయెలా? ఎంత యమయాతన పడాలి ? అయినా, ప్రయత్నించి చూస్తాను.

కాళ్లు నీడ్చుకుంటూ పాకిపోవడానికి ప్రయత్నించాను. చచ్చుపడిన నాచేతులు బరువైన నాదేహాన్ని ఈడవలేకపోయి నాయి. టర్కీవాడు, షుమారు నాలుగుగజాల దూరంలో వున్నాడు. కాని, నా ప్రాణానికి ఈ నాలుగుగజాలూ నాలుగు మైళ్లకంటె దూరంగా కనబడ్డాయి.

ఏమైనాసరే, అక్కడికి చేరితీరాలి. గొంతు చప్పగా యెండిపోయింది, భగభగ మండిపోతున్నది. కాస్త తడుపు కోకపోతే, ఎలాగూ మరింత శీఘ్రంగా చావుతప్పదు. ఇప్పటికీ నాకింకా ఏమైనా ఆశవుంటుందేమో....

అంచేత, అలానే పాకడానికి ప్రయత్నించాను. కాళ్లు రెండూ నేలకు కరుచుకుపోయాయి. అవి ఏమాత్రం అదిరినా పుట్టేపోటు ఇంతింతకాదు. మూలిగాను ; బిగ్గరిగా యేడ్చాను. కాని, పట్టుమాత్రం వదల్లేదు. చివరికెలాగో అక్కడికి చేరాను. ఏం నా అదృష్టం ! బాటిల్ లో సగానికిపైగా నీళ్లు

న్నాయి. చాలారోజులపాటు ఇవిసరిపోతవి. నేను ఘాతుకంగా చంపినవ్యక్తే నాపాలిటి రక్షకుడయ్యాడు. ఒక చేతిమీద ఆని, వాటర్ బాటిల్ మూతవిప్పాలని ప్రయత్నిస్తూవుండగా, హఠాత్తుగా తూలిపోయి, బొక్కబోర్లగా టర్క్కీవాడి ఛాతీమీద పడిపోయాను. వెంటనే పాడుకంపు పుట్టింది.

తనివితీరా నీళ్లుతాగాను. అవిచాలా వేడెక్కివున్నాయి. కాని, ఇప్పటికి చెడిపోలేదు. పైగా, కావలసినన్ని వున్నాయి! మరెన్ని రోజులవరకైనా ఇవిసరిపోతాయి. ఆహారం లేక పోయినా, తాగడానికి నీళ్లుంటే కొన్ని వారాలపాటు బతక వచ్చునని వాడెవడో రాసినమాట చప్పున జ్ఞాపకంవచ్చింది. ఆహారాన్ని వర్జించి, ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించిన ఒక వ్యక్తి, నీళ్లను తాగుతూవుండడం వల్ల చాలారోజుల పాటు చావకుండా బతికివుండడంకూడా స్ఫురణకు వచ్చింది.

సరే గాని, మరి నాలుగు రోజులపాటు ఈ విధంగా ప్రాణాలు నిలవపెట్టుకుంటే మాత్రం కలిగే లాభం ఏముందీ? మా వాళ్లేమో వెళ్లిపోయారు బల్గేరియనులు పరారీ అయ్యారు. దగ్గరలో దారి దొరికేదీ ఏదీ లేదు. ఎలా చూసినా చావు మాత్రం తథ్యం. పోతే, మూడు రోజుల్లో పోవలసిన ప్రాణాల్ని ఏడురోజులవరకు నిలబెట్టుకోవడం కంటె, త్వరగా దాటి పోవడం మంచిది కాదూ? టర్క్కీవాడివైపు చూచాను. చక్కని ఇంగ్లీషు రైఫిల్! గుండ్రంనోక్కుడం ఆలస్యం,— అంతా ఆఖర్! బాగాయిన్ని తూటాలుకూడా వున్నాయి... పాపం, వాటినన్నిటినీ వుపయోగించడానికి ఇతడికి వ్యవధానం లేకపోయింది.

వేగిరించనా, వేచివుండనా? వేచివుండడం దేనికి? మోక్షానికా, మరణానికా? వేచివుంటే, ఖర్మంచాలక టర్క్కీ వాళ్ళు వస్తేవచ్చి, ఉగ్రంగా వొలిచేస్తారేమో! వాళ్ల చేతుల్లో పడడంకంటె నా చేతులతోనే ప్రాణంతీసుకోవడం వుత్తమం

కాదూ? ఎబ్బే, అలా అధైర్యపడితే కాదు. ఊపిరివున్నంత వరకూ, ఎలాగైనాసరే అవస్థపడాలి. మావాళ్లువచ్చారో, నేను బతికానన్నమాటే! ఒకవేళ కాళ్లు చప్పగా విరిగిపోలేదేమో! తిరిగి బాగుపడతాయేమో! స్వదేశాన్నీ, అమ్మనూ, మాషానూ తిరిగి చూడగలుగుతానేమో!...నిజపరిస్థితి వాళ్ళకు తెలియకుండావుంటే బాగుండును. కిక్కురు మనకుండా కూలిపోయానని వాళ్లు అనుకుంటే, అక్కడికది కొంతమేలు రెండు, మూడు, నాలుగు,— ఎన్నో రోజులు ఇలా బాధపడ్డానని తెలిస్తే వాళ్లయెంత చింతపడతారో! తల దిమ్మెక్కింది. ఇంత దూరం పాకివచ్చేసరికి వున్నవోపిక కాస్తా పోయింది. దానికి తోడు ఈ పాడుకంపు. అబ్బ! ఏమి కంపు కొడుతున్నాడు! ఇప్పుడే ఇలావుంటే, ఇంకా రేపటికి యెలా తయారవుతాడో! దూరంగా పారిపోవడానికి మరోపిక లేదు. కాస్త సేదతీర్చుకుని నెమ్మదిగా మళ్లీ నాచోటికి పాకివెడితే, ఈ కంపుబాధ తప్పుతుంది.

కదలలేక అక్కడే పడివున్నాను. ఎండ నా ముఖాన్నీ, చేతుల్నీ మాడ్చివేసింది. కప్పుకోడానికి ఏమైనావుంటే బాగుండును. లేకపోతే, రాత్రికాగాదూ? అయితే, గియితే ఇది రెండోరాత్రి అన్నమాట. అయోమయం ఆలోచనలతో స్పృహ తప్పిపోయింది......

నేను చాలాసేపు నిద్రపోయివుండాలి. ఎంచేతనంటే తీరా మెలుకువవచ్చేసరికి రాత్రివచ్చింది. సర్వం యథాప్రకారంగానేవుంది. బాధ బాధగానేవుంది. కదలక, మెదలక, టర్కీవాడు కొండలా అలానే పడివున్నాడు.

అతణ్ణిగురించి ఆలోచించకుండా వుండలేకపోయాను. నాకు ప్రియమైన ప్రతిదాన్నీ వదిలి, వెయ్యిమైళ్లునడిచి, చలినీ, ఆకలినీ, ఎండవానలనూ సహిస్తూ ఇక్కడికివచ్చింది, పాపం, ఇతడి ప్రాణాల్ని తియ్యడానికేనా? నేనుచేసిన ఈహత్య యుద్ధగమ

నానికి ఏవిధంగా తోడ్పడింది? హత్య! ఔను! నేను హంతకుణ్ణి!

యుద్ధంలో చేరాలని నేను నిశ్చయించుకున్నప్పుడు అమ్మా, మామా కళ్లనీళ్లు కళ్లకుక్కుకున్నారుగాని, నన్ను కాదన లేకపోయారు. నా ఉత్సాహాతిరేకంలో నేను వాళ్ల కళ్ళనీళ్ళను గమనించనేలేదు. వాళ్లు ఎందుకు కంట తడిపెట్టవలసివచ్చిందో అప్పటిలో నాకు అర్థమైనా కాలేదు. పాపం! వాళ్లిద్దరినీ యెంత ఘోరాన్యాయం చేశాను? అయినా, అడుగుజారింతర్వాత ఇప్పుడు విచారించి లాభమేముంది?

నేను వాలంటీరుగా చేరినప్పుడు నా స్నేహితుల్లో కొందరు ఏమి విపరీతాభిప్రాయాలు వెల్లడించారు? "వీడికి మతి పోయిందా?" అన్నారు. "తానెందుకు వెడుతున్నదీ తనకే తెలియు" దన్నారు. ఇంత అవకతవకగా వాళ్లు యెలా అనగలిగారో? వీరత్వం, దేశభక్తి మొదలైన ఉత్తమధ్యేయాలకూ వీరిమాటలకూ ఎంత వ్యత్యాసంవుంది? వాళ్ళ దృష్టిలోనైనా నాలో ఈ ధ్యేయాలన్నీ వున్నాయట. మరి నాకు మతిపోయిం దనడం దేనికి?

నేను కినెనేప్ దగరికి వెళ్ళడం, యూనిఫారం వగైరా పుచ్చుకోవడం, వేలకొద్దివున్న ఇతరసైనికులతో కలిసి ప్రయాణం కావడం,—అంతా జ్ఞాపకంవచ్చింది. యుద్ధానికి ప్రయాణమైన వేలమందిలో నాలాంటి వాలంటీర్లు బహుకొద్దిమందే! మిగతా వాళ్లు...ఏమాత్రం సందుదొరికినా...ఇల్లుకదిలేవారుకాదు. కాని, మామూదిరిగానే వాళ్లుకూడా ఆలోచన ఏమీ లేకుండా, ఈ వెయ్యిమైళ్ళూ నడిచి, నాకంటేకూడా బాగా యుద్ధంచేశారు. వీళ్లైతే తప్పకుండా ఎగవేసేవారుగాని, తప్పలేదు గనక, తమ ధర్మాన్ని తాము సవ్యంగానే నిర్వహించారు.

తెల్లవారుఝామున పెద్దగాలి లేచింది. పొదలు నిట్టూర్పు సాగాయి. నిద్రపోతూవున్న పిట్టలు లేచాయి. నక్షత్రాలు వెల

వెలవోయాయి. నీలాకాశం వన్నె తరిగింది. పాలనురుగుల మబ్బులు ఆవరించదొడగాయి. మసకమసక చీకటి తొలిగి పోయింది. మూడోరోజు ప్రారంభమైంది. ఇక్కడ నాజీవితంలో మూడోరోజని అనాలా? లేకపోతే, ఈ నరకకూపంలో మూడో రోజని అనాలా ?

మూడురోజులు ! ... ఇంకెన్ని మిగిలున్నాయి ? మరి యెన్నో లేనేమో ! నిస్త్రాణ హెచ్చుగావుంది. శవందగ్గరనుంచి పాకిపోలేకుండా వున్నాను. త్వరలో నేనుకూడా ఈ టర్కీవాడి స్థితికే వస్తాను. అప్పుడిక ఇతడింత అసహ్యంగావుండడు. కాస్త దాహంతాగుతాను. రోజుకు మూడుసార్లుచొప్పున దాహం తాగుతూవుంటాను : ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం.

సూర్యుడు ఉదయించాడు. నల్లని పొదలగుండా పెద్దదిగా వున్న అరుణారుణబింబం కాన్పించింది. చూడగా, ఈనాడు యెండ జోరుగా కాస్తుందేమో ననిపించింది.

“నీవు రేపటికి యెలా తయారౌతావో, బాబూ !”

ఇప్పటికే టర్కీవాడు మహాదారుణంగా వున్నాడు. వెంట్రుకలు రాలిపోతున్నాయి. నల్లగా నిగనిగలాడే అతడి శరీరం చప్పగా పాలిపోయింది. పైగా, అది బిరుబిగవడంవల్ల చెవుల వెనకభాగంలో చిట్లింది. లుకలుకమంటూ పురుగులుకూడా పడ్డాయి. గట్టి “గెయిటర్సు”లో వున్న అతడి మోకాటి దండలు వుబ్బడంవల్ల, గుండీలదగ్గరి ఖాళీలగుండా మాంసపుకండలు బయటికి పొడుచుకువచ్చాయి. అసలే దీర్ఘకాయుడేమో, వుబ్బడంవల్ల కేవలం హిమవన్నగంలా కనబడుతున్నాడు. ఈనాటి యెండకు ఇంకెలా తయారౌతాడోగదా !

అతడి దగ్గరిలోవుండడం దుస్సహం. ఏమైనాసరే కాస్త అవతలికి జరిగిపోవాలి. కాని, జరగ్గలనా ? పోటు హెచ్చుగానే వుంది. కాని, ఇంకా పోటూ గీటూ అని సంకోచించడమే ? స్వస్థతగా వుండడం అంటే యేమిటో మరిచిపోయాను; ఆ విష

యాన్ని వూహించనైనా లేని స్థితికి వచ్చాను. అసలు బాధకు అతీతుడనైనట్లుగానే తోచసాగింది.

ఆ వుదయంపూట యెలాగో తంటాలుపడి అయిదారు గజాలు పాకివెళ్లి, నా పూర్వస్థానాన్ని తిరిగి చేరుకున్నాను. కాని, అప్పుడైనా కాస్త మంచిగాలి (కుళ్లుతూవున్న శవానికి అయిదారుగజాల దూరంలో మంచిగాలివుండడానికి అవకాశంవుందని అనుకుంటే) పీల్చుకోడానికి వీలులేకుండా పోయింది. గాలివాలునుబట్టి తెరలుతెరలుగా ఆ పాడుకంపు రావడం, కడుపులో చెయ్యిపెట్టి కలిచేసినట్లు అనిపించడం జరుగుతూ వచ్చింది. చివరకు దీన్ని భరించలేక కుమిలి, కుమిలి యేడ్చాను.

ధైర్యంతప్పి, చైతన్యవిహీనుడనై పోయి అక్కడే పడివున్నాను. హఠాత్తుగా — ఇది చలించిన నా మెదడు చేస్తున్న మోసం కాదుగదా? ఏదో సవ్వడి వినబడుతున్నట్లున్నది — ఎవ్వో! కాదు,—! ఔనౌను — మాటలూ, గుర్రపుడెక్కలచప్పుడూ వినబడుతూవుంది. పెద్దపెట్టుగా అరవబోయి, మళ్లీ అంతలోనే సంబాళించుకున్నాను. ఒకవేళ వాళ్ళు టర్కీవాళ్ళయితే? అయితేమాత్రమేం? ఏమా? ఇప్పుడుపడుతున్న బాధలకు తోడు, మరికొంత నరకయాతన పెడతారు. చర్మాన్ని వొలుస్తారు; గాయాలకు ఈ కాళ్ళను కొలిమిలో పెడతారు! దీన్ని తలంచుకుంటేనే శరీరం రోమాంచితమైంది. పోనీ, ఇంతటితో సరిపెడితే, కొంత సంతోషమే! చీల్చిచెండాడడంలో వాళ్ళకున్న ప్రజ్ఞావిశేషాలు సామాన్యాలా?

అయినా, ఇక్కడ దిక్కుమాలినచావు చావడంకంటె, వాళ్ళచేతుల్లో చచ్చిపోవడమే మంచిదేమో!

కాని, వాళ్ళు మావాళ్లయితే! అబ్బ! ఏమి పాడుపొదలు! ఇంత గుబురుగా పెరిగాయెందుకో? చూపుకు అడ్డం వస్తున్నాయి! మట్టలమధ్య ఒకచోటే కాస్త ఖాళీవుంది. దానిగుండా చూస్తే, దూరానవున్న లోయ కనబడింది. ఆ

లోయలో వొక వాగువున్నట్టు జ్ఞాపకం. యుద్ధానికిముందు మేమక్కడ నీళ్ళుతాగినట్టున్నాము. ఔనౌను! వాగుమీద వంతెనగా పెద్ద రాతిపలకనుకూడా వేశారుకదూ? ఆ వంతెన్ని వాళ్ళు యెలాగూ దాటవలసివస్తుంది. మాటలు ఆగిపోయాయి. వాళ్ళు మాటాడింది ఏభాషో నేను గుర్తించలేకపోయాను. అరి దేవుడా! చెవుడుకూడా ప్రవేశించింది!

వాళ్ళు మావాళ్ళయితేనా?— బిగ్గరిగా అరుస్తాను. వాగుదగ్గరేన్నవున్నా వాళ్ళకు నాకేక తప్పకుండా వినబడుతుంది.

బయటేరిగావడంలో వీళ్ళింత విలంబనం చేస్తున్నారేం చెప్మా? దారికాయడం మహావిసుగ్గానూ, చికాకుగానూవుంది. పీనుగు ఇంకా పాడుకంపు కొడుతూనేవున్నా, దాన్ని నేనిక గమనించడమేలేదు!

అంతలో .... రెప్పపాటులో ... వాగుమీది వంతెనపైన కాసక్కు కనబడ్డారు. నీలం యూనిఫారాలు, వాటిమీద యెర్రటి క్రసుబెల్టులు, చేతుల్లో బళ్ళాలు. దాదాపుగా సగం స్క్వాడన్ (దళం) వున్నట్టున్నారు. వాళ్ళయెదట, భారీ గుర్రంమీద, నల్లటిగడ్డంతోవున్న ఆఫీసర్. సైనికులు వంతెనదాటగానే ఆఫీసర్ వెనక్కుతిరిగి, ఇలా "కమేండ్" చేశాడు:

"ట్రూాట్! మార్చ్!"

"అయ్యో! ఆగండర్రా, ఆగండి! హెల్ప్, హెల్ప్!" అని కేకలు పెట్టాను.

కాని, గుర్రపుడెక్కల టకటక, కత్తుల ఝుణఝుణ, కాసక్కు వాగుడు,— వీటిలో నా హీనస్వరం విలుప్తమైపోయింది. నా కేకల్ని వాళ్ళు వినలేదు. ఇహ నాఖర్మం ఇంతేకాబోలు! చప్పగా అలిసిపోయి, ముఖాన్ని రెండుచేతులోనూ కప్పుకుని, ఆవురుమని యేడ్చాను.

ఈగొడవలో వాటర్ బాటిల్ను బోర్లదోసుకున్నాను. దాంతో నాకు అమృతోపమానంగా వుంటూవున్న నీళ్ళు,

మృత్యుముఖం నుంచి నన్నింకా కాపాడవలసిన నీళ్ళు, బొట్టుబొట్టుగా కారిపోసాగాయి. అయినా, ఏ చేరెడో మినహా తక్కినదంతా...యెండి దాహంతో వున్న ... నేలలో యింకిపొయ్యేవరకూ నే నీసంగతిని గుర్తించనేలేదు.

ఈ సంఘటన తర్వాత నాలో పుట్టిన నిస్త్రాణాన్నీ, నన్ను కమ్మిన మైకాన్నీ యెలా వర్ణించడం? సగం మూసినకళ్లతో కదలకుండా, మెదలకుండా అలానే పడుకున్నాను. గాలివాలు మాటిమాటికీ మారుతూవుంది. కాసేపు తెరిపిగావుంటే, కాసేపు పాడుకంపు. ఆనాడు టర్కీవాడిస్థితి మరీ ఘోరం అయ్యింది. ఒకసారి కళ్లువిప్పి అతడిఎంక చూచేసరికి యెక్కడలేని వికారం పుట్టింది. ముఖం మాయమైపోయింది; కండ తాపోయి, వట్టి శల్యాలు మాత్రం మిగిలాయి. నే నిదివరలో పుర్రెల్ని మా చినవాణ్ణే! డాక్టరీ చదువుతూ శవాల్ని కోసిన వాణ్ణే! అయి నా, మెరుస్తూన్న గుండీల యూనిఫారంలోవున్న ఈ కంకాళాన్ని చూస్తే మాత్రం, ఎంచేతనో విపరీతమైన భయమూ, జుగుప్సా పుట్టింది. "యుద్ధం అంటే ఇదే! ఇది యుద్ధచిహ్నం" అని అనుకున్నాను.

ఎండ యథాప్రకారం దుస్సహంగావుంది. నా చేతులూ, ముఖమూ ఇంతకు చాలాపూర్వమే చప్పగా మాడిపోయాయి. మిగిలిన కాసిననీళ్లనూ ఒక్క చుక్కైనా మిగల్చకుండా తాగి వేశాను. కాస్త గొంతుమాత్రం తడుపుకుందామని అనుకున్నా, దాహం అపరిమితంగా వుండడంవల్ల వున్నవన్నీ ఒక్క గుక్కకైనా చాల్లేదు. కాసక్కు దగ్గర్లోవున్నప్పుడు మరికొంచెం బిగ్గరిగా కేక వెయ్యవలిసింది! ఒకవేళ వాళ్లు టర్కీవాళ్లైనా ఇంతకంటె బాగుండేదేమో! ఒకటి, రెండు గంటలసేపు నానా బాధలు పెట్టేవారు. కాని, అంతులేని ఈ నరకయాతనకంటె అదే వెయ్యరెట్లు మెరుగ్గాదూ?

అమ్మా! వృద్ధాప్యంలో నీకు లేనిపోని కడుపుకోత తెచ్చి పెట్టాను. పాపం! విచారభరంకొద్దీ జుట్టు పీక్కుంటావు కాబోలు! తలని గోడకువేసి కొట్టుకుంటావు కాబోలు! ఏ దుర్ముహూర్తాన నేను నీ కడుపునపడ్డానో అని విలపిస్తావుకాబోలు! మానవసంఘాన్ని వ్యధపెట్టడానికి ఈ యుద్ధసంస్థను సృష్టించినవాళ్లను శాపనార్థాలు పెడతావుకూడా!

కాని, నీకూ, మాషాకూ నేను పడ్డ బాధలన్నీ యెన్నటికీ తెలియవు. అమ్మా! సెలవు! ప్రేయసీ! సెలవు!! అబ్బ! ఈ లోకాన్నీ, అయినవాళ్లనూ విడిచిపెట్టిపోవడం ఏమి బాధగా, ఎంత కష్టంగా వుంది! గుండె దిగజారిపోయినట్లు అనిపిస్తున్నది...

తిరిగి ఆ చిన్ని తెల్లటి కుక్క సంగతి జ్ఞాపకంవచ్చింది! పోలీసువాడు...ఇంకా అది కొనవూపిరితో వుండగానే...నిర్దాక్షిణ్యంగా యెత్తుకువెళ్లి, మురుగుకాల్వలోకి విసిరికొట్టాడు. అయినా, ఆ కుక్క బాధపడింది కాసేపే! ఇక దౌర్భాగ్యుణ్ణి నేనో? ఇప్పటికే మూడు రోజులైంది! రేపటికి నాలుగో రోజు, ఎల్లుండికి అయిదు, ఆపైనాటికి ఆరు——మరణమా! ఎక్కడున్నావ్? నన్ను కాస్త దయచూడరాదూ?

కాని, మరణం రానూ లేదు; నన్ను దయచూడనూ లేదు. ఎండలో అలానే పడివున్నాను. గొంతు ఎండిపోతూ వున్నా, తడిచేసుకోడానికి గుక్కెడు నీళ్లైనా లేవు. ఇహ, పీనుగేమో మహాఘోరంగావుంది. అది చప్పగా కుళ్లిపోయింది. కోటానుకోట్ల పురుగులు పుట్టాయి. అబ్బ! ఏమిదృశ్యం! అది చాలా భాగం హరించిపోయింది. మిగిలింది కాస్తాకూడా పూర్తిఅయిపోయి, అస్థికలూ, యూనిఫారమూ తప్ప మరియేమీ మిగలనప్పుడు——నావంతు వస్తుంది! నేనుకూడా అలానే అవుతాను!

ఆ పగలూ, ఆ రాత్రీ గడిచిపోతుంది. అంతా యథాప్రకారంగానేవుంది. భానూదయం అయింది. అయినా, మామూలుకు భిన్నం యేమీకలగలేదు. రోజు గడుస్తున్నది...

పొదలు కదిలాయి, "నీవు చస్తావు, నీవు చస్తావు, నీవు చస్తావు" అన్నట్లుగా అవి గొణిగాయి !

"ఆఁ! ఇక్కడెవ్వరూ వుండర్లే!" అని నాదగ్గిరిగా ఎవ్వరో గట్టిగా మాటాడినట్లు వినిపించింది.

చప్పున తెలివివచ్చింది.

టాకొవ్లెవ్ (నా లేన్సు కార్పొరల్) సాదరంగా దయార్ద్రమైన తన నీలినేత్రాలతో నావంక చూశాడు.

"స్ట్రెచర్ తెండర్రా! ఇక్కడింకా మరి యిద్దరున్నారు; ఒకడు మావాడు; ఇంకోడు వాళ్లవాడు" అని అతడు కేక వేశాడు.

"స్ట్రెచర్ తేవద్దు; నన్ను పాతిపెట్టవద్దు; నేను బతికేవున్నాను" అని గోలపెట్టాలనుకున్నానుగాని, నానోటి వెంట చిన్నమూలుగుతప్ప మరేమీ పెగల్లేదు.

"ఏమిటి? ఇంకా జీవించివున్నాడా! మన ఇవనోవ్! రండర్రా, రండి! మన వాలంటీర్ జెంటిల్మన్ బతికేవున్నాడు. డాక్టర్ని పిలుచుకు రండి!"

ఒకక్షణం గడిచిందో లేదో నీళ్లు, వోడ్కా, ఇంకా ఏమిటో నాకంఠంలో పోశారు. తర్వాత అంతా అయోమయం!

స్ట్రెచ్చర్ వుయ్యాలలా వూగుతూవుంటుంది. ఆవూపులో హాయిని యిస్తుంది. ఒక క్షణంపాటు తెలివివస్తుంది; తిరిగి అంతలోనే స్పృహతప్పుతుంది. కట్లుకట్టడంవల్ల గాయాలు బాధపెట్టడంలేదు. ఏదో అనిర్వచనీయమైన ఆనందంతో నాతనువంతా నిండుతుంది.!

"ఆగండి! దించండి!" అని ఆర్డర్!

దించగానే, ఫోర్త్‌స్క్వాడ్ వేరుస్తూ పిలిచి, "స్ట్రెచర్ యెత్తుకోండి, పదండి!" అని తిరిగి ఓ అరుపు. మా రెడ్ క్రాస్ ఆఫీసర్ పీటర్ ఐవానోవిచ్ ఈ ఆర్డర్లు ఇస్తున్నాడు. అతడు సన్నగా, పొడుగ్గావుంటాడు. ఎంత పొడుగ్గా అంటే, మామూలు ఆసాములు స్ట్రెచ్చర్ను భుజాలమీద పెట్టుకుని మోసుకుపోతూవుంటే, అంత యెత్తునుంచి చూచినా, అతడి భుజాలూ, శిరస్సూ నాకు కనబడుతూనేవున్నాయి.

"పీటర్ ఐవానోవిచ్!" అని నేను హీనస్వరంతో పిలిచాను.

"ఏమిటి నాయనా?" అంటూ పీటర్ ఐవానోవిచ్ నా మీదికి వంగాడు.

"అయితే, డాక్టర్ నీతో ఏంచెప్పాడు? నేను త్వర్లోనే చచ్చిపోతానా?"

"నాన్‌సెన్సు; ఐవనోవ్! పిచ్చి భయంపడకు. నీ యెముకలన్నీ చక్కగా వున్నాయి. ఏ యెముకా విరగలేదు; ఏ రక్తనాళమూ తెగలేదు. కాని, ఈ మూడున్నర రోజులూ యెలా ప్రాణం నిలుపుకున్నావ్? ఏమి తిన్నావ్?"

"ఏమీలేదు."

"ఏమి తాగావ్?"

"టర్కీవాడి వాటర్‌బాటిల్ దగ్గరికు పాకివెళ్లి... అబ్బ! ఆయాసంగా వుంది, ఐవానోవిచ్! ఇప్పుడు మాటాడలేను. తర్వాత..."

"సరేలే! ఆభగవంతుడే నిన్ను కాపాడతాడు. కాస్త నిద్రపో, నాయనా!"

తిరిగి నిద్ర, తిరిగి మైకం.

డివిజనల్ ఆస్పత్రిలో మెలుకువవచ్చింది. నాచుట్టూ డాక్టర్లూ, నర్సులూ గుమికూడివున్నారు. వారిమధ్య సుప్రసిద్ధ

డ్రైనవో పీటర్స్బర్గ్ సర్జన్ను గుర్తుపట్టాను. అతడు నామీదికివంగి యేమో చేస్తున్నాడు. అతడి చేతుల్ని రక్తం అంటి వుంది. కాసేపు నా కాళ్లను సవరించి, తర్వాత నాతో యిలా అన్నాడు :

"చాలా అదృష్టవంతుడవోయ్! తప్పకుండా బతుకుతావ్. అయితే ఒక పాదాన్ని మాత్రం తీసివెయ్యవలసివస్తుంది. అయితే, నీ విప్పుడు మాటాడగలవా ?"

" తప్పకుండా " అని, ఇప్పుడిక్కడ రాసినదాన్నంతా వాళ్లకు చెప్పాను.

అలెగ్జాండర్ కుప్రిన్
(జననం: 1870)

# ఈస్టర్ విందు

ఇది జరిగింది...ఎప్పుడు చెప్మా?...ఆఁ! అప్పుడే దాదాపు ముప్ఫై సంవత్సరాలై వుండాలి. అప్పటికీ ఇప్పటికీ మధ్య... అబ్బో!...సంఘటనలు, పరిచయాలు, పట్టణాలు, విజయాలు, పరాజయాలు, సంతోషాలు, విషాదాలు...ఎన్నో!! ఆ రోజుల్లో నేను కైవ్‌లో వుంటూవుండేవాణ్ణి. పడోవావీధి మొగలోనే నాగది. మాయింటి ఖామందు ఏదోవోడలో వంటవాడుగా వుంటూవుండేవాడట. తప్పదాగి గలభా చేస్తున్నాడని అతన్ని ఆ పనిలోనుంచి తొలిగించారట. అతడి భార్యపేరు, అనా పెట్రోవ్నా. మోసానికీ, దురాశకూ, ఓర్వలేనితనానికీ ఆ అమ్మ పెట్టింది పేరు.

ఆ యింట్లో తియ్యకుండా మేము ఆరుగురం వుంటూవుండేవాళ్లం. మేము ఆరుగురమూ బ్రహ్మచారులమే. మొదటి నెంబరు గదిలోవుంటూవుండే ఆసామి మాఅందరిలోనూ పెద్దవాడు.

ఒకప్పుడతడు వ్యాపారస్థుడు. లేసులు వగైరాల షాపు వుండేది. జూదం వ్యసనం కావడంవల్ల వ్యాపారం సున్నా చుట్టింది. ఆతర్వాత అతడెక్కడో కొన్నాళ్లపాటు గుమస్తాగా పనిచేశాడు. అయితే, చీట్లాటమీది మోజువల్ల ఆ వుద్యోగం కాస్తా వూడింది. ఇక ఇప్పుడతడికి బ్రతుకుతెరువేమిటో అతడ్ని పుట్టించిన ఆ దేవుడికే తెలియాలి. పగలంతా నిద్రపోతూ వుండేవాడు. కనుచీకటి పడుతూవుండగా చల్లగా ఏదైనా జూదం కొంపకు చేరుకునేవాడు. అక్కడ ఇలాంటి కొంపలకు కొరతేమీ లేదు. నీపర్ నదిగట్ల మీద, ఆ పెద్ద ఓడరేవు సమీపంలో [illegible] వే! [illegible]లాభంకోసం కాకుండా సరదాకోసం ఆడే అందరి జూదగాళ్లలా అతడుకూడా పెద్ద అంతస్తుగలవాడు. కలుపుగోలు మనిషి. ఎవరినైనాసరే ఇట్టే ఆకర్షించివేసేవాడు.

మూడో నెంబరు గదిలో బట్ కావస్కీ అనే ఇంజనీయర్ వుండేవాడు. తాను ఫారెస్ట్రీ, మైనింగ్, సివిల్ ఇంజనీరింగ్ చదువుకున్నాననీ, ఈ చదువుకోసం విదేశాలకుకూడా వెళ్లాననీ చెబుతూ వుండేవాడు. ఇవి నిజమో, పట్టికోతలో తెలియదు. అయితే, "జనరల్ నాలెడ్జి"లో అతడు చాలా గట్టివాడనే చెప్పాలి. ఈ విషయంలో అతగాడ్ని పెద్ద ప్రయాణంకోసం ఆదరాబాదరా సర్దుకున్న ట్రంకుతో పోల్చవచ్చు. ఏముంది,— అల్లాంటప్పుడు చేతికందిన ప్రతిదాన్నీ ట్రంకులో కుక్కుతాము; తీర్గా మూత వెయ్యబోతే, అది ఒక పట్టాన పడదు; చివరకు పెట్టెను తియ్యగానే లోపలివస్తువులు బొలుక్కుమంటూ బయటికి గెంతుతాయి. అదగా పెట్టెనక్కరలేకుండానే అతగాడు వైమానిక విద్య, వృక్షశాస్త్రం, రాజకీయాలు, ఖగోళశాస్త్రం, దుర్గనిర్మాణం, పశువుల్ని పెంచడం, కూరగాయల్ని పండించడం, వాస్తుశాస్త్రం మొదలైన రకరకాల విషయాల్ని గురించి గుక్కతిప్పుకోకుండా లెక్చర్లు కొట్టేవాడు. మాసానికొకసారి తప్పతాగుతూ

వుండేవాడు. అప్పుడు మూడురోజుల పాటు ఈ గాం స్మృతిలోనే వుండేవాడు కాదు. ఆ మూడు రోజులూ క్షోంభిలోనే తప్ప మాటాడేవాడు కాదు! తన పూర్వ మిత్రులందరికీ డబ్బుకోసం క్షేంచిలోనే వుత్తరాలు రాస్తూ వుండేవాడుకూడా. ఆతర్వాత మరో అయిదురోజుల పాటు చమటలు కక్కుకుంటూ కదలకుండా మెదలకుండా పడుకునేవాడు. అన్ని పత్రికలకూ అద్భుతమైన విషయాల్ని గురించి వుత్తరాలు రాయడమే ఆతడిపని. బంజర భూముల్ని బాగుచెయ్యడాన్ని గురించి, ఎవరైనా కొత్త నక్షత్రాన్ని కనిపెడితే దాన్ని గురించి, ఆల్బాన్ నూతుల్ని తవ్వడాన్ని గురించీ,—ఒక్కటేమిటీ అన్నింటినిగురించీ రాస్తూ వుండేవాడు. దగ్గర ఏమైనా డబ్బుంటే దాన్ని తన పుస్తకాల్లో అక్కడక్కడ దాచేవాడు. అవసరమైనప్పుడు వెతుక్కుని, ఊరికే దొరికినట్టు సంతోషించేవాడు. తరచు ఆతడు నత్తినత్తిగొడుతూ అంటూ వుండే ఈమాటలు నాకింకా బాగా జ్ఞాపకం:

"అయితే, తమ్ముడూ! రెండో అరలో నాలుగో పుస్తకం... ఆఁ! ఇదే! ఆ ఎలిజా హాల్కా! అందులో రెండు, మూడు వందల పేజీలమధ్య అయిదురుబుల్స్‌నోటు వుండాలిచూడు. దాన్ని నీ బాకీకింద జమచేసుకో!"

అతడిది బట్టతల. తెల్లటిగడ్డమూ, బుగ్గమీసాలూ వుండేవి

నా మకాం ఏనిమిదో నంబర్ గదిలో. ఏడో నంబర్ గదిలో కాలేజీకుర్రవాడొక డుండేవాడు. అతడిది గుండ్రటిమొహం. కొంచెం నత్తికూడా వుండేది. అతడిప్పుడు పేరుమోగిన పబ్లిక్ ప్రాసిక్యూటర్. ఆరో నంబర్ గదిలో కారల్ అనే జర్మన్ దేశస్థుడు వుండేవాడు. గోల్లు వెయ్యడంవిషయంలో అతడు స్పెషలిస్టు. బీర్ తాగడంలోకూడా అతగాడు స్పెషలిస్టనే చెప్పాలి.

అయిదోనంబర్ గదిలో జోయాఅనే అమ్మవుండేది. మాయింటి ఖామందురాలి దృష్టిలో మేమందరమూ వోయెత్తు; ఈఅమ్మ వొక్కతే వోయెత్తు. ఈగౌరవానికి చాలా కారణాలున్నాయి. మేమిచ్చే అద్దెకంటే ఈఅమ్మ ఏమాత్రమో యెక్కువయివ్వడమే కాకుండా, దాన్ని ప్రతినెలా ఖరాఖండిగా చెల్లించేది. కావాలంటే, నెలనిండకముందే పారవేశేదికూడా! పైగా, ఏ రవ్వా రట్టూ లేకుండా తనబ్రతుకు తాను బ్రతికేది. ఎవర్నీ గదిలో చేర్చేదికాదు. అంతగా చేర్చినా, వయస్సుమళ్లినవాళ్లనూ, మర్యాదస్థుల్నిమాత్రమే! సామాన్యంగా రాత్రిళ్లన్నీ మారుమూల హోట

మాకు పరస్పరం పరిచయంవుండేదాఅంటే, వుందనీ, లేదనీ కూడా చెప్పాలి. మే వొకరిదగ్గరినుంచి వొకరం టీ, బొగ్గులు, పత్తి, వేన్నీళ్లు, న్యూస్ పేపర్లు, సిరా, కాగితాలువగైరా బదులు పుచ్చుకుంటూ వుండేవాళ్లం.

ఆయింట్లో మొత్తం తొమ్మిది గదులుండేవి. తక్కిన మూడు గదుల్నీ ఏనాఁరం పది రోజులకోసమో "ఇస్తూకులకు" అద్దెకిస్తూ వుండే వాళ్లు. ఇది కూడదని మే మభ్యంతరం చెప్పేవాళ్లంకాదు. సమస్తానికీ మే మలవాటు పడిపోయాం.

ఆసంవత్సరం వసంతం త్వరగా ప్రవేశించింది. నీపర్ నదిమీద మంచు కరిగిపోయింది. నది బాగా పొంగింది; కొంచెం పల్లంగావున్న యెడమగట్టు తెలవరకూ నీరుతన్నింది. రాత్రిళ్లు చలి తగ్గింది. ఉండివుండి దబాటు జల్లు పడుతూవుంది. ఓనాటి వుదయం చెట్లను లేచిగురైనా లేదు; ఆ మర్నాటి వుదయానికి కొమ్మకొమ్మకూ కొత్తచిగుళ్లూ, రెమ్మలూ!

మామూలు అందంతో, ఆనందంతో ఈస్టర్ పండగకూడా వచ్చింది. పండగనిదా సంతోషంగా పరామర్శించి వద్దామనుకున్నా, ఆవూళ్లో నాకు నా అన్న వాళ్లెవరూ లేరు. అంచేత ఉబుసు పోకకోసం ఒంటిరిగానే వీధుల వెంట పచారుచేశాను. చర్చిలోకి వెళ్లాను. ఊరేగింపుల్నీ, దీపాల్నీ చూస్తూ నిలుచున్నాను; పాట ల్నీ, పద్యాల్నీ విన్నాను; దీపాల వెలుగులో మహా సొగసుగా కనబడుతున్న ఆడవాళ్లనూ, పిల్లల్నీ చూచి ఆనందించాను. మధు రాతిమధురమైన విషాదచ్ఛాయ లేవో నా హృదయాన్ని కమ్మాయి. బాల్యంలోవుండే ఆ నిర్మలతా, ఆ ముగ్ధత్వమూ పోయిందిగదా అనే నాకు పరితాపం కలిగిందా? ఏమో? కావచ్చును.

ఇంటికి తిరిగిరాగానే వాకిట్లో మా పోర్టర్ కుర్రవాడు యెదురుపడ్డాడు. వాడి పేరు, వాస్కా. వాడిది చోట్టముక్కు. వట్టి ఓంగ వెధవ. మేము పరస్పరం ఈస్టర్ గ్రీటింగ్సు (అభివంద నాలు) తెలుపుకున్నాం. మొహమంతా నోరుచేసుకుని, పళ్లూ, చిగుళ్లూ కనబడేటట్టు నవ్వుతూ వాడు నాతో ఇలా అన్నాడు:

"ఇయిదోనంబర్ గది అమ్మి మిమ్మల్ని వోసారి వచ్చి పొమ్మంది, అయ్యగారూ!"

ఆ అమ్మాయితో నాకు రవ్వంతకూడా పూర్వపరిచయం లేనందువల్ల, ఈమాటవిని నేను విస్తుపోయాను.

"ఆ అమ్మాయి మీకు వుత్తరం పంపించింది, బాబుగారూ! అదిగో! అదే, మీ టేబుల్ మీద!" అంటూ వాస్కా మళ్లీ అం దుకున్నాడు.

ఏదో నోట్ బుక్కులోనుంచిచించిన రూళ్లకాగితం కన బడింది. దానిమీద "నగదువోచరు" అనే అచ్చు అక్షరాలకింద ఈమాటలు రాసివున్నాయి:

"డియర్ నంబర్ 8, మీకు తీరుబడివుంటేనూ, అభ్యంతరం ఏమీ లేకపోతేనూ, సాగదికివచ్చి ఈస్టర్ విందులో పాల్గొనండి.
మీ పరిచితురాలు,

జోయా క్రాఫురెన్ కోల్."

సలహా అడుగుదామని ఇంజనీయర్ గదికి వెళ్ళాను. అతడు అద్దంముందు నిలబడి, ఎన్నడూ సంస్కారం యెరగని తన బిరుసు రాగిజుట్టును... వేళ్ళతో చిక్కుతీసి... సరిచెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు. అతడు నిగనిగలాడుతూ వున్న ఫ్రాక్ కోటు వేసుకున్నాడు. అది అతడికి కొంత దర్జానిచ్చింది. బాగా బిరుసుగావున్న పాతకాలర్ మీద తెల్లటి స్కార్ఫ్ టై కట్టుకున్నాడు. అతడికికూడా ఆహ్వానం వచ్చింది. అంచేత, మేమిద్దరం కలిసే విందుకు వెళ్ళాం.

సిగ్గుపడుతూ, భిడియపడుతూ జోయా మాకు వాకిట్లోకి యెదురు వచ్చింది. ఆవిడ మొహం సామాన్యమైన తక్కిన అందరు రష్యన్ వేశ్యల మొహాలమాదిరిగానే వుంది. తీరూ తీరూ లేని మొత్తటి పెదవులు, కొంచెం వెడల్పు ముక్కు, వుండీవుండనట్టుగా వున్న కనుబొమ్మలు, ఏమాత్రమో పైకివుబికిన వూదా కళ్లూ. కాని, ఆవిడ చిరునవ్వు... ఇప్పటి చిరునవ్వు... ఎంతో సంతోషప్రదంగా, సహజంగా, వినమ్రంగా, కోమలంగా, స్త్రీత్వం వొలికేటట్టుగా, వుండి, జోయా వదనానికి తాత్కాలికంగా అపూర్వమైన సౌందర్య గరిమను తెచ్చిపెట్టింది.

కార్గిల్, జూదగొండ్లీ అప్పటికే అక్కడికి చేరుకున్నారు. ఒక్క క్రాలేజ్జీ స్టూడెంటునివా అయింట్లో తియ్యకుండా వుంటూ వున్న వాళ్లందరూ అక్కడ సమావేశమయ్యారు.

ఆవిడగది సరిగా నేను వూహించేసినట్టేవుంది. డ్రాయర్ మీద ఖాళీ చాక్‌లెట్ పెట్టెలూ, ఆవకతవక పటాలూ, ఫేస్ పౌడరూ, దువ్వెనలూ పడివున్నాయి. గోడలనిండా ఉంగరాల జుట్టు మంగళ్లు, తలతిరిగిన యాక్టర్లు, విచ్చుకత్తుల్తో కరవొచ్చినట్టు చూస్తున్న సోల్జర్లు మొదలైనవాళ్ల పటాలు బారులు తీర్చివున్నాయి. పరుపుమీద కొండగుట్టలా దిళ్లు; వాటికి లేస్ గలేబులు. పోతే, గదిమధ్యలోని టేబుల్ మాత్రం దివ్యంగావుందనే చెప్పాలి. దానిమీద లేస్ మాదిరిగా పువ్వులూ, తీగలూ కత్తిరించివున్న కాగితం పరిచివుంది. ఆ కాగితంమీద ఈస్టర్ కేకూ, కొలూస్లూ, కోడిగుడ్లూ, ఓతొడ మాంసమూ. రెండు వైన్ సీసాలూ అమర్చివున్నాయి.

ఆవిడకు ముందుగా మేము మా ఈస్టర్ గ్రీటింగ్సును అందజేసి, ఆతర్వాత లాంఛనంప్రకారం ఆవిడ్ని రెండుచెంపలమీద ముద్దుపెట్టుకుని, ఆటుపైన విందుకు కూర్చున్నాం. ఆ క్షణంలో మేమందరమూ చేరి మహావింతగా కనబడి వుంటాం: ఆకలితో అలమటించి, దురదృష్టాలతో కుంగిపోయి, జీవితంలో అంత్యదశను చేరుకున్న నలుగురుమగవాళ్లం మేమూ; మానరసను యవ్వనంపోయిన వో రష్యన్ వేశ్య! అంటే, ప్రపంచంలో అంతటికీ వ్యాప్తిగా తెలివిమాలిందీ, పట్టి అమాయకురాలూ, ఏమీ నడవడి నెరగందీ, అపారమైన దయగలదీఅయిన స్త్రీ అన్నమాట! మరి, మే మైదుగురంచేరి, వింతగా కనబడ్డంలో ఆశ్చర్యమేముందీ?

కాని, ఆవిడ ఎంతచక్కగా మర్యాదచేసింది! ఏమి వినమ్రంగా ఆతిథ్యం ఇచ్చింది! ఎంత ఆప్యాయంగా అందరి క్షేమాన్నీ విచారించింది!!

"ఇదుగో! దీన్ని తీసుకోండి!" అని మాలో వొకడికి ఫలహారం ప్లేటు అందిస్తూ అంది. "ఇది చాలా రుచిగావుంది. కాస్త, తిని

చూడండి. ఆరో నంబర్ వారికి బీర్ చాలా యిష్టమట; వాస్కాను కనుక్కుంటే చెప్పాడు. మీదగ్గర్నే టేబుల్ కింద వో బీర్ సీసా వుంది; తీసుకోండి. తక్కినవారికోసం వైన్ వుంది. ఇది చాలా చక్కని వైన్, — కెలిఫోర్నియాలో తయారైంది. నే నెరుగున్న వో నావికుడు దీన్నే పసందుచేస్తాడు.”

మేము నలుగురమూ జీవితాన్ని కాసివడపోసినవాళ్లం; ఈ ఈస్టర్ విందుఖర్చు యెక్కడిదో మాకు తెలియందికాదు. వైన్ యెలావచ్చిందోకూడా మాకు తెలుసు. ఇలా అన్ని సంగతి సందర్భాలూ తెలిసివున్నా, మాకేమీ సంకోచం అనిపించలేదు; తలవంపులుగా అసలే తోచలేదు.

ఆరాత్రి తాను చూచివచ్చిన దృశ్యాల్ని జోయా మాకు వర్ణించింది. బ్రాడ్‌స్వాలోని చర్చికి తాను వెళ్లిందట. దానిలో జనం కిక్కిరిసివున్నారట. అదృష్టవశాత్తూ తనకు చక్కని సీటే దొరికిందట. ఎకాడమీ క్వాయిర్ (భజనసమాజం) వారు చక్కగా పాడారట. విద్యాగురే స్వయంగా “ఎవాన్‌జెల్”ను అన్ని భాషలలోనూ చదివారట. ఫ్రెంచి, జర్మన్, గ్రీక్, అరబిక్... ఇదీ అదీ అనేమిటి?...అన్ని భాషల్లోనూ. ఈస్టర్ కేక్‌ను నివేదన చేస్తూవుండగా, పెద్ద తోక్కిసలాట అయిపోయిందట. ఆ గలభాలో ఒకరి కేక్ వొకరికి మారిపోయిందటకూడా.

ఆ తర్వాత జోయాధోరణిలో కొంచెం దైన్యం ప్రవేశించింది. ఆవిడ గట్టిగా నిట్టూర్చి, తమవూళ్లో తాము ఈస్టర్‌పండగను యెలా చేసుకునేవారో చెప్పసాగింది—

“మావూళ్లో చిన్న నీలిపూవులేవో వుండేవి. వాటిని మేము ‘నిద్ర’ పువ్వులని అంటూవుండేవాళ్లం. తొలకరించడం ఆలస్యం;

ముందుగా అవే వచ్చేవి. ఈస్టర్ పండక్కి వాటిని కోసుకొచ్చి, మా కోడిగుడ్లకు వాటి నీలిరంగును పట్టించేవాళ్లం.

"పచ్చరంగు కావాలంటే, కోడిగుడ్లను ఉల్లిపాయపొరలో చుట్టి, ఉడకబెట్టేవాళ్లం. ఆ తర్వాత ఇకరకాలరంగుల్ని కూడా అద్దేవాళ్లం. దాదాపు వారంరోజులు ఊరంతా తిరిగి, కోడిగుడ్లతో పందాలు వేసేవాళ్లం. గుడ్డును గుడ్డుకు వేసికొట్టడం; ఎవరి గుడ్డు ముందు పగులుతుందో వారు వోడిపోయినట్టు లెఖ్ఖ. ఓకుర్రవెధవ ఎక్కణ్ణుంచో గాని ఇనుముతో చేసిన గుడ్డును పట్టుకు వచ్చాడు. ఇహానేముందీ, వాడితో పందెంవేసి అందరూ వోడి పోయినవాళ్లే! కాని, చివరికి వాడిమోసం కనిపెట్టారు; వాడు గెలుచుకున్న గుడ్లన్నింటినీ లాక్కోవడమే కాకుండా, వాణ్ణి మెత్తగా నలగబొడిచారుకూడా.

"ఇంతేకాకుండా ఆ వారంరోజులూ మేము వుయ్యాలలూగే వాళ్లం. ఊరు ఉమ్మడి ఉయ్యాలలు నడివీధిలో కొన్ని వుండేవి. ఇవికాకుండా, ఇంటింటికీ వేరే వుయ్యాలకూడా వుండేది. వారం వారమంతా ఆడపిల్లలూ, మగపిల్లలూ కలిసి వుయ్యాలలూగుతూనే వుండేవారు. వూగుతూ, చక్కనిపాటల్ని పాడుతూ వుండేవారు. పల్లెటూళ్లో ఎంచక్కగా వుంటుంది!"

నిశ్శబ్దంగా మేము ఆవిడమాటల్ని వింటూ కూర్చున్నాం. చిరకాలంగా విధి మమ్మల్ని క్రూరంగా చూస్తూవుండడంవల్ల మేము చిన్నతనంనాటి ఆటపాటల్నీ, సాంసారిక జీవితాన్నీ, కన్నతల్లినీ, పూర్వపు ఈస్టర్ పండగల్నీ చప్పగా మరిచిపోయాం.

ఈలోపుగా కిటికీలకు కట్టివున్న క్యాలికోక్లాత్ను తొలిరేకలు సోకడంవల్ల నీలంగా మారాయి; ఆతర్వాత అవి కొంచెం పసుపు రంగు తేలాయి; అటుపైన హఠాత్తుగా అరుణారుణమైనాయి.

"మీకు అభ్యంతరం లేకపోతే, కిటికీని తెరుస్తాను." అని జోయా అంది.

కర్టెన్ ను చుట్టివేసి, ఆవిడ తలుపును బార్లాతీసింది. మేమూ లేచి, కిటికీదగ్గిరికి వెళ్లాం.

అది మహానిర్మలమూ, ప్రశాంతమూ, ప్రకాశవంతమూ అయిన ప్రభాతం. ఎవరో పరిశుభ్రంగాకడిగి, ఆయావస్తువుల్ని వాటివాటి స్థానంలో పెట్టినట్టుగావుంది. ఆనీలాకాశం, ఆ తెల్ల మబ్బు, ఆపొడుగుపాటి పోప్లర్ చెట్లు, రెపరెప కొట్టుకుంటూ వున్న ఆపచ్చటి చిగురుటాకులూ! నీపర్ నది అనంతంగా కన బడుతూవున్న భూగర్భంపైన ప్రవహించుకుపోతూవుంది. గట్ల దగ్గర సుళ్లుపడుతూవున్న నది, నీలిరంగూ నూ! దూరాన ధావళ్యమూ, మందగమనమూ! అన్ని చర్చిలగంటలూ గణగణ మోగుతున్నాయి.

ఇంతలో హఠాత్తుగా మేమందరం వెనక్కి తిరిగిచూచాం. ఇంజనీయర్ వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. కిటికీతలుపు పట్టుకుని, గిలగా దానికి ఆన్చినిలుచున్న ఆతడు ఆపాదమస్తకం దుఃఖోద్వేగంలో కంపించిపోతున్నాడు!

పాపం! ఆదీనుడి హృదయంలో ఏమి కలవరంపుట్టిందో ఆపరమాత్ముడికే తెలియాలి.

చెదురుగా విన్న మాటలుతప్పితే అతడి పూర్వ జీవితాన్ని గురించి నాకు వివరంగా తెలియదు.

మనసుకుదరని సంబంధం, గుణంలేని యిల్లాలు, గవర్న మెంటుడబ్బును కాజెయ్యడం, పెళ్ళాం గండుముగుణ్ణి రివా ల్వర్ తో కాల్చడం, తమ తల్లితోపాటుండిపోయిన బిడ్డలమీద బెంగ, — ఇవీ నేను చూచాయగా విన్న మాటలు.

జోయా జాలిగా నిట్టూర్చి, ఇంజనీయర్‌ను తన చేతుల్లోకి తీసుకుని, అతడి బట్టతలను తన రొమ్ముమీద పెట్టుకుని, నెమ్మదిగా అతడి భుజాలనూ, చెక్కిళ్లనూ నిమరసాగింది.

"అయ్యో! నాతండ్రీ!" అంది ఆవిడ బుజ్జగింపుగా. "మీ కందరికీ జీవిత మెంత భారంగా వుందో నాకుమాత్రం తెలియదూ? పాపం! అందరూ దారంతెగిన గాలిపటాలలా అయిపోయారు... పెద్దతనం. పైగా, ఆలనా పాలనా లేకపోవడం... కాని, పరవా లేదు... ఓపికపట్టాలిగాని, మనకష్టాల్ని ఆలకించడానికి ఆ పరమేశ్వరుడు లేడూ!... ఊరుకో, నాతండ్రీ!"

అతికష్టంమీద ఇంజనీయర్ తిరిగి తెప్పిరిల్లాడు. అతడి కళ్లు యెర్రబడ్డాయి; ముక్కు బాగా కందింది.

"డామ్ఇట్! డామ్ఇట్!" అని కోపంగా అన్నాడతడు గోడవైపుకు తిరుగుతూ.

కంఠధ్వనినిబట్టి... పాపం!... అతడు కన్నీళ్లను ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నాడని తేలిపోయింది.

అయిదు నిమిషాలతర్వాత జోయా చేతిని గౌరవపూర్వకంగా ముద్దుపెట్టుకుని మేము సెలవుపుచ్చుకున్నాం. అందరికంటే వెనక కదిలింది నేనూ, ఇంజనీయరూ.

మేమిద్దరం గసెపలోకివచ్చేసరికి కాకతాళీయంగా మాకు అప్పుడే ఏదోపార్టీనుంచి తిరిగి వస్తున్న కాలేజీ స్టూడెంటు ఎదురుపడ్డాడు.

"ఓహో!" అన్నాడతడు కనుబొమల్ని అర్థయుక్తంగా యెగరవేస్తూ. "ఇక్కడ చేరారన్నమాట!... సరి, సరి!... జలసా జరిపినట్టున్నారే!"

అతడిమాటలో మామూలు బండతనం కనబడింది.

ఇంజనీయర్ అతణ్ణి నఖశిఖపర్యంతం పరికించి ఒక్క క్షణం ఆగి, చెప్పనలవిగానంత అసహ్యంతో ఇలా అన్నాడు:

"లుచ్ఛా!"

మేక్సిం గార్కీ

(1868-1936)

# ప్రేమలేఖలు

ఓనాడు నా స్నేహితు డొకడు ఈకథ చెప్పాడు:

నేను మాస్కోలో చదువుకునేరోజుల్లో మాయింటి పొరుగున వోవింతఅమ్మి వుండేది. ఆవిడ పోలెండు దేశస్థురాలు. పేరు, తెరిజా. మంచి వొడ్డూపొడుగైన మనిషి. చామనచాయ. గుబురైన కనుబొమ్మలు ; బండమొహం ; కాంతిలేనికళ్లు ; కీచు గొంతు. ఇహ, ఆవిడ నడవడిమాట చెప్పనక్కర్నే లేదు. పహిల్వాన్ను మరిపించేది. కండలుతేలిన వొంటితో పిప్పళ్లబస్తాలా వుండేదేమో, చూస్తేనే జడుపుపుట్టేది.

ఒకేమేడమీద మేము యెదురుబొదురు గదుల్లో వుండేవాళ్లం. ఆవిడ ఇంట్లోవున్నంతసేపు నేను నాగదితలుపు తీసేవాణ్ణి కాదు. ఖర్మంచాలక నే నెప్పుడైనా మేడమెట్లమీదో, దొడ్లోనో యెదురుపడితే, వెకిలిగా చిరునవ్వు నవ్వేది. తరచుగా ఆవిడ నిప్పులలాంటి కళ్లతోనూ, చింపితలలతోనూ ఇంటికి తిరిగివస్తూవుండేది. అప్పుడు నే నెదురుపడితే, ధిక్కారంగా నావంక చూస్తూ "ఏమయ్యా! బాగున్నావ్!" అని పలకరించేది.

పలకరించి, ఫక్కున నవ్వేదికూడా! ఆ వెధవనవ్వుకు వొళ్లు గరపొడిచేది. ఈ బాధపడలేక గది మార్చివేద్దామని చాలాసార్లు అనుకున్నాను. కాని, అది చాలా చక్కనివాడ; మేడమీద నిలబడితే బస్తీఅంతా కనబడేది; వీధిలో రవ్వారట్టూ వుండేదికాదు. అంచేత అక్కడే వుంటూవచ్చాను.

ఓనాటివుదయం వీధిలోకి వెడదామని బట్టల్ని వేసుకుని, మళ్లీ కాస్త బద్ధకించి, మంచంమీద వాలాను. అంతలో హఠాత్తుగా గదితలుపు తెరిచిన చప్పుడైంది. తలయెత్తిచూద్దునుగదా, వాకిట్లో పెరిజా ప్రత్యక్షం!

"ఏం బాబూ! బాగున్నారా?" అని తన కీచుగొంతుతో అడిగింది.

"ఆఁ! ఎరీదు కిలా వచ్చావ్?"

నేనిలా కసురుకునేసరికి ఆవిడ మొహంలో...అదివరకెన్నడూలేని...తడబాటూ, సిగ్గూ కనబడ్డాయి.

"బాబూ! మీవల్ల వోసహాయంకోరి వచ్చాను. మాట తీసివెయ్యొద్దు!" అని అంది.

"ఇదేదో దొంగవేషంరా!" అని అనుకుంటూ, పడుకున్నవాణ్ణి కదలలేదు; జవాబైనా చెప్పలేదు. "ఇంటికి వుత్తరం రాయాలనుకుంటున్నాను, బాబూ!" అంటూ ఆవిడ మళ్లీ అందుకుంది.

"ఏమిటిది, ఈ వెధవవేషం?" అనుకుంటూ, మంచంమీదినుంచి కిందికివురికి, టేబుల్‌దగ్గిర కుర్చీలో చతికిలబడి, కాగితం కలంతీసి, "ఇలారా! ఇక్కడకూర్చుని, ఏమిరాయాలో చెప్పు!" అన్నాను. ఆవిడ లోపలికివచ్చి, కుర్చీలో నింపాదిగాకూర్చుని, నాకళ్లలోకి గుచ్చిచూచింది.

"సరే, వుత్తరమెవరి పేర?" అన్నాను.

"బోలిస్‌లోవ్, కామ్‌ఫట్ పేర. వార్నా రైలుగోడ్డుమీద స్విన్‌జియూదాలో మకాం."

"సరే, ఇహ చెప్పు గబగబా!"

"నా ప్రియమైన బోలిస్!... నా అందాలరాశీ!... నా ప్రేమ నిధానమా!... నా జీవన సర్వస్వమా! నీ తెరిజాకు ఇన్నాళ్లుగా వుత్తరం రాయలేదేం? నీదగ్గిరినుంచి వుత్తరం రాకపోవడంచూచి, నీ ఈచిన్ని గువ్వపిట్ట ఎంత విచారపడు తున్నదో నీకు తెలుసా?"

దీన్ని విని నవ్వు ఆపుకోలేకపోయాను. దాదాపు ఆరడుగుల మనిషి — దుక్కలావుంది — పహిల్వాన్ జబ్బలు — తానో చిన్న పిట్టట! ఎలాగో నవ్వు ఆపుకుని "ఎవరీ బోలిస్‌లోవ్" అని అడిగాను. బోలిస్‌లోవ్ పేరు విననివాళ్లుకూడా వున్నారా అన్నట్టు నావంక చూచి, "బోలిస్ ... బోలిస్ ... నా ప్రియుడు... నాచిన్నవాడు" అంది.

"చిన్నవాడా!"

"ఎందుకు మీకింత ఆశ్చర్యం? ఏం నాలాంటి చిన్న దానికి వోచిన్నవాడు వుండగూడదూ?"

తాను "చిన్న"దట! ఇది చాలా మంచి తమాషాయే అనుకుని "ఓ! తప్పకుండా! ప్రపంచంలో అసాధ్యమంటూ ఏమీ లేదు. అయితే, మీయిద్దరికీ ఎన్నాళ్లనుంచి పరిచయం?" అని అడిగాను.

"పదేళ్లనుంచి!"

మరి మాటాడకుండా, ఆవిడకు వుత్తరం రాసిపెట్టాను. ఆవుత్తరంలోని ప్రేమా, మార్దవమూ ఇంతింతకాదు. తెరిజా దగ్గరినుంచికాకుండా మరి యెవతెదగ్గరనుంచైనా అలాంటి వుత్తరంవస్తుందని తెలిస్తే, నేనే బోలిస్‌ను అయివుండనందుకు తప్పకుండా విచారించి వుండేవాణ్ణి.

"చాలా సహాయం చేశారు, బాబూ! నమస్కారాలు!" అంది తెరిజా కృతజ్ఞతతో. ఆవిడ హృదయం నిండిన కట్టున బడింది. "మీకేమైనా పనివుంటే చెప్పండి; చేసిపెడతాను"

"అక్కర్లేదు! అక్కర్లేదు."

"చినిగిన చొక్కాలూ, గుడ్డలూ వుంటే నాకివ్వండి; కుట్టి పెడతాను" అని అడిగింది.

ఈమాటలకు లోపల కొంచెం విసుక్కుని, నాకు ఆవిడ ఏమీ పనిచేసిపెట్టనక్కర్లేదని నిక్కచ్చిగా చెప్పి, పంపించి వేశాను.

రెండు వారాలు గడిచాయి. ఒకనాటి సాయంత్రం ఈలవేస్తూ కిటికీదగ్గర కూర్చుని, ఉబుసుపోకకు ఏమిచేద్దామా అని ఆలోచిస్తున్నాను. బయట తుంపరపడుతున్నది; చలిగాలి వీస్తున్నది. ఇంతలో హఠాత్తుగా గదితలుపు తెరుచుకుంది. "వాళ్ల పుణ్యమా అంటూ ఎవరోవస్తున్నా"రని సంతోషించాను.

"ఏం బాబుగారూ? పనితొందర ఏమీలేదు కదా?" అంటూ టెరిజా ప్రవేశించింది.

"మళ్లీ ఇదెక్కడ దాపురించిందిరా!" అని అనుకున్నాను.

"లేదు గాని, ఎందుకు?"

"దయవుంచి ఇంకో వుత్తరం రాసిపెట్టండి, బాబూ!"

"సరే, మళ్లీ బోలిస్‌కేనా?"

"కాదు, ఈసారి అతడి దగ్గర్నుంచి జవాబుకావాలి."

"ఏమిటది?" అన్నాను విస్తుపోతూ.

"క్షమించండి, బాబుగారూ! ఏదో తెలివి తక్కువ ముండను,— మనస్సులోవున్న మాటను సరిగా చెప్పలేను. ఈవుత్తరం నాకోసంకాదు— ఓ నాస్నేహితుడి కోసం— అంటే, అంత పెద్దస్నేహితుడుకాదు లెండి— కొంచెం పరిచయస్థుడు. అతడికి...పాపం...రాతకోతలు చేతరావు. నాకు ఓబోలిస్ వున్నట్టుగానే, అతడికి ఓటెరిజావుంది..."

ఆవిడకేసి చూచాను. సిగ్గుపడుతున్నట్టు కనబడింది. చేతులు గజగజ వణుకుతున్నాయి; చాలా తడబడిపోతున్నది; ఆవిడ రహస్యం తెలుసుకున్నాననుకున్నాను.

“ఏయ్! అమ్మా! ఇలావిను! నేఃనీ, బోలిస్ అనీ ఎందుకు ఈ కాకమ్మకథలు చెబుతావ్? ఈ అబద్ధాలు దేనికి? నాగదిలోకి రావడానికి ఇది కేవలం ఓవంక కాదూ? ఇహ, నీ మొహం చూడ్డానికైనా నాకిష్టంలేదు. దయచెయ్యి!” అని గదిమాను.

నా మాటలకు ఆవిడ జడిసిపోయింది. సిగ్గుతో చస్తూ, మళ్లీ యెలాగైనా నా సంభాషణ సాగించాలని గట్టిగా ప్రయత్నించసాగింది. ఆవిడ ఈ వైఖర్ని చూచి, ఒకవేళ నేనే పొరబడ్డానేమోనని మథనపడ్డాను. ఇంతకూ నన్ను వలలో వేసుకోవాలనీ, తప్పుదారికి దించాలనీ, ఆవిడ వచ్చివుండదు గదా! అయితే మరి ఆవిడ వుద్దేశమేమిటి?

“బాబుగారూ—” అంటూ ఏదో చెప్పబోయి, మళ్లీ, అంతలోనే ఆగి, చరాలున వెనక్కు తిరిగి, బైటికి వెళ్లిపోయింది.

దీన్ని చూచి నేను తెల్లబోయాను. మనస్సు అదో మోస్తరుగా అయిపోయింది. ఆవిడ సరాసరి తనగదిలోకి వెళ్లి పీకమని తలుపు వేసుకోవడం వినిపించింది. పాపం, చాలా కోపంవచ్చింది. కాసేపు అంతా పర్యాలోచనచేసి, ఆవిడ్ని వెనక్కు, పిలుద్దామని నిశ్చయించుకున్నాను. ఆవిడ అంటే, ఏమోగాని చాలా జాలికలిగింది.

ఆవిడ గదిలోకి వెళ్లాను. మోచేతుల్ని టేబుల్ మీద ఆన్చి, ముఖాన్ని చేతులతో కప్పుకుని కూర్చునివుంది.

“ఇదుగో! అమ్మా—” అంటూ పలకరించాను.

ఎప్పుడు నేనీ కథ చెప్పడం మొదలుపెట్టినా, ఈ ఘట్టం దగ్గరికి వచ్చేసరికి అదేమోగాని నాగుండె నీరౌతుంది. సరే, విను! ఆవిడ చరాలున కుర్చీలోనుంచి లేచి, సరాసరి నాదగ్గరికివచ్చి,

మెరుస్తూవున్న కళ్లతో నాభుజాలమీద తన రెండు చేతులీన్చీ వేసి, గుండె పగులుతుందా అన్నట్టు వెక్కి-వెక్కి యేడ్వ సాగింది.

"ఈ...ఈ... ప్రశ్నలన్నీ... ఎందుకు... బాబూ... మీకెందుకు?... వెర్రిముండాదాన్ని... అడిగానుగదా అని... నాలుగుముక్కలు... రాసిపెట్టకూడదమూ?... చూడ్డానికి... మంచి అబ్బాయిలా... కనబడ్డారు... నిజమే... బోలిసూలేదు... ఔరిజానూలేదు... నేనే... ఒక్కత్తెనే... వున్నాను" అని అంది.

"అయితే, బోలిస్ అంటూ... బోలిస్‌లేమూ?"

"లేదు"

"ఔరిజాకూడా లేదూ ?"

"లేదు...అంటే...నేనే ఔరిజాను"

నాకు అంతా అయోమయంగా కనబడింది. ఆవిడవంక ఆశ్చర్యంగా చూశాను. ఇప్పుడు పిచ్చెత్తింది యెవరికి? నాకా? ఈవిడకా?" అనే ప్రశ్న ఉదయించింది. ఇంతలో ఆవిడ మళ్లీ టేబుల్‌దగ్గరకెళ్లి, డ్రాయరున్న కాసేపు వెదికి, ఓకాగితాన్ని తీసింది.

"ఇదుగో, బాబూ!" అంటె తిరిగి నాదగ్గరకివచ్చి. "మీరు నాకు రాసిపెట్టిన వుత్తరం. నాకెందుకిది? మీరే పట్టుకుపోండి! ఇంకోవుత్తరం రాసిపెట్టమంటే, రాయనంటూన్నారుగా? అంతా మీలాగేవుంటారా? దయాగలబాబు వుండకపోతాడా?"

ఆవిడ చేతిలోవున్న కాగితం,—బోలిస్‌లోవ్ పేర నేను రాసిపెట్టిన వుత్తరమే! ఈ గొడవంతా ఏమిటిచెప్మా అని వెలవెలబోయాను.

"ఔరిజా! నామాటవిను! ఏమిటీ గొడవ? ఏనాడో

రాసిపెట్టిన ఈ వుత్తరాన్నే పోష్టుచెయ్యలేదుగదా, మళ్లీ కొత్తవుత్తరం రాయమని యెందుకు వేధిస్తావ్ ?"

"ఎవరికి పోష్టుచెయ్యను ?"

"ఎవరికేం ? అతడికి—నీ బోలెస్‌కి !"

"కాని...అటువంటి మనిషే లేడుగా ?"

ఈ గొడవేమిటో ఇహ నాకర్థంకాదని, వెనక్కి తిరిగి వెళ్లిపోబోయాను. ఇంతలో ఆవిడ తిరిగి అందుకుంది:

"నిజమే, బాబూ ! బోలెస్‌లోవ్ అంటూ ఎవ్వడూ లేడు. కాని, నాకుమాత్రం అలాంటివాడు వుండాలనేవుంది. నేను అందరిలాంటిదాన్ని కానని నాకూ తెలుసు. కాని, నేనతడికి వుత్తరాలు రాయడంవల్ల యెవరికేం నష్టం ?"

"అబ్బ ! చంపక కాస్త స్థిమితంగా మాటాడుదూ ? అతడంటే, ఎవడు ?"

"ఎవడేమిటి ? బోలెస్‌లోవ్ !"

"మళ్ళీ మొదలా ?" అంటూ నేను విసుక్కున్నాను. "ఇప్పుడేగా అలాంటివ్యక్తి యెవ్వడూ లేడని చెప్పావ్ ?"

"అబ్బబ్బ !...నిజమే, బాబూ ! అలాంటివాడెవడూ లేడు. లేకపోతేనేం ? బోలెస్‌లోవ్ అంటూ వొకడున్నాడని నేను వూహచేసుకుంటాను. అతడు నిజమైనవ్యక్తే అన్నట్టుగా అతడికి వుత్తరం రాస్తాను. అతడు నా వుత్తరానికి జవాబురాస్తాడు. నేను మళ్ళీ రాస్తాను; అతడు మళ్ళీ జవాబిస్తాడు—"

చివరకు నాకు సర్వం బోధపడింది. ఏదో పెద్దనేరంచేసిన వాడిలా సిగ్గుతో కుంగిపోయాను. నా పొరుగునే, ఒక్కబారెడు దూరంలో ఓమానవజీవి...ఏకాకానిగా...ప్రేమతో పలకరించే వారైనా లేకుండా...బతుకుతూ, తన దిక్కుమాలినస్థితిని విస్మరించడానికి తన ఊహాప్రపంచంలో ఒకవ్యక్తిని సృష్టించుకుని, అతడు తనకు ప్రియుడూ, తాను అతడికి ప్రేయసీఅని ఊహి

ఘ్లాయతూవుంటే, ఆమాత్రం రహస్యాన్ని అంతకాలంగా గ్రహించలేకపోయినందుకు నన్ను నేనే నిందించుకున్నాను !

ఆగకుండా, ఆవిడ తన కీచుగొంతుతో ఇంకా ఏమో చెబుతూ పోతుంది: “బోరిస్ పేర మీరు ఓ వుత్తరం రాసిచ్చారా,...దాన్ని నేను యింకొకరికిచ్చి చదివించుకున్నాను. దాన్ని వింటూ, నిజంగా బోరిస్ లోన్ అంటూ ఒకడున్నాడనే సంతోషించాను. తర్వాత బోరిస్ దగ్గరినుంచి తెరిజాకు జవాబు కావాలన్నాను. తెరిజాఅంటే,— నేను. బోరిస్ ఎక్కడో వోచోట...నాకైతే తిన్నగా తెలియదు గాని...వున్నాడనే నా నమ్మకం. ఈ నమ్మకం లేకపోతే నా బ్రతుకు మరీభారంకాదూ ? ఇలా ఒకడున్నాడని అనుకుంటే, అంతకష్టంగానూ, అంతఘోరంగానూ, అంత ఒంటరితనంగానూ అనిపించదు !”

సరి, ఇహ నేనప్పటినుంచి తప్పకుండా వారానికి రెండుసార్లు తెరిజానుంచి బోరిస్‌కూ, బోరిస్‌నుంచి తెరిజాకూ వుత్తరాలు రాస్తూవుండేవాణ్ణి. ఆ వుత్తరాలు చాలా అద్భుతంగా ఉండేవికూడా ! ముఖ్యంగా బోరిస్‌నుంచి తెరిజాకువచ్చే వుత్తరాలు ! ఇహ ఆవిడ... నే నా వుత్తరాలను చదువుతూవుంటే, ఏడ్చేది, నవ్వేది, ఆనందించేది. ఇందుకు ప్రత్యుపకారంగా చిరిగిపోయిన నా స్టాకింగ్సూ, చొక్కాలూ అన్నీ కుట్టి బాగు జేసేది.

ఈకథ ఇలా మూడునెలలవరకూ జరిగింది. ఆతర్వాత ఆవిణ్ణి ఎందుకోగాని అరెస్టు చేశారు. అంతే, మళ్లీ ఆవిడ నా కెక్కడా కనబడలేదు. ఈపాటికి ఏజైలులోనో నిశ్చయంగా చచ్చిపోయే వుండాలి.

పేన్‌టలైమన్ రోమనోవ్

(జననం : 1884)

# చెర్రీబ్లాజం

ఇంతకుముందెన్నడూ వసంతఋతువు ఇంత చక్కగా లేదేమో!

కాని, డియర్ వెరూషా, నా మనస్సేమో చింతాక్రాంతంగా వుంది.

ఏదో తప్పుడుపనిచేసినట్టు విచారంగా... బాధగా ... వుంది

హాస్టల్లో నాగదిలో మూతపగిలిన సీసా వొకటివుంది. దానిలో వాడిపోయిన చిన్ని బర్డ్‌చెర్రీపూలగుత్తి వుంది. దాన్ని రాత్రి యింటికి తెచ్చాను ...... దానివంక చూట్టంతోటే యేడవాలనిపిస్తున్నది.

ధైర్యం చిక్కబట్టి, అంతా నీకు చెబుతాను. ఇంకో కాలేజీలో చదువుతూవున్న ఒక కామ్రేడ్‌తో నాకిటీవల పరిచయం కలిగింది. సెంటిమెంటుకూ, నాకూ చాలాదూరం. ఈమాట అతడు కూడా అంటూఉంటాడు. ఇహ, ముగ్ధత్వం పోగొట్టుకొన్నం

మకుటధారినైన నా ఊహల్లోంచి చెరిపేలేను. ప్రత్యేకమైనా
మనిషి జీవితం మారిపోలేదు. అయినా, నన్నడిగితే
ప్రేమ, — అస్పష్టంగా, అయోమయంగా!

అసల్లా సంధించిందో నిన్ను చూసి ఏమీ అనలేకుండా
చెప్పాను. కాని, ముందుగా నిన్ను కొన్ని ప్రశ్నలడుగుతా.

నీకూ, పాలుకూ ప్రథమసమాగమం జరిగిననాడు వొకరికొకరు
ఉండాలనీ, విశిష్టంగా ఉండాలనీ నవు కోరలేదూ ?

నీ జీవితంలో ఆ వసంతోత్సవంనాడు వాసిన బూట్సుగానీ,
చిరిగిన బ్లౌజుగానీ వేసుకుని ప్రైటికివెళ్లే దమ్ములే నీకు చిన్నతనంగా
ఉండేది కాదూ ?

ఇలా యెందుకు అడుగుతున్నానంటే, ఈ విషయంలో నా
అభిప్రాయలకూ, నా ఈడుజోడువాళ్ల అభిప్రాయాలకూ
తూర్పు పడమరల భేదంవుంది. అంచేత నే నెలా "ఫీ" లౌతు
న్నానో, అలా ఆలోచించడానికిగానీ, అలానే చెయ్యడానికి
గానీ ధైర్యంచాలకుంలేదు.

మరి... ఈడు జోడువాళ్ల అభిప్రాయాలకు భిన్నంగా వెళ్లడ
మంటే మాటలుకాదుగా ?

అందమైనవాటివిషయాల్లో నిర్లక్ష్యంగావుండడమే మాలో
అందరూ ఆమోదించినవైఖరి.

బట్టలు నీటుగావుంచుకోవడం, ఇల్లు శుభ్రంగావుంచుకోవడం
అంటేకూడా సరిగ్గా ఇదేవైఖరి.

మా హాస్టలంతా దుమ్ముతో, మురికితో నానా భీభత్సంగా
ఉంటుంది. పరుపుచుట్టలు నేలమీద దొర్లుతూఉంటాయి. కిటికీ
లన్నీ కాల్చిపారేసిన సిగరెట్టుముక్కలతో నిండివుంటాయి.
గదికీ గదికీ మధ్య చౌకపారు అద్దాలు; వాటిమీద చిరిగి
జీరాడుతూవుండే పోస్టర్లు — అంతా చెడ్డ వికారం!

తనగదిని శుభ్రంగా...చక్కగా...ఉంచుకోవాలని ప్రయత్నించేది మాలో ఒక్కయినా లేదు. మమ్మల్ని త్వరలో ఇంకో బిల్డింగుకు మారుస్తారని పుకారుగావుంది. అంచేత మరీ అశ్రద్ధ యెక్కువైపోయింది. కావాలని ఖంగాళీ చేస్తున్నారు కూడా!

గదిని శుభ్రంగా...చక్కగా...ఉంచుకోడం, మంచిగాలిని తగలనియ్యడం అనే స్వల్పవిషయాల్ని గురించి శ్రద్ధవహించడం మాని, గొప్పదైనా నష్టపోతారేమో అన్నట్టు ప్రవర్తిస్తారు. ఊపిరిసలపనివ్వని పనులున్నాయా అంటే, అదీ లేదు. నిజానికి అంతా తీరికే! అయినా ఖచాడాగా వుంచడం యెందుకంటే,— అందాన్ని గురించి శ్రద్ధవహించడాన్ని అసహ్యించుకోవాలనే నమ్మకంకొద్దీ!

ఈ వింతనమ్మకం ఏర్పడడానికి కారణమేమిటో తెలియదు. అందమైన జీవితాన్ని ప్రేమిస్తామని కోతలుకోసే "కేపిటలిస్టు" ప్రభుత్వంరోజుల్లో దిక్కూ దివాణమూ లేకపోయినా, ఇప్పుడు మన బీద కార్మిక ప్రభుత్వం ప్రతిదాన్ని అందంగా చెయ్యడానికీ, ప్రతిచోటా పూలతోటలు వెయ్యడానికీ విరివిగా ఖర్చుపెడుతోంది. మాస్కో నిండా అందమైన మేడలే. నూరేళ్లపాటు సగంకూలిన పోలీసు స్టేషన్‌గావున్న మా యూనివర్సిటీకూడా మాస్కో అంతటికీ చాలా చక్కని భవనంగా మార్పుచెందింది.

ఇహ మేమో?...మా యూనివర్సిటీ ఇంతఅందంగా వుంది గదా అని గర్వపడుతూవుంటాం. కాని, నూతన ప్రభుత్వంవారు పవిత్రంచేసిన ఈ భవనంలోనే మా జీవితం అతి అపరిశుభ్రంగానూ, మహాభీభత్సంగానూ తయారైంది, వాళ్లు నాజూకుగా వుంటున్నారే అని యెక్కడ యెవళ్లు వేలెత్తిచూపుతారో అన్నట్టు యిక్కడి ఆడవాళ్ళూ, మగవాళ్లూ నడుచుకుంటారు. కావాలని మోటుగానూ, అసహ్యంగానూ వొకరితో వొకరు

సంభాషిస్తారు. ఇహ......"సెక్స్" విషయం మాట్లాడవలసి వస్తే, అన్నీ బండమాటలే! పచ్చిబూతులే!!

మహోజుగుప్సాకరమైన మాటల్ని కూడా నిస్సంకోచంగా వుప యోగిస్తారు. ఇదేమిటని మాలో కొందరెవరైనా అసహ్యించు కుంటే, పరిస్థితులు మరీ అధ్వాన్నమౌతాయి మమ్మల్ని "మాతృ భాష"కు అలవాటు చెయ్యడానికి అంతా ఒక కట్టుగా పూను కుంటారు.

"సినిసిజం", బండబూతూ, మృదుత్వాన్ని చంపుకోవడం,— ఇవే మాలో పలుకుబడిని సంపాయించేవి!

బహుశా మన మందరం బీదవాళ్లం కాబట్టి, బట్టలకోసం ఏమీ ఖర్చు పెట్టలేక, దీన్నంతా అసహ్యించుకుంటున్నామేమో! లేక అలా నటిస్తున్నామేమో!

లేదా, మనల్ని మనం విప్లవసైన్యంగా ఊహించుకుంటూ మనకు జీవితంలో అందానికీ, నాజూకుతనానికీ స్థానంలేదని భావిస్తు న్నామేమో! ఇదే నిజమైతే, మనం స్వయంగా స్థాపించుకున్న ప్రభుత్వాన్ని చూసైనా, కేవలం అందంకోసమే అందంగావుండ డమేకాకుండా, పరిశుభ్రతకోసం, ఆరోగ్యంకోసం అందంగా వుండడం నేర్చుకోవద్దూ? అంచేత, ఇహనైనా ఈబండబూతుల్ని విరమించడం సబబుకాదూ?

కాని, నీకూ తెలుసు,—చాలామందికి బండబూతులంటేనే యిష్టమని! మగవారిమాటయెలావున్నా ఆడవాళ్లకు కూడా అవంటే మోజువుండడం శోచనీయం. ఔనులే! మర్యాదగా మాట్లాడాలంటే శ్రమగాని...బూతులకేం...అంతా స్వేచ్ఛగా!

మా "ఎకాడమీ" ధోరణేవేరు. ఈ యూనివర్శిటీలో చేరి నందుకు నే నప్పుడప్పుడు విచారిస్తున్నాను. మా అమ్మ...అర్థం శుభ్రం తెలియని పల్లెటూరి మంత్రసాని... కేవలం దేవతామూర్తిని

చూచినట్టు నన్ను అతి గౌరవంతో చూస్తుంది. కాని, నేను జీవిస్తున్న ఈపాడు పరిసరాల్నీ, మేముమాట్లాడే ఈ పాడుభాషనూ చూస్తే...పాపం!......యేమనుకుంటుందో !

మాకు "సెక్సు" సంబంధాలే గాని, ప్రేమఅంటూలేదు. అందుచేత ప్రేమను మానసికశాస్త్రప్రపంచంలోకి తోసివేశారు. శరీరసుఖంకోసమే మా జీవితాలు. మా లేడీ స్టూడెంట్సుకు తమ మగస్నేహితులతో ఏవారమో, నెలో గడపదమన్నా, లేదా ఒక్కరాత్రిపాటే "ఖుసీ" చెయ్యాదమన్నా అతి సామాన్యమైనవిషయం. ఇంత దేనికి? స్త్రీ పురుషసంబంధంలో శరీరసౌఖ్యాన్నిమించి ఏమైనావుందని అనుకునేవాళ్లను పిచ్చివాళ్ల కింద జమకడతారు.

అత డెలాంటివాడో చెప్పమంటావా? మామూలు స్టూడెంటే హైబూట్సు,బ్లూబ్లౌజు వేసుకుంటాడు. ఆ బ్లౌజు మెడ దగ్గరి గుండీని పెట్టుకోడు. నుదురుమీద పడుతూవుంటే ఆ సంస్కారం మెరుగని జుట్టును ఎప్పుడూ వేళ్లతో యెగదోస్తూవుంటాడు. నన్ను ప్రధానంగా ఆకర్షించింది, అతడికళ్లు. ఒంటరిగా "కారిడర్సు" వెంటనడిచి వెడుతూవుంటే, అతడినేత్రాల్లో ప్రశాంత గాంభీర్యం తొలుకాడుతూవుంటుంది. కాని, తోటివిద్యార్థి నెవడినైనా కలుసుకుంటే చాలు,—వెంటనే తెగ అల్లరీ, పచ్చి బూతులూ! అందగాడని ఆడపిల్లలు వెంటబడ్డంవల్లా, తెలివిగలవాడని కుర్రవాళ్లు మెచ్చుకోవడంవల్లా అతడిలో అహంభావం బలిసిపోయింది. విద్యార్థిలోకంలో తనకున్న పలుకుబడి యెక్కడపోతుందోనని అతడు గుంజాటన పడుతూవుంటాడనుకుంటాను.

అతడిలో నాకు రెండు విభిన్నప్రవృత్తులు కనిపించాయి: ఒకటి గొప్పహుందా; రెండోది వెధవ వెకిలితనం. ఈ వెకిలితనం వల్లే మోటుగామాట్లాడి, తన గొప్పతనంచూపించాలని పాకులాడుతూ వుంటాడు.

నిన్న సూర్యాస్తమానంవేళ మేమిద్దరం మొట్టమొదటిసారిగా షికారువెళ్ళాం. సాయంత్రప్రశాంతి నగరాన్ని ఆవరించింది. బజారులో గడబిడ కొంచెం తగ్గింది. చక్కటిగాలి వీస్తోంది. బాగా యెండిననేల తడిసినప్పుడువచ్చే పరిమళం వస్తోంది.

"దగ్గర్నే నాగది, — వెడదాంగా! అన్నాడు.

"నే రావడంలేదు".

"ఏం? మర్యాదకు భంగమా?"

"అబ్బే! అదికాదు — బయటనే హాయిగావుంది".

అతడు (అవహేళనగా) భుజాలు యెగరవేశాడు. ఏటిగట్టునే నడిచి, డ్రాబ్రిడ్జిదగ్గర కాసేపునుంచున్నాం. బుట్టెడు చెర్రీపూలగుత్తుల్ని అమ్ముతూ అక్కడికొక అమ్మాయి వచ్చింది. కాసిని పూల గుత్తులు కొన్నాను చిల్లరకోసం చాలాసేపు అక్కడే ఆగవలసి వచ్చింది. ఒకపక్కకు తిరిగి, అతను చురచురలాడుతూ నావంక చూశాడు.

"చెర్రీబ్లాజంలేకపోతే జరగదేం?"

"జరగకేమిగాని, చెర్రీబ్లాజం లేనిదానికంటె, వుండడం మంచిది కాదూ?"

"చెర్రీబ్లాజం లేకపోయినా నాకు జరుగుతుంది. అది లేక పోవడంవల్ల నాకెన్నడూ ఏంలోటూ రాలేదు" అని అతడన్నాడు పళ్ళికిలిస్తూ.

ఇద్దరు లేడీ స్టూడెంట్సు మాముందు నడుస్తున్నారు చాలా మంది కుర్రాళ్లు వాళ్ల వెంటపడి, అల్లరిచేస్తున్నారు. పాపం, వాళ్ళిద్దరూ బెదిరిపోవడంచూచి, వాళ్లు విరగబడి నవ్వుతున్నారు; నానా పిచ్చిమాటలు అంటున్నారు.

"లేడీ స్టూడెంట్సుకు కోపంతెప్పించారు. చెర్రీబ్లాజంలేకుండా

వెంటపడేసరికి వాళ్లకు కోపంవచ్చినట్లుంది," అని నా కామ్రేడ్ అన్నాడు.

"చెర్రీబ్లాజంఅంటే మీకంత తలనొప్పి దేనికి?" అని నే నడిగాను.

"దాపరికం లేకుండా, మనసులోవున్నమాట చెప్పమంటావ్?... చెర్రీబ్లాజంవున్నా, లేకపోయినా, ఆ సనికి అర్థ్యం తరంయేమిటీ?"

"ప్రేమంటే మీకు తెలియదు గనుక, మీరిలా నే అంటారు."

"ప్రేమ అంత అవసరమా?"

"ప్రేమేలేనప్పుడు మరి మీకు స్త్రీ దేనికి?"

"అబ్బ! ఈ పైనా మర్యాద లేక కట్టిపెట్టు 'మీ' అనడం మానేసి 'నువ్వు' అను......ఇహా, ప్రేమెందుకంటావ్! చాలా అవసరాలున్నాయిలే!"

"మిమ్మల్ని 'నువ్వు' అని ఏమైనాసరే నే నను. ప్రతివాళ్లా 'నువ్వు' అని అంటే, దాంట్లో సొగసేముందీ?"

మాటాడుతూ లిలాక్ పొదరింట్లదగిరకి వెళ్లాం. బ్లాజుకు చెర్రీబ్లాజంపెట్టుకుందామని నే నొక్కక్షణం ఆగాను. ఇంతలో అతడు హఠాత్తుగా ముందుకువచ్చి, నాతలను వెనక్కువంచి ముద్దుట్టుకోబోయాడు. నే నతన్ని విదిలించేశాను.

"నీ కిష్టంలేదన్నమాట! పోనీలే!" అని అతడన్నాడు నిశ్చలంగా.

"ఔను. నా కిష్టంలేదు. మీ కెవ్వారంటేనూ ప్రేమలేదన్నారు కదూ? అంచేత ఎవరైను ముద్దెట్టుకున్నా మీ కొక్కటే. నేనుగాక, మరెవతైనా వెంటవుంటే, దాన్నికూడా సరిగ్గా యిలానే ముద్దెట్టుకునేవారుగా!"

"నిజంచెప్పావ్! ఆడదికూడా వీడూ, వాడూ అని లేకుండా తన చిత్తంవచ్చినవాళ్లి ముద్దెట్టుకుంటుంది. ఈమధ్య మే మో

చిన్నపార్టీ చేసుకున్నాము. అక్కడ వో స్నేహితుడి కాబోయే యిల్లాలు అతడి నెంత ఆప్యాయంగా ముద్దెట్టుకుంటుందో,నన్నూ అలానే ముద్దెట్టుకుంది. నేను కాకుండా మరెవ్వడైనా దగ్గరుండడం తటస్థిస్తే, ఆవిడ అతణ్ణి అలానే ఆదరించేది. పైగా, వాళ్ళిద్దరూ ప్రేమలోనకూడా మంటూ రిజిస్ట్రేషన్ ఆఫీసులో ముడి పెట్టుకో బోతున్నారు. ఈ ప్రేమతతంగం నీకైనా తెలియంది కాదుగా?"

అతడు ఈ విధంగా మాట్లాడ్డంమూస్తే, నామనస్సు చివుక్కు మంది. నాపైన అతడికి కొద్దో గొప్పో ప్రేమలేకపోలేదని అను కున్నాను. ఎంతమంది యితర స్టూడెంట్సుమధ్య నేనున్నా, నా చూపు తనవైపు తిప్పుకోవాలని అతడు ప్రయత్నించేవాడుకూడా? ఈ వసంతసాయాహ్నవేళ మృదుమధురసంభాషణలో సంహృద యం పరితపిస్తూవుంటే, అతడింత మోటుగానూ, అసహ్యంగానూ మాట్లాడ్డం దేనికి ?

ఆక్షణంలో నా కతడిమీద ద్వేషభావం కలిగింది మే మొక బెంచీని దాటివేస్తున్నాం ఆ బెంచీమీద ఎవర్తోగాని కూర్చునివుంది. ఆవిడ సిల్కుస్టాకింగ్సు వేసుకుంది. కాలిమీద కాలువేసుకు కూర్చుని, దారిని వస్తూపోతున్నవారిని కళ్ళెత్తి చూస్తూవుంది.

నా వెంటవున్న కామేశ్ రెప్పవెయ్యకుండా ఆవిడవంక చూచాడు. నాలుగడుగులు ముందుకువేసి మళ్లీ వెనక్కుతిరిగి, దృష్టి ఆవిడవైపే పోనిచ్చాడు. నాకు ఫెళ్లున చెంపపెట్టుపెట్టి నట్టయ్యింది.

ఆపై బెంచీదగ్గరికి వెళ్ళేసరికి, "ఇక్కడ కూర్చుందామా?" అని అన్నాడు. అక్కడ కూర్చుంటే, ఆ అమ్మివంక చూడ వచ్చుగదా అని అతడి వుద్దేశం.

ఒక్కసారిగా నేను చాలా కలవరపడిపోయాను. మరికొంచెం జాగుచేస్తే, ఏడుపుకూడా వస్తుందేమోనని భయంవేసింది. అంచేత

సరసాలూ, నవ్వులూ తెరలు తెరలుగా వినబడుతున్నాయి. కాలుతూవున్న సిగరెట్టుకొసలు మిణుగురులలా మెరుస్తున్నాయి. ఆ శుభ్రజ్యోత్స్నాపులకిత వసంతయామిని ప్రతివారి హృదయాన్నీ ప్రేమార్ద్రంగా చేసినట్టు కనబడింది. ప్రతివారూ ఒక్క క్షణమైనా వృథా కాకుండా ఆనందానుభూతిని పొందాలని అనుకుంటున్నట్టు తోచింది.

అటువంటి మహామధురయామినీప్రభావం నీ హృదయంమీద కూడా ప్రసరించినప్పుడు నీవు ఒంటరిగానూ, బాధతోనూ వుంటే ...అబ్బ! ...ఎంత విచారం అనిపిస్తుంది! అంతకంటె విచారం మరి వుండబోదుగా!

కొంతసేపటిక్రితం అతడు నా వెంటవున్నా, లేకపోయినా, ఒక్కటేనని అనుకున్నాను. బెంచీమీది ఆ అమ్మి వంక రెప్ప వెయ్యకుండా అతనలా చూశాడుగదా అన్న తలపు ఇంకా నన్ను వేధిస్తున్నమాట నిజమే! అయినా, తిరిగి అతడు నా వెంట వుంటే ఎంచక్కగా వుంటుందని అనుకోసాగాను!

ఒక్కమాటలో...నన్ను తిట్టవద్దమ్మా! ...ఆ వసంతోత్సవ యామినిలో—చక్కని వాల్ట్జిలోనుంచి మధ్యస్థంలో నెట్టగొట్టబడినదానిలా ఫీలౌతూ— ఒంటరిగా వుండలేక పోయాను. ఎలా పర్యవసిస్తుందోనని ఆలోచించకుండా, వెనక్కి తిరిగి అతడిగదివైపుకు నడిచాను.

## 2

ఒక్కటే సందేహం నన్ను బాధించసాగింది: అతను తిరిగి యేమీదికైనా వెళ్ళిపోతాడేమో! నేను ఆలస్యమైపోతానేమో! నేనిక ఒంటరిగానే వుండిపోవలసివస్తుందేమో! అతణ్ణి చక్కగా ప్రవర్తించేలా చెయ్యడానికి ఏమీ ప్రయత్నం చెయ్యకుండా, అంత అసహ్యంగా వదలిపెట్టి వెళ్ళినందుకు నన్ను నేనే నిందించుకున్నాను. .

పరిస్థితులు అసహ్యంగావుంటే, వాటిని చక్కచెయ్యకుండా

"మా కేమిపట్టిం"దని ఔదాసీన్యంవహించేవారిలా నేనుకూడా ప్రవర్తించానుగదాఅని చింతించాను. శ్రమ యేమీ పడకుండా మంచిని అనుభవించాలనిఆశించడంతప్పుగదాఅని తెలుసుకున్నాను.

ఆ పాతయింటి గేటును దాటి లోపలికి అడుగుపెట్టానో, లేదో, బయటవీస్తున్న హాయిఅయిన గాలికీ, లోపలి ముంజు కంపుకూ భేదం స్పష్టంగా కనబడింది.

మాసోక్కలో యిలాంటి గేట్లు చాలా వున్నాయి: రంగూ గింగూలేని తలుపులూ, వాటిమీద...చిరిగి జీరాడుతూవుండే... పాత యెక్స్యరిబైజ్ మెంట్ పోస్టర్లూ! ఇహ, మెట్ల సంగతి చెప్ప నక్ఖర్లే లేదు. దుమ్మూ, దుట్రాతో నానా ఖంగాళీ గా వుంటాయి.

నేను తిరిగి వస్తానని అతను అనుకోలేదు. చదువుకోడానికి కూచోబోతున్నట్టున్నాడు. గదిగోడకు ఆన్చి...తాపి పనివాడి బల్లలావున్న...టేబుల్ వొకటి వుంది. ఇంటికప్పునుంచి ఎలక్ట్రిక్ దీపం వొకటి వేలాడుతూవుంది. దాన్ని టేబుల్ దగ్గరికి లాగి, ఒక మేకుతో అక్కడ...చదువుకు వీలుగా...అమర్చాడు.

"అయితే, కథానాయిక తిరిగి వచ్చిందన్నమాట!" అని అతి డాశ్చర్యంగా అన్నాడు. "మంచి చెడ్డలు తెలిసివచ్చి నట్టేనా? శుభం!"

కైకిలిగా నవ్వుతూ దగ్గరికివచ్చి నాచెయ్యి పట్టుకున్నాడు. ముద్దుపెట్టుకోవాలనో దగ్గరికితీసుకోవాలనో అనుకున్నాడు. కాని, ఎంచేతనో అంతలోనే సంక్షేపించాడు.

"మనమధ్య జగడంవచ్చినందుకు విచారించి, దాన్ని తీర్చు కుందామని దక్కొ వచ్చాను" అని నే నన్నాను.

"తీర్చుకో డానికి ఏమంత జగడం జరిగింది. సరేలే, వుండు! ఇప్పుడే నేనంటూగా నోటీసు రాసి వాకిట్లో పెడతాను. లేకపోతే, యెవరైనా వచ్చిన లోపలికి రాగలడు!"

టేబుల్ దగ్గర నిలబడి, నోటీసు రాసి, వాకిట్లో పెట్టడానికి వెళ్ళాడు. ఒంటరిగా మిగిలిపోగానే నేను గదినాలుగుమూలలూ కలియజూచాను.

"ఎందుకు? బయటినుంచి ఇప్పుడేగా లోపలికివచ్చావ్!" అని అన్నాడు.

తర్వాత అతడిగొంతు మారింది.

"ఎవ్వరూ పాకంలో పురకలా రాకుండా ఆ నోటీసు అతికించాను. అవకతవకగా మాట్లాడబోకు. ఇప్పుడు నిన్ను బయటికెక్కడికీ పోనివ్వను" అని గబగబ అన్నాడు.

"ఏమో! ఇక్కడవుండడం నా కిష్టంలేదు."

"సరి! మళ్లీ మొదటికి వచ్చావ్!" అని విసుక్కున్నాడు. "ఏమిటీ సంకోచం? ఎక్కడికి పోతానంటావ్?"

అతడిమాట తడబడుతూవుంది. నన్ను పోనీయకుండా పట్టుకోవాలని చూచేసరికి, అతడిచేతులు గజగజవణికి పోయాయి.

నా చేతులూ వణికిపోయాయి. గుండె దడదడ కొట్టుకోసాగింది. కళ్లు చీకట్లు కమ్మాయి. నా మనస్సులో పెద్ద యుద్ధం జరుగుతూవుంది. లొంగిపోదామనే ఆకాంక్ష — ఎవ్వరూ మనస్సులో దాగివున్న ఆ [illegible] — అతడు దొంగలా గుసగుసలాడ్డం [illegible] వికారం — అతడి తొందర, తొట్రుపాటు, ఆ [illegible] అసహ్యం: ఇవి అన్నీ అన్నివైపులకూ గుంజాయి. [illegible] స్నేహితులవ్వకముందే తన కోర్కెను కాస్తా తీర్చుకుందామనే ఆయుద్దాతప్పితే, ఇతర ఆలోచనే అతడికిలేనట్టు కనబడింది. నేనేమాత్రం అభ్యంతరం కనబర్చినా, అతడు విసుగ్గానూ, కోపంగానూ ప్రవర్తించసాగాడు.

స్త్రీలమైనమనం ప్రేమలోనైనా సత్యాన్ని సంపూర్ణంగా గుర్తించడానికి వెనుదీస్తాము. ముందుగా మనల్ని ఆకర్షించేది పురుషుడే! అతడిమనస్సు, అతడి ప్రజ్ఞావిశేషాలు, అతడి అంతరంగం, అతడి మృదుత్వం, — ఇవే ముందుగా మనల్ని లోబరుచుకుంటాయి. ఆపైనగాని సత్యం తననగ్నరూపంతో సాక్షాత్కరించదు.

శారీరకసుఖానికి భిన్నమైనవాటిని ప్రప్రథమంలో మనం ఆశిస్తాము. ఆ భిన్నమైన కోర్కెలు సఫలీకృతంకాకముందే, స్త్రీ

తన తాత్కాలిక విషయలాలసతకు బలిఅయితే, పరిపూర్ణమైన సుఖానుభూతిని పొందడానికిబదులు, ఆవిడలో తనపైన తనకే అసహ్యభావం పుడుతుంది. తన పతనానికి దోహదమిచ్చిన వాడిమీదలా, తనను జుగుప్సాకరమైనఅనుభవానికి లోను జేసిన వాడిమీదలా పురుషుడిమీద ఆవిడకు కోపంకలుగుతుంది.

చిందరవందరగావున్న ఆపరుపు, కిటికీలోని ఆ కోడిగుడ్డు డొల్లలు, గదిఅంతటా నిండివున్న అదుమ్ము, అతడి ఆ దొంగ చూపులు, అనుకున్న దానికి భిన్నంగా జరుగుతున్నదిగదా అనే పెద్ద చింత—ఇవన్నీ అప్పటికే నన్ను గొడవపెట్టివేశాయి.

"అబ్బ! నేనిక్కడ వుండలేను" అని అన్నాను కన్నీరు నించుతూ.

"ఇప్పుడువచ్చిన ఇబ్బందేమిటి? ఇక్కడి ఫర్నిచర్ బాగుండ లేదా? దీనిలో నీవుకోరే కవిత్వం కనబడ్డంలేదు కాబోలు! కాని, చూచావ్! నేను లార్డును కాదుగా!" అని అతడు విసుక్కున్నాడు.

అతడి కేకలకు నాముఖం వెలవెలబోయివుండాలి. ఎందుకంటే, వెంటనే అతడు తనధోరణి పూర్తిగామార్చి, నన్ను అనునయించ డానికి ప్రయత్నించసాగాడు.

ఊరికే మారాంచెయ్యబోకు...జాగుచేస్తే, ఎవరైనావస్తారు కూడా!" అని పావురాయిగొంతుతో అన్నాడు.

అప్పుడైనా నేను బయలుదేరిపోవలసింది. కాని, అతడితో వొంటరిగావుండడంవల్ల నాలోనూ...అతడిలోమాదిరిలానే... ప్రగాఢమైన వాంఛ ప్రజ్వరిల్లింది. దానంతటఅదే ఏమైనా అర్థ్యం తరం కలగకపోతుందాఅని నన్ను నేనే మోసగించుకుంటూ, అక్కడ్నే జాగుచేశాను...

"కాస్త ఆగు! నీకు కవిత్వాన్ని కల్పిస్తాను!" అంటూ అతడు లైట్ స్విచ్ ఆఫ్‌చేశాడు.

గది మరికీ కమ్ముకపడిపోవడంవల్ల చీకటిగావుండడం బాగే అనిపించింది.

కిటికీదగ్గరే నా వీపు అతడివైపుకు తిప్పి నిలుచునివున్నాను. నేను కిటికీగుండా బయటికి చూస్తూవుండగా అతడు నా వెనక్కు వచ్చి ఒక చేత్తో నా మెడను చుట్టవేశాడు. అతడు ముఖభావాలు నాకేమీ కనబడ్డంలేదు. అయినా, అతడలా కౌగిలించుకున్నందుకు నేను సంతోషించకపోలేదు. అక్కడ్నే అలానే యెంతసేపైనా నిలబడివుంటే ఎంచక్కగా వుంటుందనిపించింది.

కాని, అతడికి తొందరపాటు హెచ్చింది. మనస్నేహితు లెవరైనా పుటిక్కిన యెక్కడవస్తారోనని తొందరపడసాగాడు. "ఇక్కడ యెంతసేపిలా నిలబడతావ్?" అన్నాడు నన్ను చెయ్యిపట్టుకు లాగుతూ...

మేము లేవగానే, అతడు తిరిగి లైట్ స్విచ్ ఆన్ చేశాడు.

"అబ్బ! లైట్ వద్దండీ!" అని బాగతోనూ, భయంతోనూ అన్నాను.

నావంక ఆశ్చర్యంగా చూచి, భుజాల్ని యెగరవేస్తూ, మళ్లీ లైట్ తీసివేశాను. అతర్వాత పక్కను సరిచెయ్యసాగాడు.

"నా రూమ్ మేట్ పక్కను సరిగా సర్దాలి. లేకపోతే, వాన్యా నే నెవర్నో అమ్మాయిని గదికి కొట్టుకొచ్చానని అనుమానపడతాడు" అని అన్నాడు.

దేన్నో వెతుకుతూ వున్నట్టు పరుపుచుట్టూ చాలాసేపు తిరిగాడు నేను వొంటరిగా మిగిలిపోయాను. చివరికతడు నాదగ్గరికి వచ్చాడు. అప్రయత్నంగా నిట్టూర్చి, అతన్ని చూడ్డానికి తల వెనక్కు తిప్పాను. నామనోభావాల్ని అణుచుకోడానికి పెద్దయుద్ధం చెయ్యసాగాను. అతడు తనచేతిని చాచి—

"ఇవిగో నీ హెయిర్ పిన్నులు! వీటికోసం తెగ వెతకవలిసివచ్చింది. దీపం ఉంటేనేం?... సరిలే! ఇహ త్వరగా వెళ్లు! లేకపోతే, ఖర్మంచాలక యెవడైనా వచ్చేను! ముందుతలుపు ఈసరికి వేసివుంటారు; దొడ్డిదారిగుండా బయట దిగవిడచి వసాను"

ఆ తర్వాత మేము ఒక్కమాటైనా మాటాడుకోలేదు. చూపులు యెక్కడ కలుస్తాయేమోనని యిద్దరమూ ముఖాలు తిప్పించుకున్నాము.

వీధిలోపడగానే కొంతమేరంవరకూ నా స్వాదృస్పృహలతో కేవలం యంత్రంలా నడిచిపోయాను. అప్పుడు హఠాత్తుగా నేను గట్టిగానూ, చల్లగానూ ఏదో తగిలినట్టయింది. ఉలిక్కిపడి చూచానంటే,—అతను నా చేతిలో పెట్టిన హెయిర్ పిన్నులు! కానే ప్రతిమలా ఆగిపోయి, రెప్పవెయ్యకుండా వాటివంక చూచాను. నిజంగా అవి హెయిర్ పిన్నులే!

వాటిని చేతిలోనే వుంచుకుని, ఎలాగో హాస్టల్ చేరుకున్నాను. నలిగి వాడిపోయిన చెర్రీబ్లాజం ఇంకా నా డ్రాస్ లోనే వుంది.

ఆ సుమధుర వసంతయామిని నగరంపైన ఇంకా రాజ్యం చేస్తూనేవుంది. ఉన్నత సౌధాగ్రాలమీద సుధాకరుడు ఇంకా చిరునవ్వుతూనేవున్నాడు. తెలిమబ్బుతునకలు నీలాంబరంలో ఇంకా అలానే వున్నాయి. పూరానరయెక్కడో పొగతెరలా దిశా చక్రం మసకమసకగా ఇంకా అలానే కనబడుతూ వుంది.

యాపుల్ బ్లాజంలోనుంచీ, బర్డ్ చెర్రీలోనుంచీ, శాద్వలస్థలాలలోనుంచీ, మధుర పరిమళం ఇంకా అలానే వస్తూవుంది......

తోపులోపలిభాగం క్షణానికో రూపం దాలుస్తున్నది. సూర్యుడు ప్రకాశిస్తున్నప్పుడు ఓరూపం: మబ్బుల చాటున మాటు మణిగి నప్పుడు ఇంకోరూపం. అంతా చిరునవ్వుతో వున్నట్టు కాసేపు తోపంతా వెలుగు! ఆ వెలుగులో బర్చ్‌మానులు తెల్లసట్టులా నిగనిగ లాడుతున్నాయి. రాలిపడివున్న చిన్న ఆకులన్నీ ఇంద్ర ధనస్సురంగులతో... మేలిమి బంగారంలా... మిలమిల మెరుస్తు న్నాయి; శిశిర ఋతువు ప్రవేశంవల్లవచ్చే మిగలబండిన ద్రాక్ష పండ్ల మిసిమితో ఫెరన్స్ కొమ్మలు — ఒకదాని మీదొకటి వాలుతూ-మనోజ్ఞంగా వున్నాయి....మళ్లీ అంతలోనే తోపంతా నీలంగా మారిపోతున్నది. వన్నెచిన్నెల రంగులన్నీ మాసిపో తున్నాయి; బర్చ్‌మానులు హేమంతసూర్యశీతలకిరణాలైనా సోకని హిమంలా వెలవెలబోతున్నాయి. చాటు చాటుగా... బెదురుబెదురుగా ... మళ్లీ సన్నతుంపర పడుతున్నది. కొంచెం రంగుమాసినా బర్చ్‌చెట్ల ఆకులు ఇంకా పచ్చగానేవున్నాయి. అక్కడక్కడ...చెదురుచెదురుగా... చిన్ని ఒంటరి బర్చ్ మొక్కలుమాత్రం యర్రగానో, బంగారు వన్నెగానో కనబడు తున్నాయి. అప్పుడే వానజల్లు స్నానంచేయించివెళ్లిన తోట కొమ్మల గుబురుగుండా మిలమిలజాలువారే మయూఖరేఖలలో ఈ బర్చ్‌మొక్క లెంత దేదీప్యమానంగా వుంటాయో మీరూ గమనించేవుంటారు. ఎక్కడా ఒక్క-పిట్టయినా కుయ్యాడంలేదు. ప్రతిది గూడు కట్టుకున్నది; గుడ్లను పొదుగుతున్నది. నూటికి, కోటికి ఒక్క రాబిన్‌పిట్టమాత్రం ఊరక్క గంటలా మోగుతూ వుంది.

బర్చ్‌తోపుకు చేరుకోడానికి ముందు నేను...నా కుక్కతో సహా...ఒక పాప్లర్‌తోపును దాటి వచ్చాను. పాప్లర్ చెట్లంటే, నాకు బొత్తిగా ఇష్టంలేదు ఆ లిలాక్‌రంగు మొదళ్లను చూస్తేనే,

లేచి, తిరిగి పిట్టలవేట ప్రారంభిద్దామని అనుకుంటూవుండగా నాకళ్లు చలనంలేకుండావున్న ఒక మానవవిగ్రహంమీద పడ్డాయి. రెప్పవాల్చకుండా, అలాచూశాను. ఆవిడ పల్లెటూరు పడుచు. నాకు షుమారు ఇరవైఅడుగుల దూరంలో కూర్చుని వుంది. చింతామగ్నంగా వున్నట్టు తల వంచివుంది. చేతులు మోకాళ్లమీద వున్నాయి. సగంతెరిచివున్న ఒక చేతిలో పెద్ద పూలగుత్తివుంది. ప్రతి శ్వాసనిశ్వాసానికీ ఆపువ్వులు ఆవిడ స్పర్శను మృదులంగా రాచుకుంటున్నాయి. తెల్లటిబ్లౌజును... మెడదగ్గరా, ముంజేతులదగ్గరా గుండీలుపెట్టుకున్నదానిని ...... వేసుకుంది. అది నడుము దగ్గరివరకు వచ్చి, అక్కడ చిన్నిచిన్ని ముడతలు పడుతున్నది. మెడలో రెండుపేటల పెద్ద పచ్చపూసల దండ వుంది. ఆవిడ పెద్ద అందకత్తెకాదుగాని, మాడ ముచ్చటగా లేక పోలేదు. బంగారుచాయతోవున్న తన నక్కని కుంతలాల్ని ఆవిడ రెండు పాయలుగా చీల్చి, రెండుజడలు వేసుకుంది. ఆ జడల మీద యెర్రటిరిబ్బన్ కట్టుకుంది. రిబ్బన్‌ను ఎంతక్రిందికి కట్టిం దంటే, దానిఅంచు దంతంలాతెల్లగావున్న ఆవిడ ఫాలభాగాన్ని తాకుతూవుంది. తక్కిన ఆవిడ ముఖమంతా లేత గులాబి రంగులో వుంది. వంచిన తలను వంచినట్టే వుంచడంవల్ల ఆవిడకళ్లు నాకు కనబడ్డంలేదు. కాని సన్నగా, వంపుగావున్న ఆవిడ కను బొమ్మలూ, నిడివిగావున్న ఆవిడ కనుపాపలూ మాత్రం నాకు కనబడుతూనే వున్నాయి; ఆవిడ చెక్కిలిమీద... కాంతివిహీనంగావున్న పెదవుల దగ్గరగా...ఒక కన్నీటిచుక్క తళతళలాడుతూవుంది. ముక్కు కొంచెం మొద్దుగానూ, గుండ్రం గానూ వున్నా, మొత్తంమీద ఆవిడ ముఖం అందంగానేవున్నదని చెప్పాలి. దానిలో మృదులత్వమూ, నమ్రభావమూ, విషాద చ్ఛాయా, తన కష్టాలను తలచుకోగా తనకే కలిగిన ఆశ్చర్యమిశ్రిత

షమూ కనబడుతున్నాయి. ఆవిడ ఎవరికోసమో ఎదురుచూస్తూ వున్నట్టుంది.

తోపులో ఏదో సవ్వడి అయ్యింది. వెంటనే ఆవిడ తలయెత్తి నలుదిక్కులకూ చూచింది. ఆవిడకళ్లు క్షణలేశం నాయెదట మెరిశాయి. అవి లేడికళ్లలా చేరడేసి వున్నాయి. ఏమి ఆ త్రళుకు! ఏమి ఆ సిగ్గు!! సవ్వడివచ్చిన వైపుకే తన దృష్టినంతా నిగుడ్చి నాలుగు నిమిషాలపాటు చెవులు రిక్కించి విని, దీర్ఘంగా నిట్టూర్చింది. తర్వాత నెమ్మదిగా తల తిప్పి వేసుకుని, పూర్వం కంటె ఇంకావంగి, పువ్వుల్ని పరీక్షింప సాగింది. ఆవిడ కను రెప్పలు ఎర్రబడ్డాయి; పెదవులు బాగా కంపిస్తున్నాయి; కను కొలకులనుంచి ఇంకో కన్నీటిచుక్క బయల్దేరి, చెక్కిలి మీదికి చేరి, మిలమిల మెరుస్తున్నది. ఈవిధంగా చాలాసేపు గడి చింది; పాపం, ఆ అమ్మాయి కూర్చున్న చోటినుంచి కదల్నే లేదు; అప్పుడప్పుడు చేతుల్నిమాత్రం కొంచెంగా కదుపుతూ వుంది; చెవులు రిక్కించి ఎక్కడినుంచి ఏమి సవ్వడివస్తుందో నని వింటున్నది. తోపులో ఇంకోసారి ఏదో కదులుతూ వున్న శబ్దం అయ్యింది; ఆవిడ బెదురుతూ అటువైపు చూచింది. ఈసారి శబ్దం ఆగి పోలేదు, అది అంతకంతకు దగ్గరిగా వినబడుతున్నది. చిట్టచివరకు గట్టి అడుగుల చప్పుడు వినబడింది. ఆవిడ హడా వుడిగా గుడ్డా గుడుసూ సర్దుకుంది. అదేమోగాని, ఆవిడధైర్యం ఒక్క సారిగా సడలి పోయినట్టుంది. లేకపోతే, కళు అలా అదురుతాయా? చెట్లగుబురుచాటునుంచి పురుషవిగ్రహ మొకటి కదిలివస్తున్నది. అటువైపే చూస్తూ, సంతోషసంభ్రమాలతో చిరునవ్వుతూ, లేవబోయినట్టుకనబడి, మళ్లీ యెంచేతనో ఆవిడ అంతలోనే విన్నబోయి, బిత్తరపడుతూ, యెత్తినతలను తిరిగి వంచి

వేసుకుంది. ఆతర్వాత అప్పటికి తన దగ్గరికివచ్చి నిలబడ్డ ఆపురుష వ్యక్తివంక దీనంగా... ప్రార్థనాపూర్వకంగా... చూచింది.

నేను దాగివున్న చోటినుంచి అతడివంక చూచాను. అతడి రూపురేఖావిలాసాలు హృదయంగమంగావున్నాయని చెప్పడానికి వీల్లేదు. చూడగా అతడు శ్రీమంతుడైనవాడి 'వేలెట్'గా కనబడుతున్నాడు. అతడి దుస్తుల్ని చూస్తే, నాజూకుగా వుండడానికి ప్రయత్నిస్తున్నట్టు కనబడుతున్నది. అతడు తెలిపసుపు రంగులోవున్న పొట్టి ఓవర్‌కోటు వేసుకున్నాడు. అది అతడి యజమాని తొడిగి తీసివేసిందిలావుంది. ఓవర్‌కోటుగుండీలను కిందినుంచి పైవరకూ పెట్టుకున్నాడు. గులాబిరంగు నెక్‌టై కట్టుకున్నాడు. జల్తారు అంచువున్న సిల్కు టోపీ పెట్టుకున్నాడు. టోపీని కనుబొమలపైవరకూ జారలాగాడు. తెల్లటి అతడి మెడకున్న గుండ్రటి కాలర్, మెడనూ, చెక్కిళ్లనూ, నొక్కుపడేక రుండా, అతడి చెవులకుకూడా రాసుకుంటూ వుంది. గంజితో బిర్రబిగిసివున్న అతడి చేతికాలర్, ఎర్రగానూ, కంకరటేకరగానూవున్న అతడి వేళ్లమీద పడుతున్నది. చేతివేళ్లకు వెండి, బంగారం వుంగరాలున్నాయి. ఆ వుంగరాలకు చౌకబారు రాళ్లేవో తాపడంచేసివున్నాయి. ఎర్రగానూ, నవనవలాడుతూనూ, నదురూ బెదురూ లేకుండానూవున్న అతడి ముఖాన్ని చూస్తే, తోటిరంగవాడికెవడికైనాసరే వొళ్లు మండుతుంది. కాని, అదేమిటోగాని ఆడవాళ్లకు ఇలాంటి ముఖాలంటేనే మోజు. చాలా సొగసుగానూ, అసహ్యభావముతోనూ వున్నట్టు కనపడ్డానికి కాబోలు, అతడు తన పిప్పిరి కళ్లను మాటిమాటికి మూస్తున్నాడు; బొమలు ముడివేస్తున్నాడు; పెదవులచివళ్లను కిందికి జారుస్తున్నాడు; ఆవలిస్తున్నాడు; యాదాలాపంగా చేస్తున్నట్టు తన రాగిరంగుఉంగరాల జుట్టునూ, గుబురుగా పెరిగిన మీసాలనూ

సవరించుకుంటున్నాడు. ఒక్క మాటలో తాను ఎక్కడినుంచో దిగివచ్చినవాడిలా అతడు నటిస్తున్నాడు. తనకోసం కనిపెట్టుకున్న ఆ పల్లెటూరిపడుచు కనబడగానే, అతడు ఈ వికారాల్ని సాగించాడు. తీరిగ్గా అంగలు పంగలువేస్తూ, ఆవిడదగ్గరికి వచ్చి, కాసేపు మాటా మంతీ లేకుండా నిలబడి, భుజాల్ని ఎగరవేసి, చేతుల్ని కోటుజేబుల్లోవేసి, ఆ అమ్మాయి వంక నిర్లక్ష్యంగా వో చూపువిసిరి, ఆపైన పక్కనే నేలమీద చతికిలబడ్డాడు.

"ఏం?" అని ముఖాన్ని పక్కకు తిప్పివేసుకుని, పాదాన్ని ఆడిస్తూ, ఆవలిస్తూ అన్నాడు. ఇది అతడి పలకరింపు! "చాలా సేపటినుంచి యెదురుచూస్తున్నావా?"

ఆ అమ్మాయి వెంటనే జవాబివ్వలేక పోయింది. "ఔను, చాలా సేపటినుంచి, విక్టర్ అలెగ్జాండ్రిచ్" అని చివరికెలాగో అంది, వినీవినబడని గొంతుతో.

"అలాగా!" అంటూ అతడు టోపీనితీసి, మహాదర్జాగా తన వుంగరాలజుట్టును, సరిచేసుకుని, గంభీరంగా నలుదిక్కులూ చూచి, తిరిగి అతిజాగ్రత్తగా టోపీని పెట్టుకున్నాడు. "నేను ఈ మాటే మర్చిపోయాను. పైగా, చినుకు పడుతున్నదాయె!". మళ్లీ అతడు ఆవలించాడు. "నేను చెయ్యవలసింది తలమోపెడు పనివుంది. అతడెందుకో చాలా చికాకుగా వున్నాడుకూడా! మేము రేపే ప్రయాణంకడుతున్నాము..."

"రేపా?" అని చలనం యెరగని బెదురు చూపుతో ఆ అమ్మాయి అడిగింది.

"ఔను, రేపే. అబ్బ! మారాం చెయ్యబోకు, మరి!" అంటూ ...ఆవిడ కంపిస్తూ తలవంచివేసుకోవడంచూచి...అతడు విసుక్కున్నాడు. "అరే! ఏడుపుకూడా సాగించావూ! అకులీనా! ఇదుగో,

ఫ్రాయక్లోమంటూ వుంటే! ఉప్ఫ్! నేను నాన్ని సహించలేనని నీకు తెలియదూ?" (ఇలా అంటూ అతడు తన చొట్టముక్కు నొక సారి నలుపుకున్నాడు") "ఊరుక్కోపోయావంటే నే నిప్పుడే వెళ్లిపోతాను. ఏమిటి అసహ్యంగా ఈ యేడుపు?"

"సరిలే, ఊరుకుంటాను" అని అకులీనా గబగబా అంది, కన్నీళ్లను దిగమింగడానికి ప్రయత్నిస్తూ. "అయితే మీరు రేపు వెళ్లిపోతున్నారన్నమాట?" అని కాసేపైన తర్వాత ఆవిడ అడిగింది. "మళ్లీ మనం కలుసుకునే భాగ్యం పడుతుందా?"

"నో! తప్పకుండా! వచ్చేయేడు కాకపోతే, ఆ పైయేడు కలుసుకుంటాం. మా యజమాని సేంటుపీటర్సుబర్గులో వుద్యోగంలో చేరతాడట!" అని మాటల్ని సగం మింగుతూ అతడు సంభాషణ సాగించాడు. "మేము విదేశాలకు కూడా వెడతామేమో!"

"నువ్వు నన్ను మరిచిపోవుకదూ?" అని అకులీనా దీనంగా అంది.

"అప్ఫ్! అదేమిమాట! నేను నిన్ను మరిచిపోను. అయితే, నీవుమాత్రం పిచ్చి పిచ్చి భయాలు పెట్టుకోకుండా, తెలివిగా నడుచుకోవాలి. మీ నాయన చెప్పినమాట వింటూవుండు. నిన్ను నే నెన్నటికీ మరిచిపోను; నామాట నమ్ము" అంటూ నేలమీదికి వొరిగి, మళ్లీ ఆవలించాడు.

"విక్టర్ అలెగ్జాండ్రిచ్! నన్ను మరిచిపోబోకే!" అంటూ ఆవిడ దీనంగా వేడుకుంది. "నేను నిన్నెంతగానో ప్రేమించాను. నన్ను తప్ప ఏమీ ఆశించలేదు. నీవేమో మానాన్నమాటప్రకారం నడుచుకోమని బుద్ధులు చెబుతున్నావ్! మానాన్నమాట వినడమెలా, విక్టర్ అలెగ్జాండ్రిచ్?"

చేతులు రెండూ తలకింద పెట్టుకుని వెల్లకిలగా పడుకున్న అతడు "చిక్కేముంది?" అని అన్నాడు. ఈమాటలు అతడి పొత్తికడుపులోనుంచి వచ్చాయా అన్నట్టున్నాయి.

"చిక్కేమిటో నీకుమాత్రం తెలియదూ, విక్టర్ అలెగ్జాండ్రిచ్?"

ఇంతే, ఇహ ఆవిడ మాట్లాడలేకపోయింది. విక్టర్ తన గడియారం గొలుసును చేతివేలుచుట్టూ చుట్టుకోసాగాడు.

"అకులీనా! నీవు వెర్రిబాగులదానివి కావు" అని చివరికన్నాడు. "అంచేత పిచ్చిపిచ్చిగా మాట్లాడబోకు. నేను చెబుతున్న మాటలు నీ మేలుకోసమే! నీవు వెర్రిబాగులదానివి కావు; పల్లెటూరుపిల్లవు కూడా కావు; అయినా, నీకు చదువూ సంధ్యా లేదు. అంచేత నీవు పెద్దవాళ్లు చెప్పేమాట వినాలి."

"వినడమంటే మాటేలా, విక్టర్ అలెగ్జాండ్రిచ్?"

"నీదంతా వెర్రిగాని, నీకు భయపడ్డానికేముంది? ఏమిటది పట్టుకొచ్చావ్?" అని అంటూ అతడు పరికించం దగ్గరికి జరిగాడు. "పువ్వులా?"

"ఊం! పువ్వులే", అంటూ అకులీనా విచారంగా జవాబు చెప్పింది. మళ్ళీ అంతలోనే కొత్త ఉత్సాహాన్ని తెచ్చుకుని, "కొన్ని ఫీల్డ్‌టాన్‌సీస్‌ను కోసి తెచ్చాను," అంటూ ఆవిడ అందుకుంది. "ఆవుదూడలకు ఇవంటే చెడ్డ ఇష్టం. ఇదుగో! దీన్ని చూడు! ఎంత అందమైనపువ్వో! ఇంత అందమైన పువ్వును ఇంతకుముందెన్నడూ నేను చూడలేదు. ఇవిగో, ఇవి ఫర్‌గెట్-మి-నాట్సు. వీటిని నీకోసం కోసి తెచ్చాను." ఇలా అంటూ టాన్‌సీస్ అడుగునుంచి, గడ్డిపోచతో చిన్నదండగా కట్టిన కార్న్‌ఫ్లవర్సును తీసి, "నీ కివి కావాలా?" అని అడిగింది.

విక్టర్ అలసంగా చేతిని చాచి, పువ్వుల్ని అందుకుని, లాంఛనంగా వాటి నోసారి వాసన చూచి, కొండమీదినుంచి అప్పుడే దిగివచ్చినవాడిలా నీరసంగా చూస్తూ, వాటిని వేలిమట్టూ చుట్టి నలిపివెయ్యసాగాడు. అకులీనా అతడివంక తేరిపార చూచింది. ఆ నీలినేత్రాలలో ప్రేమ, భక్తి, విధేయత తొలుకాడుతూ వున్నాయి. అతడంటే, ఆవిడకు చెడ్డభయంకూడా! ఆవిడ భక్తి శ్రద్ధల్ని కాదనలేక ఈ బాధంతా భరిస్తున్నవాడిలా...గొప్ప సుల్తాన్‌లా...అతడు శయనించివుంటే, ఆవిడ అతణ్ణి మనసారా కడసారి చూపుచూస్తూ, అంతరంగికంగా వీడ్కోలుకు సిద్ధపడుతూవుంది. అసహనంతో చూస్తూవున్నట్టూ, నిర్లక్ష్యంగా వున్నట్టూ కనబడాలని ప్రయత్నిస్తున్నా, కందగడ్డలాంటి అతడి మొహంలో స్వార్థసిద్ధివల్లకలిగే సంతృప్తిభావం స్పష్టంగా కనబడుతూవుంది. ఈ క్షణంలో అకులీనా అప్సరసగా కనబడింది. ప్రగాఢ ప్రేమవిశ్వాసాలతో ఆవిడ ఆత్మ లేచి వెళ్లి, అతణ్ణి ఆలింగనం చేసుకుంటూవుంది.' ఇహ, అతనో? అతడు కార్న్ ఫ్లవర్స్‌ను గడ్డిమీద జారవిడిచి, తన కోటు పక్క జేబులోనుంచి ఇత్తడి ఫ్రేంతోవున్న గుండ్రటి అద్దాన్ని తీసి, దాన్ని తన కంటికి తగిలించుకోవాలని ప్రయత్నించాడు గాని, ఎంత తన్నులాడినా అది నిలవనే లేదు. బొమల్ని ముడిచాడు; చెక్కిలిని ఎగదట్టాడు; ముక్కుతో పట్టుకుందామనికూడా ప్రయత్నించాడు; కాని ప్రతిసారీ అది జారి చేతిలో పడిపోయింది.

"ఏమిటది?" అని అకులీనా అడిగింది, ఆశ్చర్యపడుతూ.

"కంటికద్దం" అని అతడు...నోటిముత్యాలు రాలి పడతాయా అన్నట్టు...జవాబు చెప్పాడు.

"ఎందు కిది?"

"పక్కగా చూడ్డానికి"

"ఏదీ, నన్ను చూడనివ్వు"!

విక్టర్ విసుగ్గా మొహం చిట్లించాడుగాని, ఆవిడచేతికి కంటిఅద్దాన్ని ఇచ్చాడు. "జాగ్రత్త సుమా! పగలగొట్టేవ్!"

"భయంలేదు; పగలగొట్టనులే!" జడుస్తూ జడుస్తూ దాన్ని కంటిదగ్గర పెట్టుకుని "నాకేమీ కనబడ్డంలేదే?" అని అడిగింది అమాయకంగా! "ఓకన్ను మూయ్యి!" అని అతడు కోపంవచ్చిన బడిపంతులులా అన్నాడు.

ఏకంటిముందు అద్దాన్ని పెట్టుకుందో, ఆ కంటినే ఆవిడ మూసింది.

"అబ్బే! ఆ కన్ను కాదు! స్టుపిడ్‌లావున్నావ్! రెండోదాన్ని మూయ్యాలి" అని విక్టర్ అన్నాడు. ఇలా అని, ఆ అమ్మాయి తన తప్పు దిద్దుకోకముందే, ఆవిడ దగ్గర్నుంచి కంటిఅద్దాన్ని లాక్కున్నాడు. అకులీనా సిగ్గుపడింది; చిరునవ్వుతూ తలతిప్పి వేసుకుంది.

"ఇది నాలాంటివాళ్ళకోసం కాదుగనులే!"

"నిశ్చయంగా!"

పాపం, ఆ అమ్మాయి మారు మాట్లాడలేదు. ఒక్క నిట్టూర్పు మాత్రం విడిచింది.

"నీవులేనిదే నేనెలా బత్కగలను, విక్టర్ అలెగ్జాండ్రిచ్!" అని ఆవిడ హఠాత్తుగా అంది.

విక్టర్ కంటి అద్దాన్ని తుడిచి, తిరిగి దాన్ని తన జేబులో పెట్టుకున్నాడు.

"నిజమే!" అని అతడు చివరి ఎలాగైతేనేమి జవాబిచ్చాడు. "మొట్టమొదట్లో నీకు కష్టమే అనిపిస్తుంది." బుజ్జగింపుగా అతడు

ఆవిడ భుజంమీద చెయ్యివేశాడు. మాట్లాడకుండా ఆవిడ తనభుజంమీది చేతిని తీసి దాన్ని ముద్దుపెట్టుకుంది. "నీవు నిజంగా మంచిపిల్లవు". అంటూ ఆత్మసంతృప్తితో కూడిన చిరునవ్వుతో అతడు మళ్లీ అందుకున్నాడు. "కాని ఏమిటికి చెయ్యడం? నీవే ఆలోచించు! మా యజమానీ, నేనూ ఇక్కడే వుండిపోలేము. నీవైనా ఈ మాట ఒప్పుకుంటావ్ కదూ? శీతాకాలం వస్తున్నది. శీతాకాలాన్ని పల్లెటూళ్లో గడపడం దుస్సాధ్యం. ఈ సంగతి నాకూ తెలుసు. పీటర్సుబర్గ్‌లో అయితే, అధోగణే వేరు. అక్కడివిషయాల్ని నీవు కలల్లోనైనా వూహించలేవు, వెర్రిదానా! ఆ ఇళ్లు, ఆ వీధులు, ఆ సంఘం, ఆ మర్యాదలు—అబ్బో! వాటినిగురించి చెప్పడ మెవడి తరం!" పసిపిల్లలా పెదవుల్ని కొంచెంగా విప్పి అకులీనా అతడిమాటల్ని మహాశ్రద్ధగా వింటున్నది. "అయినా, నీకు ఈమాటలన్నీ చెప్పడం దేనికి? నీకు ఇవేమైనా అర్థమైయేడుస్తవా, చెపితేనా?" అంటూ అతడు ఇటు నుంచి అటు దొర్లాడు.

"అర్థంకాకేమి? అర్థమవుతూనే వున్నాయి, విక్టర్ అలెగ్జాండ్రిచ్!"

"నీ మొహం కాదూ?"

అకులీనా చిన్నబుచ్చుకుంది. "మునుపెన్నడూ నీవు నన్నిలా మాటలని యెరగవు, విక్టర్ అలెగ్జాండ్రిచ్" అని వంచిన కళ్లను యెత్తకుండా అంది.

"మునుపు? మునుపు! దేశ్యం మొహం! మునుపట!" అని అమితకోపంగా దీర్ఘాలు తీశాడు. ఉభయులూ కాసేపు మౌనంగా వుండిపోయారు.

"అయినా, నే నిక బయలుదేరిపోవాలి" అని లేవబోతూ విక్టర్ అన్నాడు.

"కాసేపు ఆగు!" అని అకులీనా వేడుకుంది.

"ఎందుకు?"

"ఆగమని బ్రతిమాలుతున్నానుగా!" అని అకులీనా ప్రతిదు లాడింది.

విక్టర్ మళ్లీ నేలమీదికి వొరిగి, ఈల వెయ్యసాగాడు. అకులీనా రెప్పవెయ్యకుండా అతడివంకే చూచింది. ఆవిడ హృదయం క్షోభిల్లుతూవున్న సంగతి నాకు స్పష్టంగా కనబడుతూనేవుంది. అధరోష్ఠం కంపిస్తూవుండగా; చెక్కిళ్లు అరుణవర్ణాలైనాయి.

"విక్టర్ అలెగ్జాండ్రిచ్!" అని ఆవిడ విచారంగా అంది. "నీవు పాపంచేస్తున్నావ్, విక్టర్ అలెగ్జాండ్రిచ్!"

"పాపమంటే?" అని అతడు బొమలు ముడివేస్తూ అన్నాడు. తలకొంచెం పైకెత్తి, ఆవిడ వైపుకు తిరిగాడు.

"పాపం, పెద్దపాపం, విక్టర్ అలెగ్జాండ్రిచ్! వెళ్లిపోవడానికి ముందు, దిక్కుమాలిన నన్ను ఓదార్చడానికి నీ వొక్కమాటంటే——"

"ఏమనమంటావ్?"

"ఏమో, నాకు తెలియదు. నాకంటె నీవు బాగా తెలిసినవాడవు కాదూ, విక్టర్ అలెగ్జాండ్రిచ్! ఎలాగూ వెళ్లిపోతున్నావు. ఒక్కమాట అని వెడితే?... ఇంత బాధపడ్డానికి నే నేమి తప్పుచేశాను?"

"ఇంతకూ ఈ గొడవేమిటి? నేనేమనగలను?"

"ఒక్కమాట అని వెడితే......"

"మళ్లీ పాడిందేపాట?" అని విసుక్కుంటూ అతడు లేచాడు

"కోప్పడకు, విక్టర్ అలెగ్జాండ్రిచ్!" అని ఆవిడ ఆగుర్దా పడుతూ, కన్నీరుకారుస్తూ బ్రతిమలాడింది.

"నేనేమీ కోప్పడ్డంలేదు,...నీవే వెర్రివేషాలు వేస్తున్నావు! నీకేమికావాలి? నేను నిన్ను పెళ్లాడలేను. నీవేచెప్పు,—ఆడ గలనా? పోతే, ఇహ నేమి కావాలంటావ్? చెప్పు!" జవాబు కోసంఅన్నట్టు అతడు ఆవిడవంక రెప్పవెయ్యకుండా చూచాడు.

"నాకేమీ వద్దు; వద్దు" అని ఆవిడ తడబడుతూఅంది. "కాని, వెడుతూవెడుతూ ఒక్కమాట అనిపోతే!"

అకులీనాకళ్ల వెంట కన్నీరు కాల్వకట్టింది.

"సరి సరి, ఏడ్పుకూడా సాగించిందే!" అని నిర్లక్ష్యంగా అంటూ విక్టర్ టోపీని కళ్లమీదికి లాక్కున్నాడు.

"నాకేమీ అఖ్ఖర్లేదు", అని ఆవిడ వెక్కి వెక్కి యేడుస్తూ, ముఖాన్ని చేతుల్లో కప్పుకుంది. "ఇహ నే నెలా బతగ్గలను? అయ్యో! బతికడమెలా? దిక్కులేందాన్ని,—ఇహ నాగతి ఏమౌతుంది? రెక్కలులేని పక్షిని,—ఎవడికో నా కిష్టం లేనివాడికి కిచ్చి కడతారు! నా ఖర్మం కాలింది!"

"ఆఁ! పోదూ!" అని కాలుకాలిన పిల్లిలా కలవరపడుతూ, విక్టర్ వినీవినబడనట్టు అన్నాడు.

"ముచ్చటగా ఒక్కమాటమాత్రం అనివెడితే! ఒక్కమాట: 'అకులీనా...నీమీద...నాకు...ప్రేమ...'"

హఠాత్తుగా పొంగిపొర్లివచ్చిన దుఃఖంతో అకులీనా మాట తెగిపోయింది. గడ్డిమీద బొక్క బోర్లాగాపడి ఆవిడ కుమిలి కుమిలి ఏడ్చింది. ఆవిడ దేహమంతా దుఃఖావేశంతో కంపిల్లింది. ఇంత వరకూ అతికష్టంమీద తొక్కివుంచిన వేదనంతా కన్నీటి రూపంతో బాహిగిల్లింది. విక్టర్ కాసేపు ఆవిడదగ్గర నిలబడి, ఆతర్వాత ఓసారి తన భుజాల్ని ఎగరవేసి, వెనక్కుతిరిగి, పెద్ద పెద్ద అంగలు పెట్టుకుంటూ వెళ్లిపోయాడు.

కొన్ని నిమిషాలు గడిచాయి. తనకుతానే సంబాళించుకుని, తల యెత్తి నలుదిక్కులకూ చూచి, చప్పట్లు కొట్టింది; పరిగెత్తుకు వెళ్లి అతణ్ణి పట్టుకోవాలని అనుకుందిగాని, పాపం ఆవిడకు అడుగు పడలేదు. తడబడిపోయి, మోకాళ్లమీదికి వొరిగి పడిపోయింది. ఇహ దీన్ని భరించలేక నేను ఆవిడ సహాయానికి పరిగెత్తాను. కాని నేను దగ్గరికి చేరకముందే తిరిగి ఆవిడకు హఠాత్తుగా వోపిక చేరుకున్నట్టుంది. ఎంచేతనంటే,—కొద్దిగా మూలుగుతూ ఆవిడ చప్పునలేచి, పువుల్ని అక్కడే వదలిపెట్టి, చెట్లచాటున మాయమైంది.

క్షణలేశం నేనక్కడనిలబడి, కారన్‌ఫ్లవర్స్ గుత్తిని తీసుకుని, అడవిబయటికి నడిచివెళ్లాను. సూర్యుడు కళావిహీనంగావున్న పశ్చిమాన కుంకబోతున్నాడు. రాత్రి ప్రవేశించడానికి ఇంకొక అరగంటమాత్రమే వ్యవధి వుంది. సంధ్యారాగం అప్పుడప్పుడే కొంచెంగా అలుముకుంటూవుంది. పచ్చటి పొలాల మీదగా పెద్దగాలి తోలుతూవుంది. ఆగాలికి చిన్ని ఎండుటాకులు నన్ను దూసుకుంటూ రోడ్డుపైన దొర్లుకు పోతున్నవి. పొలాలపక్కన ఓపెద్ద గోడలావున్న అడవి, ఆగాలిలో రెపరెప కొట్టుకుంటున్నది. పండురంగుతిరిగిన గడ్డిమీదనూ, ఫెగన్సుమీదనూ వున్న సాలీడుగూళ్లు మిలమిల మెరుస్తున్నాయి. నాగుండె బరువెక్క సాగింది. కళావిహీనమైవున్న ప్రకృతిచిరునవ్వులో ఆసన్న

శీతాకాలాన్ని గురించిన భయం తొంగి చూస్తున్నది. నాపైగా చాలా యెత్తున ఒక కాకి రెపరెప రెక్కల్ని కొట్టుకుంటూ ఎగిరి వెళ్లింది. వెళుతూ, వెడుతూ నావంక వోరగా చూచి, "కాఁ! కాఁ!" అని అరిచి, అడవి అవతల మాయమైంది. దగ్గిర్నే వున్న గరిస దగ్గర్నుంచి యెగిరివచ్చి, ఒక పెద్దపావురాయిలగుంపు నాకు కొంచెం అవతలగా... గిర్రున ఒక చక్రం కొట్టిన మీదట... వాలి, మేతకోసం పొలాన్ని గాలించసాగాయి. కొండ గుట్టపైగా ఎవడోగాని లటలటకొట్టుకుంటున్న బండిని తోలుకు పోతున్నాడు.

నేనింటికి తిరిగివచ్చాను. కాని, చాలా కాలంవరకూ నాకు అకులీనాదైన్యరూపం కళ్లకు కట్టినట్టుగానే వుంది. ఏనాడో చప్పగా వడిలిపోయినా, ఆ కారన్ ఫ్లవర్సు నాదగ్గర ఇంకా భద్రంగానే వున్నాయి.

## ఫెడర్ సోలోగబ్

## (1863—1928)

# పీపా చక్రం

ఒక నాటి వుదయం నిర్జనంగావున్న ఒక పట్టణవీధి వెం
బో అమ్మా, నాలుగేళ్ల కుర్రవాడూ నడిచి వెడుతున్నార
కుర్రవాడి మొహాన సంతోషమూ ఆరోగ్యమూ తొణికాడుతూ
వున్నాయి. ఆవిడ మంచి యౌవ్వనంలో వుంది; చక్కని దుస్తుల్ని
ధరించింది. సౌఖ్యాతిరేకంకొద్దీ చిరునవ్వుతూ, ఆవిడ తన
ముద్దు కొడుకువంక అప్యాయంగా చూస్తూవుంది. కుర్రవాడు
పెద్ద చక్రాన్ని...సరి కొత్తదాన్ని...తోసుకు వెడుతున్నాడు.
చిన్నారి పొన్నారి అడుగులతో చక్రంవెంట పరుగెడుతూ,
ఆ చిట్టిపాప నవ్వుతున్నాడు; కేరుతున్నాడు; చేతిలో వున్న
కర్రను గిర్రున తిప్పుతున్నాడు.

ఏమి అపార ఆనందం! కాసేపటిక్రితం వాడికి ఏచక్రమూ
లేదు! కాని, ఇప్పుడో? రంయ్యిమంటూ అది ఎంచక్కా
దొర్లుకుపోతూవుంది? ఏం సరదాగావుంది?

ఇంతకుముందు ఆ వీధిలో మనకేమీ విశేషం కనబడలేదు!
కాని, ఇప్పుడు ఆ కుర్రవాడితో? అంతా కొత్తే! ఆ నిర్జన వీధి-
ఆ ప్రాతఃసూర్యుడు-సుదూరంనుంచి వినవచ్చే సముద్ర
ఘోషలా పట్టణమధ్యభాగంనుంచి వస్తున్న ఆ హోరు-ఆ బాలు

డికి అంతా నవీనమే! అంతా నిర్మలమే! అంతా ఆనంద పూరితమే!

ఔను, అంతా నిర్మలమే! పెద్దవాళ్లు వక్రమార్గాన కొట్టే వరకూ పసిపాపలకు ప్రతి వొక్క దానిలోనూ మంచేగాని, చెడు కనబడదు!

రెండుదార్లు కలిసేచోట ఒక ముసలివాడు ఎదురయ్యాడు. అతడిగుడ్డలు మురిగ్గా వున్నాయి; అతడి చేతులు మొరటు తేలి వున్నాయి. తల్లీ బిడ్డలకు దారి యివ్వడానికి అతడు గోడు పక్కకు వొదిగి నిలుచున్నాడు. పుత్రవాణ్ణి చూచేసరికి ముసలి వాడి కాంతిలేని కళ్లలోకి వెలుగూ, అతడి ముడిపడిన పెదవుల పైకి చిరునవ్వూ వచ్చాయి. అతడి బట్టతలలో ఏవేవో వూహలు పుట్టసాగాయి కూడా!

“శ్రీమంతుల బిడ్డ! ముద్దులు మూటగడుతున్నాడు! ఏం చక్కగా ఆడుకుంటున్నాడు! ఏ మనుకుంటున్నావో, శ్రీమంతుల బిడ్డ!” ఇవే అతడి వూహలు!

అయితే, ఒక్క విషయమాత్రం ఆ ముసలివాడికి అర్థం కాలేదు. అది అతడికి పెద్దవింతగా తోచిందికూడా. అప్పు డప్పుడు ఒక్కటి చావకపోతే... గారాబంగా చూస్తే... పిల్లలు చెడిపోతారని అంటారు గదా! మరి ఈ అమ్మ తన కొడుకును భయభక్తులలో పెట్టదే! కేకలు వెయ్యదే? చివరకుబెదిరించ నైనా బెదిరించదే? ఇది విచిత్రంగానే వుంది సుమా!

ఆవిడ ఏం చక్కని దుస్తులు వేసుకుంది! ఎంత అందంగా వుంది! ఔను, ఆవిడ కేమిలోటు? సకల భోగభాగ్యాలతో సుఖంగా జీవిస్తూవున్నట్టుంది.

తాను-ముసలివాడు-చిన్నతనంలో ఏసుఖాన్ని యెరగడు. ఇప్పుడైనా అనుభవించి యేడుస్తున్నది ఏమీలేదు. అయితే, దెబ్బలూ ఆకలీ తప్పింది. ఆరోజుల్లో...అబ్బ!...దెబ్బలు! ఆకలి! చలి! అప్పుడు తమకు తోపుడు చక్రాలూలేవు; కలిగిన వారి బిడ్డలకుండే ఇతర ఆటవస్తువులూలేవు. మొత్తంమీద జీవిత

మంతా శ్రమతోనూ, చికాకుతోనూ, కడుపుమంటతోనూ గడిచి పోయింది. జ్ఞాపకం వుంచుకోదగింది ఏమీ లేదు,—చివరకు ఒక్క సుఖానుభూతి అయినా!

కుర్రవాణ్ణిచూచి బోసి నోటితో ఇంకా చిరునవ్వు నవ్వుతూనే వున్నాడు. అయినా, అతడిలో ఓర్వలేనితనం పుట్టింది. "ఏమిటి ఆ విధవచక్రం!" అని అనుకున్నాడు. ఓర్వలేనితనం వల్ల అతడికి ఇహ ఆకుర్రవాణ్ణి చూడ్డంఅంటే విసుగు అనిపించింది. గొణుగుకుంటూ తన దారిని తాను ఫేక్టరీకి వెళ్ళిపోయాడు. అతను పెరిగిందీ, పెద్దవాడయిందీ ఆ ఫేక్టరీలోనే! ఫేక్టరీకివెళ్ళి పనిలో చేరినా, ఆరోజంతా ముసలివాడి మనస్సు అప్రయత్నంగా ఆబాలుడిపై పులకే పరిగెత్తింది.

నవ్వుతూ, కేరుతూ, చిట్టిపొట్టి అడుగులు పెట్టుకుంటూ, ఆపాప చక్రంవెంట ఎంచక్కాగా పరిగెత్తాడు! మెంగలి పొట్టాలలా ఆచిన్నికాళ్లు ఎంతముద్దుగా వున్నాయి!

ఆనాడంతా ఫేక్టరీ యింజన్ల రొదలో ముసలివాడు ఆకుర్రవాణ్ణిగురించీ, వాడి చక్రాన్నిగురించీ ఆలోచిస్తూనే వున్నాడు. ఆరాత్రికూడా అవే కలలు!

## 3

తెల్లవారింది; అయినా, ముసలివాడి కలలు కరిగిపోలేదు. యంత్రాలు గిరగిర తిరుగుతున్నాయి. అలవాటుపడిన చేతులేమో...ఆలోచనతో అవసరంలేకుండా...అవి తమ పని తాము చేసుకుపోతున్నాయి. మనస్సు స్వాప్నిక జగత్తులలో విహరిస్తూవుంది; పెదవులమీద చిరునవ్వు తాండవిస్తూవుంది. దుమ్ము మంచుతెరలా కమ్మడంవల్ల ఫేక్టరీఅంతా మసకమసకగా కనబడుతున్నది. కప్పుదగ్గర కప్పీమీదినుంచి కప్పీమీదకు బెల్టులు బుసలుకొడుతూ తిరుగుతూవున్నాయి. గోడమూలలు చీకటిముసుగులో మరుగుపడ్డాయి. కూలీలు భూతాలుగా నడయాడుతూ వున్నారు. ప్రతిధ్వనిల్లుతూవున్న ఆయంత్రాల వెర్రిసంగీతంలో ఒకరిమాట ఒకరికి వినబడ్డంలేదు.

ముసలివాడికి తానో చిన్న కుర్రవాణ్ణిఅనీ, తనతల్లికూడా శ్రీమంతురాలనీ, తనకుకూడా ఆడుకోడానికి తోపుడుచక్రమూ, కర్రా వున్నాయనీ, తాను కర్రతో చక్రాన్ని తోసుకుపోతున్నాననీ అనిపించసాగింది. తాను తెల్లటిదుస్తుల్ని వేసుకున్నాడట,-తన చిన్నికాళ్లు కొంగలిపొట్లాలలా వున్నాయట...

రోజూ అదే పని, రోజూ అదే కల!

## 4

ఒకనాటి సాయంకాలం ఇంటికి తిరిగివస్తూవుండగా బజారులో ముసలివాడికి పాతపీపాచక్రం వొకటి కనబడింది అది వంకరటింకరగావుంది; బాగా తుప్పుకూడాపట్టింది. దాన్ని చూడగానే అతడు ఆనందాతిరేకంతో కంపించిపోయాడు; అతడి గాజుకళ్లలో గిర్రున నీళ్లుకూడా తిరిగాయి. వెంటనే అతడికి అవ్యక్తమైనకోర్కె యేదో కలిగింది. బహు జాగ్రత్తగా వీధి నాలుగుమూలలకూ పరకాయించి చూశాడు; కిందికివంగాడు. వణుకుతున్న చేతుల్తో చక్రాన్ని తీసుకుని, సిగ్గుపడుతూ, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ ఇంటికి పట్టుకుపోయాడు.

ఎవ్వరూ అతణ్ణి చూడనూలేదు; ఇదేమిటని అడగనూలేదు. అయినా, అడిగేవరకూ ఎవడికేమి పనిపట్టింది? ఎందుకూ పనికిరాని పాతపీపాచక్రాన్ని ఎవడో ముసలిముండావాడు పట్టుకుపోతూవుంటే. ఈ మహాద్భాగ్యాన్ని గమనించేవాడెవడుంటాడు?

అయినా, ముసలివాడు దాన్ని చాటుగాపెట్టుకు పట్టుకుపోయాడు. భయంతో గజగజలాడాడు. అయినప్పటికీ ముసిముసినవ్వు మానలేదు దాన్ని యెందుకు తీసుకున్నాడో, యెందుకు ఇంటికి పట్టుకువెళ్లాడో అతడికే తెలియదు. అది అచ్చంగా అకుర్రవాడి చక్రంలావుంది. అంచేతనే దాన్ని పట్టుకువెళ్లాలనిపించింది.

చక్రాన్నిగురించి కేవలం కలలుగనడంకంటే, దాన్ని కళ్లారా చూడగలగడమూ, చేత్తో తాకగలగడమూ యెక్కువ ఆనందదాయకం కాదూ?

చాలారోజులపాటు ముసలివాడు ఆ పీపా చక్రాన్ని ప్రక్కలో పెట్టుకు పడుకుంటూవచ్చాడు ఉండిఉండి దాన్ని పైకితియ్యడమూ, దాని వంకే ఆప్యాయంగా చూడ్డమూ అతనికి పరిపాటి అయిపోయింది. తుప్పుపట్టిన ఆపాతపీపాచక్రం అతడికి అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగించసాగింది; నవ్వుతూ, కేరుతూ, గెంతుతూపోయిన ఆ బాల్యాన్నిగురించిన కల నిజంలా తోచసాగింది.

## 5

ప్రాతఃకాలం. అరుణోదయం అవుతూవుంది. పక్షులు గూళ్లలోనుంచి బయటికివచ్చి, రోజా కంటేకూడా మంజులంగా పాడుతూవున్నాయి. ఆనాడు ముసలివాడు చాలా పెందలాడే లేచి, తన పీపాచక్రాన్ని పుచ్చుకుని, పట్టణం వెపలికి నడిచివెళ్లాడు.

దగ్గుతూ, కాళ్ళీడ్చుకుంటూ వెళ్లి వెళ్లి, అడవిని చేరుకున్నాడు. అడవిలోని గంభీరనిస్తబ్ధత అతడికి అర్థంకాలేదు; పరిమళాలు వింతగాతోచాయి; పురుగులు ఆశ్చర్యాన్ని కలిగించాయి; మంచుముత్యాలు స్వాప్నిక జగత్తును స్ఫురింపచేశాయి అక్కడ దుమ్మూలేదు; హోరూలేదు. చెట్లసందులలో అద్భుతమైన మసకచీకట్లు రాజ్యంచేస్తున్నాయి. ఒత్తుగా రాలి, మెత్తటి తివాసీలావున్న ఆకులపైని ముసలివాడు హంసలా నడిచిపోయాడు

పోతూపోతూ ఎండిన చిన్ని కొమ్మనొకదాన్ని ఫెళ్లున విరిచాడు.

సూర్యరశ్మిలో ధగధగలాడుతూ ప్రశాంతంగావున్న పచ్చికబయలొకటి అతడికి కనబడింది. గడ్డిపోచలమీద లెక్కలేనన్ని వన్నె చిన్నెల మంచుముత్యాలు హృదయంగమంగా శోభిల్లుతున్నాయి.

హఠాత్తుగా ముసలివాడు తన పీపాచక్రాన్ని, దాంతో విరిచితెచ్చిన కర్రతో తోసుకొట్టి, పరిగెత్త సాగాడు

చక్రం రయ్యిమంటూ పచ్చిక బయలుమీద దొర్ల నారంభించింది. ముసలివాడు సంతోషాన్ని పట్టలేక పకపకమని నవ్వుతూ, ఆచిట్టిపాపలా చక్రంవెంట పరిగెత్తాడు. ఎగురుతూ, పడుతూ, శ్వాసాన్ని తోసుకుంటూ, కర్రను గిర్రున తిప్పుతూ, అచ్చంగా ఆకుర్రవాడిలా అతడుకూడా...

తాను తిరిగి పాపంపుణ్యం ఎరగని పసిపాప అయినట్టుగా ముసలివాడికి తోచింది. తన తల్లికూడా ఆప్యాయంగా చిరునవ్వుతూ తనవెంట వస్తున్నట్టు అతడికి అనిపించింది.

మేకపోతు గడ్డంలాంటి అతడి చిన్నిగడ్డం ఎగిరెగిరి పడింది. అతడి బోసినోటిలోనుంచి నవ్వూ, దగ్గూకూడా వచ్చాయి.

## 6

ఉదయానే ఆపచ్చిక బయలుకెళ్లి, చక్రంతో ఆడుకోవడం ముసలివాడికి పెద్దసరదా అయింది

తనను ఎవరైనా చూచి నవ్విపోతారేమోనని మొదట్లో, పాపం!...అతడు చాలా భయపడ్డాడు. ఈ ఆలోచన కలిగితే చాలు, అతడికి ఎక్కడలేని లజ్జా కలిగేది. అప్పుడతడి కళ్లు గజగజలాడేవి. చప్పగా చెదిరిపోయి, వెర్రి మొహంతో నాలుగు మూలలకూ పారజూచేవాడు

కాని అంతా వృత్తిభయమే! అతణ్ణి ఎవ్వరూ చూడ లేదు మనసారా ఆడుకుని, చిరునవ్వుమొహంతో ఇంటికి తిరిగి వెడుతూవుండేవాడు.

## 7

అతణ్ణి ఎవ్వరూ చూడా లేదు; ఏ ఆవాంతరమూ రానూ లేదు. చాలా రోజులు నిరభ్యంతరంగా ఆడుకున్నతర్వాత ఒకనాడు అతడికి చెడ్డజలుబు చేసింది; మంచంపట్టాడు; నాలుగురోజులపాటు తీసుకుని చచ్చిపోయాడు. ఫేక్టరీ ఆసుపత్రిలో అపరిచితులమధ్య ప్రాణాలను వదులుతూ, అతడు మహాప్రశాంతతతో చిరునవ్వాడు.

తాను కూడా పసివాడు కావడమూ, తల్లిటి పొట్లసీదను, పచ్చిక బయలుమీద, తన తల్లి ఆప్యాయంగా చూస్తూవుండగా ఎంచక్కాగాని ఆడుకోవడమూ,—ఇవే అతడికి అంతిమ క్షణాలలో గభీరమైన సంతృప్తిని కలిగిచాయి!

# కంకరరాయి

## ఫెడర్ సోలోగబ్

ఆవూళ్లో ఒక కంకరరోడ్డు వుంది. ఆరోడ్డున వస్తూపోతూ వుండే బళ్లచక్రాల తాకిడికి కంకరరాయి వొకటి వూడింది. "తక్కిన రాళ్లతో కలిసి ఇరకాటంలో బ్రతకడం దేనికి? నేను విడిగా వుండిపోతాను" అని అది అనుకుంది.

దారినిపోయే కుర్రవాడొకడు వంగి, దాన్ని అందుకున్నాడు.

"నడిచి పోవాలనుకున్నాను; పోతున్నాను. గట్టిగా కోరుకోవాలే గాని, ఏ పని చెయ్యలేను!" అని ఆరాయి విర్రవీగింది.

పోతూ పోతూ, కుర్రవాడు దాన్ని ఒక ఇంటివైపు విసిరాడు.

"ఎగిరి పోవాలనుకున్నాను; ఎగురుతున్నాను. కోరుకోవాలేగాని, ఎగరడం ఎంత సులభం!" అని ఆరాయి పొంగిపోయింది!

వెళ్లి, అది కిటికీ తలుపుకు తగిలింది. తలుపుఅద్దం 'ఘల్లు' మంటూ పగిలిపోయింది

పగిలిపోతూ, "ఆసి ముండా! ఎంత ఘోరంచేశావే!" అంది

"మరి నాదారిలోనుంచి ముందుగా తప్పుకోవలసింది. ఎవరైనా సరే, నాదారికి అడ్డం రావడమంటే, నాకు చికాకు. నా సౌఖ్యంకోసం ఈప్రపంచం అంతా అని నామత" మంటూ

ఆరాయి హుంకరించింది.

వెళ్లి, మెత్తటిపరుపుమీద పడింది ఆ రాయి. పడి, "ఎగిరిరావడంవల్ల ఆయాసంగావుంది. కాసేపు ఇక్కడ విశ్రమిస్తాను" అని అనుకుంది

ఇంటి నౌకరువచ్చి, పరుపుమీది కంకరరాతినిచూసి, కిటికీగుండా దాన్ని తిరిగి బయటికి విసిరివేశాడు. అదివెళ్లి, రోడ్డుమీద పడింది.

యథాస్థానానికి చేరగానే, ఆరాయి తక్కినవాటితో ఇలాఅంది: "ఆ భవంతిని చూసివద్దామని వెళ్లానుగాని, శ్రీమంతులంటే ఏమో నాకు అసహ్యం కలిగింది. అంచేత సామాన్య ప్రజలలోనే వుందామని తిరిగి వచ్చేశాను!

# సమానహక్కులు

## ఫెడర్ సోలోగబ్

ఒక పెద్దచేప, చిన్నిచేపను తరుముకువెళ్లి మింగబోయింది.

"ఇది అన్యాయం సుమా! నాకూ నాలుగు కాలాలపాటు బ్రతకాలని వుంది. అన్నిచేపలకూ సమానహక్కులు లేవూ?" అని చిన్నిచేప గోలపెట్టింది.

"ఏమిటి, ఈగొడవ? మనకు సమానహక్కు లున్నాయో, లేవో నీతోనా చర్చించవలసింది? ఒక్కటే ప్రశ్న: నిన్ను నేను మింగనా, నీవు నన్ను మింగుతావా? నన్ను మింగ దలుచుకుంటే, భయం ఏమీ వద్దు! నేను కదలను, మెదలను, నిస్సంకోచంగా మింగివెయ్యి!" అని పెద్ద చేప అంది.

చిన్నిచేప కూడినంతగా నోరు తెరిచి, పెద్దచేపను మింగాలని ప్రయత్నం చేసింది కాని లాభంలేదని గ్రహించి "నీవే నెగ్గావు; నన్ను మింగివెయ్యి," అని నిట్టూర్చింది.

# ఫెడర్ డొస్టవస్కీ

# (1821-1881)

# అయిదు లక్షలు

మొన్నను నేనొక పెళ్లిని చూచాను... అబ్బే! ఈ పెళ్లినిగురించి చెప్పడంకంటే, ఒకప్పుడు నేను చూచిన క్రిస్మస్ పండగను గురించి చెప్పడమే బాగుంటుందేమో! ఈ పెళ్లి గొప్పగా జరిగింది. దీన్ని చూచి నేను చాలా సంతోషించానుకూడా. అయితే, ఆ రెండోది ఇంతకంటె ఎంతో మజా అయిన సంఘటనం. ఈ పెళ్లిని చూడగానే, ఆ క్రిస్మస్ పండగనాటి నా కెందుకు జ్ఞాపకంవచ్చిందో తెలియదు. కాని, ఇది జరిగినవిధ మిది:

సరిగ్గా అయిదు సంవత్సరాలక్రితం, సంవత్సరాది రేపనగా, పిల్లలవిందు కొకదానికి నాకు ఆహ్వానంవచ్చింది. ఆహ్వానాన్ని పంపినవ్యక్తి వాణిజ్యప్రపంచంలో పేరెన్నికగన్నవాడు. అతడికి ఎన్నో వ్యవహారాలు, ఎందరో పరిచితులు, ఎన్నో పేచీలు. అంచేత, పిల్లలవిందు పేరుచెప్పుకుని, పెద్దవారంతా... కూడా

లాపంగా అన్నట్టు...తమ తమ స్వంతవ్యవహారాల్ని గురించి చర్చించుకోడానికి ఈయెత్తు యెత్తారని నాకు తోచింది.

నేను ఈ బృందానికి కొత్తవాణ్ణి. పైగా, చర్చించవలసిన వ్యవహారాలు నాకేమీ లేనందువల్ల, నేను తక్కినవారితో నిమిత్తం లేకుండా ఆ పూటను గడపగలిగాను. నాలాగే పొరపాటు వల్లనో గ్రహపాటువల్లనో ఆ విందుకువచ్చినవాడు ఇంకొకవ్యక్తి కూడా వున్నాడు. నా దృష్టిని ముందుగా ఆకర్షించింది అతడే. ఆకృతినిబట్టిచూస్తే, అతడు పెద్దకుటుంబంలో పుట్టినవాడులా లేడు. బారుగా, బక్కపలచగా వున్నాడు. మొహంలో సౌమ్యత ఏమీ లేదు. చవకటి దుస్తుల్ని వేసుకున్నాడు. చూడగా అతడికి ఈ విందులూ, గిందులూ అంటే అంతగా ఇష్టంవున్నట్టు లేదు. తక్కినవారిలోనుంచి తప్పుకుని, ఒకపక్కకు తొలగగానే అతడి పెదవులమీది చిరునవ్వు మాయమైపోయింది. అతడి నల్లటి గుబురు కనుబొమలు ముడిపడ్డాయి. అతడికి ఆతిథేయితో తప్పితే, మరెవ్వరి తోనూ పరిచయంలేదు. చివరివరకూ అంతటినీ చూచి ఆనందిస్తూ వున్నట్టునటించినా, అతడికి ఈవేడుక చెడ్డతలనొప్పి అనిపించినట్టే కనబడింది. అత డేదో చిన్నబస్తీలో పుట్టిపెరిగినవాడనీ, పెద్ద వ్యవహారాన్ని దేన్నో నెత్తినిపెట్టుకుని రాజధానీనగరానికి వచ్చాడనీ, మా ఆతిథేయిదగ్గిరికి ఒక సిఫారసు వుత్తరాన్ని తెచ్చాడనీ, విధిలేక మా ఆతిథేయి అతణ్ణి దగ్గిరికిచేర్చాడనీ ఆతర్వాత తెలుసుకున్నాను. వదిలిపెడితే మర్యాదగావుండదు గనక, అతణ్ణి ఆనాటి విందుకు పిలిచారు.

అతడితో తక్కినవారు చీట్లాట ఆడలేదు. అతడికి చుట్టనైనా ఇచ్చిన పాపాన పోలేదు. ఎవ్వడూ అతడితో సంభాషణకు దిగలేదు. అంతదూరాన వుండగానే తోకకుచ్చునుబట్టే ఏది ఏజాతిపిట్టో వాళ్లు నిర్ణయించుకోగలరు కామోసు! అందరూ వైదొలగి పోతూవుండడంవల్ల మన స్నేహితుడికి వుబుసుపోయే

వ్యవహారం తోచలేదు. అంచేత ఆపూటంతా తన మీసాల్ని మెలివెయ్యడంతో సరిపుచ్చాడు. అతడి మీసాలు చక్కనివనే చెప్పాలి. కాని, అతను వాటిని అదేపనిగా మెలివెయ్యడాన్ని చూస్తే, ఆ మీసాలే ముందుగా పుట్టాయనీ, వాటిని మెలివెయ్యడం కోసం అతడు ఆతర్వాత అవతరించాడనీ అనుకోవలసివచ్చింది!

నా దృష్టిని ఆకర్షించిన అతిథి ఇంకొకడున్నూ వున్నాడు. కాని, అతడి స్వరూపం అంతా వేరు. అతడు గొప్పవాడు. వాళ్లు పిలవడాన్నిబట్టిచూస్తే, అతడి పేరు జ్యూలియన్ మస్తకోవిచ్. చూచీచూడ్డంతోనే, తక్కిన అతిథులందరు ఒకయెత్తూ, అతడొక్కడూ ఒకయెత్తూ అనే విషయం స్పష్టపడిపోతున్నది. మీసాల పెద్దమనిషిని ఎంతో చులకన చేస్తున్నారో, ఇతణ్ణి అంత గౌరవంచేస్తున్నారు. గృహస్థుడూ, గృహిణికూడా అతడికెన్నో కులాసాకబుర్లను చెబుతున్నారు; అతడికి ఎక్కడ ఏమి లోపం జరుగుతుందోనని వెయ్యికళ్లతో కనిపెట్టిచూస్తున్నారు; అతడి మెప్పును పొందాలని తహతహలాడుతున్నారు; అందరినీ తీసుకువచ్చి అతడికి పరిచయంచేస్తున్నారు. జూలియన్ మస్తకోవిచ్ ఇంత చక్కనివిందును నా జీవితంలో పూర్వం చూచివుండలేదని అనేసరికి మా అతిథేయి కళ్లు ఆనందభాష్పపూరితాలైనాయి. ఎంచేతనో ఈ గొప్పవ్యక్తి సముఖాన నిలబడ్డం అంటే, నాకు కంపరం అనిపించింది. అంచేత పిల్లలతో కాసేపు ఆడుకుని — ఆ పిల్లలలో అయిదుగురు మా అతిథేయి బిడ్డలే! మంచిపుష్టిగా వున్నారు — ఏకాంతంగావున్న ఒక చిన్న సిటింగ్ రూంలోకి వెళ్లి, చాటుగా ఒకమూల కూర్చున్నాను.

పిల్లలు చాలా ముద్దుగావున్నారు. తల్లులూ, గవర్నెస్‌లూ (ఉపాధ్యాయినులూ) ఎంత ప్రయత్నించినా, వాళ్లు వాళ్ల పెద్దవాళ్లలానే నటించడానికి ససేమిరా ఒప్పుకోవడం లేదు. అల్లరిగా ఒకరినొకరు తోసుకుంటూ, క్రిస్మస్ ట్రీకి వేలాడ

గట్టిపున్న బహుమానాలను—ఏది ఎవరికో నని చూచుకోడానికైనా ఆగకుండా—వూడపెరుక్కున్నారు. ఈ తోపెడిలో మొత్తం బహుమానాలలో సగం ముక్కచెక్కలై పోయినాయి.

ఆపిల్లలలో ఒక చిన్నకుఱ్ఱవాడు చాలా చక్కగా వున్నాడు. కాటుక కళ్లు. ఉంగరాల జుత్తు. మహా ముద్దుగున్నాడు. తన క్రొత్తపాకీతో నన్ను గురిపెట్టి కాల్చాలని వాడు చాలా ప్రయత్నించాడు. కాని, వాడికంటెకూడా వాడి అక్కయ్య చాలా అందంగావుంది. ఆపూట అందరికళ్లూ ఆ అమ్మాయిమీదే వున్నాయి. ఆపిల్లకు అది పదకొండోయేడు. నెమ్మదీ, ఆలోచనా వున్న బాలికలా కనబడుతున్నది. చేరడేసి కళ్లు. అవి కలలు కంటూవున్నట్టున్నాయి. పిల్లలు ఆ అమ్మాయి మనస్సును నొప్పింపజేసినట్టున్నారు. అందుచేత, వాళ్లను వదిలిపెట్టి, సరాసరి నేనున్నగదిలోకి వచ్చింది. వచ్చి తన బొమ్మతో పాటు ఒకమూలకు వొదిగి కూర్చుంది.

"ఆ పిల్లతండ్రి చాలా భాగ్యవంతుడు; అమ్మాయి కట్నంకోసం అప్పుడే మూడులక్షల రూబుల్సు విడిగా మూటకట్టి వుంచాడు" అని అతిథులు గాంభీర్యవిస్మయాభయాలతో నిండిన కంఠాలతో ఒకరికొకరు చెప్పుకుంటూ, ఈ భోగట్టాను బయటపెట్టినవాడివైపుకు తలత్రిప్పేసరికి, నాచూపు జూలియన్ మస్తకోవిచ్ చూపుతో కలిసింది. చేతుల్ని వెనక్కు ముడుచుకుని, తలను ఒకవైపుకువంచి, తదేకధ్యానంతో అతడు ఈ బాతాఖానీని వింటున్నాడు.

బహుమానాల్ని పంచిపెట్టడంలో మా అతిథేయి చూపించిన తెలివితేటల్ని మెచ్చుకోవడంతోనే నాకు చాలాసేపు సరిపోయింది. లక్షలకట్నాన్ని కట్టుకువెళ్లనున్న ఆ చిన్ని అమ్మాయికి చక్కని బొమ్మను ఇచ్చాడు. తక్కిన బహుమానాలవిలువ వాటిని అందుకునే పిల్లల తల్లిదండ్రులస్థితినిబట్టి క్రమంగా

తగ్గుతూ వెళ్లింది. అందరికంటె చివరి కుర్రవాడికి—బక్కగా, రాగిజుత్తుతో, ముఖంమీద మచ్చలతోవున్న పదేళ్ల చిన్ని కుర్రవాడికి—వెళ్లిన బహుమానం, బొమ్మలూ గిమ్మలూలేని కథల పుస్తకం. వాడు గమనించుకోడు. పాపం, ఆ అమ్మి పేద యింటిది. పైగా వితంతువుకూడా. కథలపుస్తకాన్ని చూసుకుని, ఆ కుర్రవాడు ఎంతో చిన్నబుచ్చుకుని, బెదురు బెదురుగా తక్కిన పిల్లలబొమ్మల చుట్టూ తిరగసాగాడు. వాటితో తాను కూడా ఆడుకోవాలని ఎంతో సంబరపడ్డాడు. కాని, ధైర్యం చెయ్యలేక పోయాడు. అంత చిన్నతనంలోనూ తనది దిక్కుమాలినస్థితిఅని వాడు తెలుసుకున్నాడు!

పిల్లల్ని చూడ్డమంటే నాకు సరదా. వాళ్లలోని వ్యక్తిత్వం స్వస్వరూపప్రదర్శనంకోసం చేసేప్రయత్నాలు గమనించడానికి చాలా ముచ్చటగా వుంటాయి. రాగిజుత్తు కుర్రవాడికి తక్కిన పిల్లల బొమ్మలంటే—ముఖ్యంగా ఒక నాటకశాల అంటే—ఎంతో మురిపెంగా వుందని నాకు స్పష్టంగా తెలుస్తున్నది. ఈ మురిపాన్ని పట్టలేక, వాడు తక్కినవాళ్ల ఆటలలో చేరాలని కుతూహలపడుతున్నాడు. ఇందుకోసం వాళ్లను మెప్పించడానికి ప్రయత్నిస్తున్నాడు. చిరునవ్వుతో దగ్గరకుచేరి, నెమ్మదిగా తానూ వాళ్ల బొమ్మలతో ఆడకోసాగాడు. వాడికి ఒక్క యాపిల్ పండు మాత్రమే దక్కింది. ఈ వొక్క పండునూ దుక్కలా వుండి, జేబును పళ్లతో నింపుకున్న కుర్రవాడికి ఇచ్చి వేశాడు. ఇంకో కుర్రవాణ్ణి వీపున గుర్రంలా ఎక్కించుకుని గిరగిర తిరిగాడు. ఈ శ్రమ అంతా ఆ నాటకశాలబొమ్మతో కాసేపు ఆడుకోడానికే!

కాని, నాలుగైదునిమిషాలలోనే ఒక బండవెధవ... పాపం!...వాడి మీదపడి, చావ చితకగొట్టాడు. ఆవుసుమని ఏడవడానికైనా ... పాపం! ... వాడికి ధైర్యం లేకపోయింది.

గవర్నెస్ వచ్చి, ఇంకా పిల్లల ఆటలజోలికి వెళ్ళొద్దని చెప్పింది. వాడంతట బిక్క-మొహంవేసుకుని, నేనూ, ఆ చిన్న అమ్మాయీ వున్న గదిలోకి వచ్చాడు. ఆ పిల్ల, వాణ్ణి తనపక్కన కూర్చో నిచ్చింది. వాళ్ళిద్దరూ తమచేతిలోని (ఖరీదైన) బొమ్మలకు లాగూ, చొక్కాలను తొడగడంలో నిమగ్నులై పోయారు.

సుమారు అరగంటగడిచింది. రాగిజుత్తు కుఱ్ఱవాడూ, అందమైన ఆ అమ్మాయీ మాటాడుకుంటూవున్న మాటల్ని ఒకచెవితో వింటూకూర్చున్న నాకు నిద్రమైకం కమ్ముకోబోతున్నది. ఇంతలో హఠాత్తుగా జూలియన్ మస్తకోవిచ్ ఆ గదిలోకివచ్చాడు. పిల్లలు గందరగోళంచేస్తూవుండగా, ఆ అదనుచూసుకుని, అతడు మెల్లగా హాల్లోనుంచి తప్పించుకున్నాడు. నేను గదిలో ఒక మూలకు వొరిగి కూర్చునివున్నా, అతను కొన్నినిమిషాలక్రితం ఆ భాగ్యవంతురాలైన పిల్ల తండ్రితో......కోరి, పరిచయం చేయించుకుని...పులుముకుంటూవున్నట్టు మాట్లాడ్డం గమనించక పోలేదు.

అతను ఏదో ఆలోచిస్తూ, గొణుక్కుంటూ కాసేపు కదలక మెదలక నిలుచున్నాడు. వేళ్ళమీద ఏవో లెఖ్ఖల్ని వేస్తున్నట్టు కూడా తోచింది.

“మూడు లక్షలు—మూడు లక్షలు — పదకొండు— పన్నెండు—పదమూడు — పదహారు—అయిదేళ్ళలో! నూటికి నాలుగుచొప్పున అనుకుందాం—అయిదు పన్నెండ్లు—అరవై. ఈ అరవైపైన—అయిదేళ్ళలో—ఇది నాలుగులక్షలు అవుతుందని అనుకుందాం. బాగు—బాగు! కాని, ముసలిఘటం నూటికి నాలుగువడ్డీతో సంతృప్తిపడదు. నూటికి ఏ ఎనిమిదో, పదో గుంజుతాడు. అంతా అయిదు ... అయిదులక్షలు కావచ్చును. కనీసం అంతవరకూ ఖాయం. అంతకుమించి సాదరుఖర్చులకోసం ఏమాత్రమైనా—”

జిగ్రగన చీది, అతడు గదినిడిచి వెళ్లిపోతున్నాడు. ఇంతలో పిల్లపైకి చూపువెళ్లింది. చప్పున ఆగిపోయాడు. మొక్కలవెనక వున్నందున నే నతడి కంటబడలేదు. ఉద్వేగంతో అతడు కంపిల్లుతూవున్నట్టు నాకు తోచింది. లెఖ్ఖలు కట్టడంలో అతడి మనస్సు చికాకుపడివుండవచ్చును. చేతుల్ని నలుపుకుంటూ, ఇటూ ఆటూ అంగలు పంగలు వేస్తూ, అతడు అంతకంతకు అధికోద్రేకంలో పడిపోయాడు. చివరికేలాగైతే నేమి కొంత సంబాళించుకుని, ఒక్కచోట నిలబడిపోయాడు. భావివధూరత్నంవంక నిశ్చలంగా చూచి, ఆ అమ్మాయి కూర్చున్నవైపుకు అడుగువెయ్యబోయి, మళ్లీ అంతట్లోనే ఆగి, నాలుగు దిక్కులూ పరకాయించి చూచాడు. తర్వాత—పాపభీతిచేతనా అన్నట్టు... పిల్లి అడుగులు పెట్టుకుంటూ వెళ్లి, కిందికివంగి, ఆ పిల్లచేతిని ముద్దు పెట్టుకున్నాడు.

తలవని తలంపుగా అత డిలా చెయ్యడంవల్ల, ఆ అమ్మాయి త్రుళ్లిపడి, వెర్రికేక పెట్టింది.

"ఇక్కడ ఏమిచేస్తున్నావు, చిట్టీ!" అని బుజ్జగింపుగా అని, వెనక్కుతిరిగిచూస్తూ బుగ్గను గిల్లాడు.

"మేము ఆడుకుంటున్నాం."

"ఏమిటి, వీడితోనా?" అని గవర్నెస్ కొడుకువంక కోరచూపుచూస్తూ, జూలియన్ మస్తకోవిచ్ అన్నాడు. "నీవు డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లిపో!" అని వాడిని గదిమాడు.

కుర్రవాడు మెదలకుండా వూరుకుని, గుడ్లను రెంటినీ అప్పజెప్పి అతడివంక చూచాడు. జూలియన్ మస్తకోవిచ్ జాగ్రత్తగా ఆటూఇటూచూచి, తిరిగి పిల్లవెంపుకు వంగాడు.

"ఏమిటది? బొమ్మేనా, చిట్టీ?"

"ఔనండీ!", ఆ అమ్మాయి కాస్త చికాకు కనబరిచింది; నుదురు ముడతలు పడింది.

"బొమ్మా? బొమ్మల్ని దేనితో చేస్తారో తెలుసా, చిట్టీ!"

"తెలియదండీ!" అని వినీ వినబడనట్టు అని, ఆపిల్ల తలవంచి వేసుకుంది.

"చెత్తా చెదారంలో చేస్తారు, చిట్టీ! అరే! వెధవా! నీవు డ్రాయింగ్ రూంలోకి వెళ్లి, మిగతా పిల్లలతో ఆడుకో!" అని జూలియన్ మస్టకోవిచ్ కుర్రవాడివంక తీవ్రంగా చూస్తూ అన్నాడు.

పిల్లలిద్దరు కోపంతో ముఖం ముడిచారు. ఒకరుచేతి నొకరుపట్టుకుని, చీలి వెళ్లమని చెప్పారు.

"ఈ బొమ్మను నీ కెందుకిచ్చారో తెలుసా?" అని అంత కంతకు బొంగురుగొంతుతో మాట్లాడుతూ జూలియన్ మస్టకోవిచ్ అడిగాడు.

"తెలియదు"

"ఒక్క వారంరోజులపాటు నీవు ఏ అల్లరీ చెయ్యకుండా చక్కనిపిల్లలా—చాలా చక్కనిపిల్లలా—నడుచుకున్నావుగనక"

ఈమాటల్ని అంటూవుండగా జూలియన్ మస్టకోవిచ్ గజగజ వణికిపోయాడు. వెనక్కు తిరిగిచూచి, ఉద్రేకంవల్లనూ, ఆతురతవల్లనూ దాదాపుగా వినబడకుండావున్న గొంతుతో అతడిలా అన్నాడు:

"నేను మీయింటికి వస్తూ పోతూవుంటే, నీవు నన్ను ప్రేమిస్తావా, చిట్టీ?"

ఆ చిట్టిబాలను ముద్దెట్టుకోవాలని అతడు ప్రయత్నించాడు. కాని, రాగిజుట్టు కుర్రవాడు...ఆ అమ్మాయి కళ్లవెంట గిఱ్ఱున నీళ్లుతిరగడంచూచి...ఆపిల్ల చిట్టిచేతిని తన చేతిలోకి తీసుకుని, సానుతాపంకొద్దీ ఆవురుమని ఏడ్చివేశాడు. దీనితో జూలియన్ మస్టకోవిచ్ కు పెద్దకోపం వచ్చింది.

"పోరా, వెధవా! పో! ఆ గదిలోకి వెళ్ళి నీ జతగాళ్ళతో ఆడుకో!"

"నాకు వెళ్ళక్కర్లేదు. వాడు వెళ్ళక్కర్లేదు! నీవే పో!" అని ఆపిల్ల గోలపెట్టింది. "వాణ్ణి వుండనివ్వు! వాణ్ణి వుండనివ్వు!". పాపం! చెక్కిళ్ళపై కన్నీళ్ళు కారాయి.

వాకిట్లో అడుగుల చప్పుడు వినబడింది. జూలియన్ మస్తకోవిచ్ ఉలిక్కిపడి, సరిగా లేచి నిలుచున్నాడు. రాగిజుట్టు కుర్రవాడు ఇంతకంటె కూడా బెదిరిపోయాడు. వాడు ఆ అమ్మాయి చేతిని జారవిడిచి గోడపక్కగా దొంగిలి వెళ్ళి, డ్రాయింగ్ రూంలోకి పారిపోయాడు.

ఎవ్వరూ అనుమానపడకుండా వుండడానికి జూలియన్ మస్తకోవిచ్ కూడా డైనింగ్ రూంలోకి వెళ్ళాడు. అతడి మొహం కందగడ్డలావుంది. తన ఉద్రేకాన్ని, తన అశాంతిని చూస్తే తనకే సిగ్గు కలిగివుండాలి. ఈ గుణకారం వ్యామోహంలో పడిపోయి, తన అధికార్నీ, తన మర్యాదను మరచిపోయి — తాను కోరినవస్తువు కోసం చేతులు ఎగజాచే కుర్రవాడిలా — ప్రవర్తించాడు. సాంసారికంగా ఆ అమ్మాయి అప్పటికింకా కోరదగిందిగా లేదు. కాని, మరో అయిదేళ్ళనాటికి కోరదగింది అవుతుంది. ఆ ఘనుడి వెనకనే నేనుకూడా డైనింగ్ రూంలోకి వెళ్ళాను. వెళ్ళేసరికి అక్కడ ఒక అద్భుతమైన నాటకం జరుగుతూవుంది.

జూలియన్ మస్తకోవిచ్ కసుగుదలతో కందిపోయి, మొహంలో విషాన్ని కక్కుతూ, రాగిజుట్టుకుర్రవాణ్ణి కోప్పడుతున్నాడు. ఆకుర్రవాడు బెదిరిపోయి వెనక్కి వెనక్కి అడుగులు వేసుకుంటూ వెళ్ళి, మరి వెనక్కి వెళ్ళడానికి వీలులేక నిలబడిపోయి, ఎటు పారిపోవడానికీ దారిగానక తికమక పడుతున్నాడు.

"బయటికిపో వెధవా! ఏమిచేస్తున్నా వక్కడ? పో! పొమ్మంటూవుంటే, కదవా! పళ్లు కాజెయ్యాలని చూస్తున్నావ్? ఊహుఁ! కాజెయ్యి! ఫో! మచ్చలమొహం వెధవా? పోయి, నీ సాటి వాళ్లతో తగలబడు!"

బెదరిపోయిన ఆ కుర్రవాడు ఏమీ దారిగానక గబగబ టేబుల్ క్రిందకు దూరాడు. దీన్ని చూచి, జూలియన్ మస్టకోవిచ్ కోపాన్ని పట్టలేక, తన పెద్ద చేతిరుమ్మాల్ని తీసి, దానితో కొరడాతో కొట్టినట్టు కొడుతూ, కుర్రవాణ్ణి బయటికి తోలాలని ప్రయత్నించసాగాడు.

ఇక్కడ జూలియన్ మస్టకోవిచ్ ఆకృతిని గురించి రెండు మాటల్ని చెప్పాలి. అతడు ఏమాత్రమో స్థూలకాయుడు. తిండి పుష్టివున్న ఘటం; బుగ్గలు బూరెలా వుంటాయి; గుమ్మడిపండు లాంటి బొజ్జ, మడమలు ఇనపగుళ్లలా వున్నాయి; తెగ చెమటలు కారుస్తున్నాడు; ఆయాసపడుతున్నాడు; ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు, ఆ కుర్రవాడంటే అతడికి ఎంత కోపంగా వున్నదంటే—లేక, అది అసూయా?—ఆ తీవ్రతలో పిచ్చివాడిలా వాణ్ణి బాదసాగాడు.

నేను విరగబడినవ్వాను. జూలియన్ మస్టకోవిచ్ వెనక్కు తిరిగాడు. ఒకక్షణంపాటు అతడు—తన అధికార్యాన్ని కూడా మరిచిపోయి—తత్తరపడిపోయాడు. సరిగా ఆనిమిషంలోనే మా ఆతిథేయి యెదుటివాకిలిదగ్గ ప్రత్యక్షమయ్యాడు. కుర్రవాడు టేబుల్ కిందనుంచి బయటికొచ్చాక్కి, చేతుల్నీ, మోకాళ్లనూ దులుపుకున్నాడు. జూలియన్ మస్టకోవిచ్, అంతవరకూ ఒకకొసతో పట్టుకునివున్న తన చేతిరుమాలును చప్పునముక్కుదగ్గర పెట్టుకున్నాడు. మా ఆతిథేయి మా ముగ్గురివంక కాస్త అనుమానంగా చూచాడు. కాని, ప్రపంచంలోతుపాతులు తెలిసివుండడంవల్ల ఎట్టి పరిస్థితికైనా క్షణకాలంలో సర్దుకునేవాడిలా, అతడు ఈ తను

జాన్ని తన అతిథిదగ్గరనుంచి తనకు కావలసిన ప్రయోజనాన్ని సాధించడానికి వుపయోగించుకో బోయాడు.

"ఈ కుర్రవాడిమాటే నే నింతకుముందు తమతో చెప్పింది," అని రాగిజుత్తుకుర్రవాణ్ణి వేలెత్తిచూపుతూ అత డన్నాడు. "ఉదారబుద్ధిగల తమరు వీడికి ఏమైనా సహాయంచెయ్యక పోతారా అని నే ననుకున్నాను"

"ఓహో!", అని జూలియన్ మస్తకోవిచ్ ముక్తసరిగా జవాబిచ్చాడు. ఇంకా తన వుద్రేకాన్ని పూర్తిగా అణుచుకో లేక, కుర్రవాడివంక నిప్పులు కక్కుతూ చూచాడు.

"వీడు మా నర్సుకొడుకు" అని మా అతిథేయి మళ్లీ అందుకున్నాడు, ప్రార్థనాపూర్వకమైన కంఠంతో. "పాపం! ఆ అమ్మ చాలా పేదది. విధవరాలు కూడా. అంచేత నే మీ కేమైనా వీలుంటే..."

"వీల్లేదు, వీల్లేదు!" అని జూలియన్ మస్తకోవిచ్ మాటకు అడ్డు వచ్చాడు. "నీవు నన్ను క్షమించాలి, ఫిలిప్ ఎలిజ్జాయివిచ్ ! నే నేమీ చెయ్యలేను. విచారించి చూచాను; ఏమీ ఖాళీలు లేవు. పైగా, ఏమైనా ఖాళీవస్తుందా అని ఏనాటినుంచో పది మంది కాచుకు కూర్చున్నారు. వీడికంటె కూడా వాళ్లసంగతి ముందుచూడాలి. అబ్బె! లాభంలేదు."

"అనొగ్యా! అలానా!" అని మా ఆతిథేయి అన్నాడు. "వీడు, పాపం నెమ్మదైనకుర్రవాడు. ఒకరిజోలికి పోడు."

"ఎబ్బె! పట్టి అల్లరివెధవ!" అని జూలియన్ మస్తకోవిచ్ అన్నాడు మొహం తిప్పివేసుకుంటూ. "అబ్బాయి! పో! ఇంకా ఇక్కడెందుకున్నావ్ ? వెళ్లి, మిగతాపిల్లలతో ఆడుకో ! పో!"

పట్టలేక అతడు ఓరకంట నన్ను చూచాడు. నేనూ పట్టలేక, అతడిమొహం యెదటే విరగబడినవ్వాను. అతడు మొహాన్ని వెనక్కు తిప్పివేసుకుని, నాకు వినబడేటట్టుగానే, ఈ వింతమనిషి

యెవడంటూ మా అతిథేయి నడిగాడు. కాసేపు గుసగుసలాడి, నన్ను ఖాతిరీ చెయ్యకుండానే, వాళ్లిద్దరు గదిబయటికి వెళ్లిపోయారు.

ఎంతసేపటికోగాని నేను నవ్వు ఆపుకోలేకపోయాను. ఆ తర్వాత నేనుకూడా డ్రాయింగ్ రూంలోకి వెళ్లాను. అక్కడ మన ప్రబుద్ధుడిచుట్టూ అప్పటికప్పుడే పిల్లలతల్లిదండ్రు లందరు చేరారు. అతడు అప్పుడే తాను పరిచయంచేసుకున్న ఒకఆవిడతో చనువుగా మాటాడుతున్నాడు. ఆవిడ భాగ్యశాలైన ఆ చిన్ని అమ్మాయిచేతిని పట్టుకుని నిలబడి వుంది. జూలియన్ మస్టకోవిచ్ ఆ అమ్మాయిని విపరీతంగా ప్రశంసిస్తున్నాడు. ఆ అమ్మాయి అందాన్ని, ఆ అమ్మాయికున్న తెలివితేటల్ని, ఆ అమ్మాయి మొహంలో తొంగిచూస్తూవున్న కళను, ఆ అమ్మాయి నడవడిలోని మార్దవాన్ని గొప్పగా వర్ణించాడు. "ఇంతచక్కని పిల్లనుకన్న నీవు ధన్యురాలవుసుమా!" అన్నట్టు తల్లినికూడా ప్రస్తుతించాడు. పాపం! ఆనందపారవశ్యంకొద్దీ కన్నీళ్లను ఆపుకోలేకపోయింది, ఆ అమాయకురాలు. పోతే, ఆ అమ్మాయి తండ్రికూడా చిరునవ్వుద్వారా తనసంతోషాన్ని వెల్లడించాడు.

ఆ తల్లిదండ్రుల ఆనందం అక్కడున్న అందరినీ ఆవరించినట్టు కనబడింది. చివరికి పిల్లలుకూడా ఆ సంభాషణకు ఎక్కడ అడ్డువస్తామోనని భయపడ్డట్టుగా తమ ఆటల్ని కట్టిపెట్టారు. అంత పొగడ్తను సంపాయించుకున్న ఆ అమ్మాయి తల్లి, సంతోషంతో పొంగిపోతూ, చాలా మర్యాదపూర్వకంగా మా గృహాన్ని పావనంచేసి వెళ్లవలసినదంటూ జూలియన్ మస్టకోవిచ్‌ని ఆహ్వానించింది. జూలియన్ మస్టకోవిచ్ మహాప్రసాదంలా ఆ ఆహ్వానాన్ని అంగీకరించాడు. ఆ తర్వాత అతిథు లందరు అతిమర్యాదగా ఆగదిలో అక్కడక్కడ విడిగా కూర్చున్నారు. వాళ్లందరు భక్తిపూర్వకమైన కంఠాలతో ఆ వర్తకుణ్ణి,

అతడి భార్యనూ, అతడి కుమార్తెనూ, వాళ్లకంటే యెక్కువగా జూలియన్ మస్తకోవిచ్‌నూ శ్లాఘించడం విని విని—

"అతడి పెళ్లి అయిందా?" అంటూ జూలియన్ మస్తకోవిచ్ పక్కనే నిలబడివున్న ఒక పరిచితుణ్ణి బిగ్గరగా కేకవేసి అడిగాను.

జూలియన్ మస్తకోవిచ్ నావంక ఒక విషపుచూపు చూచాడు.

"కాలేదు" అని నా పరిచితుడు జవాబు చెప్పాడు, నా... కావాలని చేసిన... పొరపాటుకు విసుక్కొంటూ.

మొన్న నొకనాడు నేను — చర్చిముందునుంచిపోతూ, అక్కడ జరుగుతూవున్న పెళ్లిచూడ్డానికి చేరిన జనసమూహాన్ని చూచి ఆగిపోయాను. అది మసకగావున్న రోజు. చిన్న తుంపర పడబోతున్నది. జనసమ్మర్దంగుండా దారిచేసుకొంటూ చర్చిలోకి వెళ్లాను. పెళ్లికొడుకు గుండ్రంగా, తిండిపుష్టివున్న వాడిలా వున్నాడు. పెద్దపొట్టవుంది. పోకిరి ముస్తాబు చేసుకున్నాడు. అతడు ఇటూ అటూ పరిగెడుతూ, హడావుడిపడుతూ అందరికీ పనులు పురమాయిస్తున్నాడు. చివరకు పెళ్లికుమార్తె వస్తున్నదంటూ కబురు వచ్చింది. నేను జనాన్ని తోసుకుంటూ ముందుకువెళ్లి, ఇంకా ప్రథమవసంతాన్నైనా యెరగని ఒక లోకమోహన బాలను చూచాను. కాని, ఆ బాలవదనం కళావిహీనంగానూ, చింతాక్రాంతంగానూ వుంది. ఆవిడ హృదయం సంక్షోభిస్తూ వున్నట్టుంది. ఆ క్రితంవారమూ ఏడ్చిఏడ్చి వుండడంవల్ల కాబోలు ఆవిడ కళ్లు యెఱ్ఱబడివున్నాయి. ఆవిడ ఆకృతిలోనుంచి అనిర్వచనీయ బాల్యచాపల్యమేదో తొంగిచూస్తూ, మాటలతో నిమిత్తం

లేకుండా నే "నన్ను దయచూడండి" అని ప్రాధేయపడుతూ వున్నట్టుంది.

ఆ బాలకు ఇంకా పదహారేళ్లు సరిగా నిండలేదని ఎవరో అన్నారు. నేను పెళ్లికొడుకువంక పరిశీలనగా చూచాను. చూచి, హఠాత్తుగా జూలియన్ మస్టక్కోవిచ్‌ని గుర్తుపట్టాను. అతణ్ణి ఈ అయిదేళ్లలోనూ నేను తిరిగి కలుసుకోనేలేదు. అప్పుడు తిరిగి పెళ్లికూతురువంక చూచాను—ఆరిదేవుడా! ... వీలైనంత త్వరగా చర్చి బయటికివచ్చిపడ్డాను. పెళ్లికూతురు భాగ్యాన్ని గురించీ, ఆవిడకిస్తున్న అయిదులక్షల కట్నాన్ని గురించీ, సాదరుఖర్చులకు విడిగామూటకట్టివున్న మొత్తాన్ని గురించీ జనం గుసగుసలాడుతున్నారు.

"అయితే, అతడి మదింపు సరిపోయినదన్నమాట!" అని వీధిలోకి జారుతూ నేననుకున్నాను.

## లియోనీ ఆంద్రీవ్

## (1870-1919)

# స్వాతంత్ర్యగీతి

అతడు ఊరూ పేరూ లేనివాడు. అతడి కెంత పిరికో, అంత ఓపిక. హాస్యధోరణిలో వుండి కాబోలు, విధి అతణ్ణి లాక్కొచ్చి, ఖైదీలమైన మామధ్య పారేసింది. అతణ్ణిచూచి మేము కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వాము. కొన్ని పొరపాట్లను చూస్తే, నిజంగా నవ్వే వస్తుంది! ఇహ అత డంటారూ?—వేరే చెప్పడందేనికి?—అత డేడ్చాడు. అన్ని కన్నీళ్లు నష్టయివున్న వాణ్ణి నేను నా జీవితంలో మరెవ్వడినీ చూడలేదు. పైగా, అవి ఇట్టే కారేవి! కళ్లవెంటా, ముక్కువెంటా, నోటివెంటా ఒకటే ధార! స్పాంజిని నీళ్లలో ముంచి, పిండినట్టే! మాలోకూడా కొందరు యేడవడం నే నెరుగున్నాను. అయితే, వాళ్ల కన్నీళ్లలో అగ్ని వుండేది. ఆ అగ్నిలో అడవిమృగాలు పసుగు

పెట్టుతూ కనబడేవి. పౌరుషయుక్తమైన ఈ కన్నీళ్లు ముఖా
పైన వృద్ధాప్యచిహ్నాలను అంకితంచేసినా, నేత్రాలకు మాత్రం
యవ్వనదీప్తిని ప్రసాదించేవి. కళ పెళ ఉడికిన భూగర్భంలో
నుంచి బయలుదేరే లావామాదిరిగా ఇవి మాయని చిహ్నాలను
వదిలి పెట్టడమే కాకుండా, అల్పవాంఛలూ, స్వల్పకష్టాలూ అనే
పట్టుశాల నన్నింటినీ భస్మీపటలం చేసినవి. కాని, అతడి కన్నీళ్ల
ఫలితం కండినముకూ..., తడిసిన జేబుగుడ్డా మాత్రమే! అత
డెప్పటికప్పుడు జేబుగుడ్డల్ని దండెంమీద ఆరవేసుకుంటూ వుండే
వాడు కాబోలు. లేకపోతే, ఎన్ని డజన్లైనా ఒక్క నాటికే
సరిపోయేవి కావుగా!

ప్రవాసంలో వున్నన్ని రోజులూ అతడు నిజమైన అధి
కారులవాటే కాకుండా, తన కోసం వ్రాస్తున్నవాళ్ల వెంట
కూడా పడేవాడు; వాళ్ల పాదాలు పట్టుకునేవాడు; ఏడ్చేవాడు;
తాను ఏపాపమూ ఎరగనని ఒట్లు వేసుకునేవాడు; తన పసివాళ్ళని
చూసైనా, దయ చూపవలసిందని మొత్తుకునేవాడు; తన కష్ట
సుఖాలు చెప్పుకోడానికి, తన భక్తిని వెల్లడించడానికీ తప్ప, తన
నోరు విప్పనని వాగ్దానాలు చేసేవాడు. మా మాదిరిగానే వాళ్లు
కూడా అతణ్ణిచూచి నవ్వి, "పాపం! వెర్రివెంగళాయి" అని
అంటూవుండేవారు. వాళ్లు అతణ్ణి పిలవడంకూడా "అరె! వెర్రి
వెంగళాయి!" అనే.

అలా పిలిచినప్పుడల్లా అతను [illegible] చూసేవాడు.
పిలిచిన ప్రతిసారీ తన విడుదల్నిగురించి తనవాళ్లను అడుగుతా
రేమోనని అతడి ఆశ. అతడి [illegible] చూచి, వాళ్లు
అల్లరికి ఒకసారికి రెండుసార్లు కేకలు వేసేవారు. అతను ఏమీ పాపం
యెరగనివాడని...మాకు తెలిసినట్టుగానే...వాళ్లకూ తెలుసు.
అయితే, అతణ్ణి బాధపెట్టడంవల్ల మిగిలిన వెంగళాయిల్నికూడా
భయంలో వుంచవచ్చుగదాఅని వాళ్ల ఆలోచన! అక్కడికి

మే మిదివరకే పిరికిపందలముకానట్టు, ఎందుకో ఈ పనికిమాలిన పటాటోపం!

ఒంటరిగా బ్రతకలేక, భయపడిపోయి, అతడు మాదగ్గరికి కూడా వచ్చేవాడు. కాని, మా మొహాలు కర్కశంగా, నల్లరాళ్లలా వుండేవి. ఎలాగైనా పలకరించాలనీ, మాటాడాలనీ తెగప్రయత్నించేవాడు. గజగజలాడుతూ, మమ్మల్ని "డియర్ కామ్రేడ్స్" అని పిలిచేవాడు. మేము తలపంకించి, "జాగ్రత్త! వాళ్లు నీమాటలు వింటున్నారు" అని అనేవాళ్లం.

లేచివెళ్లి, బెదురుతూ బెదురుతూ తలుపుగుండా తొంగి చూచేవాడు. వట్టి వెర్రి వెంగళాయి! అప్పడిక నవ్వు ఆపుకోవడమెలా? మేము విరగబడేవాళ్లం. అయినా, ధైర్యం చిక్కబట్టుకుని, మరికొంచెం దగ్గరిగా జరిగి కూర్చుని, కళ్లవెంట నీరు కారుతూవుండగా, ఇంటిదగ్గరవున్న తన పుస్తకాల్ని గురించీ, తన తల్లినిగురించీ, తన తమ్ముళ్లనుగురించీ కబుర్లు చెప్పేవాడు. తనవాళ్లు క్షేమంగావున్నదీ, లేక బెంగపెట్టుకుని చచ్చిపోయిందీ, ఏమీ కూడా తెలియడంలేదని గోలపెట్టేవాడు.

ఎలాగో చివరకి అతణ్ణి పంపించివేసే వాళ్లం. మేము నిరసనవ్రతం ప్రారంభించినప్పుడు అతణ్ణి భయం ఆవేశించింది. అది యెంతటి వెర్రిభయమో చెప్పతరంకాదు. వెర్రి వెంగళాయికి తిండిఅంటే చెడ్డయిష్టం. పైగా, ఇటు మమ్మల్ని చూచినా భయమే; అటు అధికారుల్ని చూచినా భయమే! గంగిర్లు మొత్తినవాడిలా అతడు మామధ్య తిరిగాడు. నిమిషాని కోసారి జేబుగుడ్డను తీసి, కన్నీళ్ళను, చెమటనూ తుడుచుకున్నాడు. కాసేపటికి అతడు నా దగ్గరికివచ్చి, సంకోచిస్తూ సంకోచిస్తూ "చాలా రోజులపాటు, నిరసనవ్రతం చెయ్యబోతున్నారా? అని అడిగాడు.

"అబ్బో! చాలాకాలం!" అని నేను కఠినంగా జవాబు చెప్పాను.

"రహస్యంగానూడా మీరు ఏమీ తినరా?"

"ఏమో? మా అమ్మలు మాకు రొట్టెముక్కలు కాల్చి పంపిస్తారేమో!" అని నేను యెత్తిపొడిచాను. నావంక సందేహిస్తూ చూచి, నిట్టూరుస్తూ అతడు వెళ్లిపోయాడు. ఆమర్నాడు భయంతో వణికిపోతూ "డియర్ కామ్రేడ్స్! నేనూ మీతో పాటు నిరసనవ్రతం చేస్తాను" అని ప్రకటించాడు.

దీన్ని విని, అందరూ ఒక్కమాటగా, "వెళ్లివిడిగా చెయ్యి!" అని అన్నారు.

విడిగానే వెళ్లి, నిరసనవ్రతం సాగించాడు. మేము ఈమాట నమ్మలేకపోయాం. చాటుగా తిండి తింటున్నాడని అనుమాన పడ్డాం వార్డర్లకూ ఇదే అనుమానం తోచింది. కొన్నిరోజులు గడిచినతర్వాత పస్తువుండడంవల్ల అతను జబ్బుపడ్డాడని తెలిసింది. అప్పుడైనా మేము అంతగా ఖాతరీచెయ్యక "పోనీరా, వెర్రి వెంగళాయ్!" అని భుజాల్ని యెగరవేశాం.

కాని, ఎన్నడూ నవ్వని మా ముతాదారు డొకడు "అతనుకూడా మన కామ్రేడ్. వెళ్లిచూచివద్దాం, పదండి!" అన్నాడు.

అతడికి సంధించింది. అతడి జీవితంమాదిరిగానే అతడి పిచ్చిమాటలు కూడా దీనంగానే వున్నాయి. తన పుస్తకాల్ని గురించీ, తన తల్లినిగురించీ, తమ్ముళ్లనుగురించీ వాగుతున్నాడు; రొట్టెముక్క పెట్టమంటున్నాడు; తాను నిర్దోషినని ప్రమాణాలు చేస్తున్నాడు; క్షమించమని ప్రాధేయపడుతున్నాడు. నాదేశం, నాప్రాణున్, నా మాతృభూమి. అని కేకలువేస్తున్నాడు.

"నా ప్రాణున్!" అతడు చనిపోయినప్పుడు మేమందరమూ అతడి కుటీరంలోనే వున్నాము. ప్రాణాలు పోవడానికిముందు

అతడికి తెలివి వచ్చింది సర్వాంగాలూ శుష్కించి పోవడంవల్ల పూర్వరూపానికి కేవలం ఛాయామాత్రంగా కనబడుతున్నాడు. అతడు శాంతంగా పడుకునివుంటే అతడి క్షేమేచ్ఛులైన మేము చుట్టూనిలబడ్డాం. అత డిలా అనడం మా కందరికీ వినబడింది:

"నన్ను సమాధి చేసేటప్పుడు మార్సెలేజ్ పాడండి"

"ఏమిటంటున్నావ్?" అని మేమందరమూ సంతోషంతో కొంత కంపిస్తూ, ఆగ్రహంతో కొంత వుడికిపోతూ అడిగాము. అతడు తిరిగి అదే అన్నాడు.

"నన్ను సమాధిచేసేటప్పుడు మార్సెలేజ్ పాడండి."

అతడు కంట తడిలేకుండా వుండడం, మేమందరమూ కన్నీరు కార్చడం అదే మొదటిసారి. మా కన్నీళ్ళు అగ్నిధారలా భుగభుగ మన్నాయి.

అతడు చనిపోయాడు. అతడికోర్కె ప్రకారం మేము మార్సెలేజ్ పాడాము. యవ్వనకంఠాలు పాడిన ఆ స్వాతంత్ర్య గీతాన్ని సముద్రుడుహర్షించి, దాన్ని తన ఉత్తుంగతరంగశిఖరాలపై తీసుకువెళ్లి, ఫ్రాన్సుకు సమర్పించాడు.

మేము పాడాం. మాపైకి తుపాకులు గురిచూచి వున్నాయి; వాటిగుర్రాలు వికటంగా మెరుస్తున్నాయి; వాటి వాడి బేయునెట్లు మా గుండెల్ని సోకుతున్నాయి. అయినా, ఆ స్వాతంత్ర్యగీతం అధికోత్సాహంతో, అధిక కోద్వేగంతో మా గళసీమలనుంచి వెలువడింది; నల్లటి శవపేటిని మృదులహస్తాలు నెమ్మదిగా సమాధిలోనికి దింపాయి. మేము మార్సెలేజ్ పాడాం.



# టాల్‌స్టాయ్



— ఈ సంపుటిలో —

ఫెదర్ దాస్తొవస్కీ

ఇవాన్ టుర్గెనెవ్

సెవలోద్ గార్షిన్

అన్టాన్ చెకవ్

మాక్సిం గార్కీ

## ఇంకా ఎందరో ఇతర ప్రముఖుల కథలు

